మార్చి 1975



# భారతి

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

★

మార్చి 1975

సంపుటము : 52 : సంచిక : 3 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

# కళ్లముందే కలలు ఫలించిన రోజు

మన రాష్ట్రంలో 70 శాతానికి పైగా ప్రజలు గ్రామాల్లో నివసిస్తున్నారు. వారి ఆశలూ ఆశయాలూ, వారి సుఖాలూ సంతోషాలూ అన్నీ వారు దున్నుకొనే పొలంమీదే ఆధారపడి వున్నాయి. ఆ పొలాన్ని వారు దున్నుకొనే పద్ధతీ, దాని ఫలసాయంమీద వారికిగల హక్కు, భుక్తాల తీరుతెన్నులూ ఆ ప్రజల సాంఘిక జీవితంపైనా, ఆర్థిక స్థితిగతులపైనా ఎంతగానో ప్రభావం చూపిస్తాయి. అందుకే అత్యధికశాతం ప్రజలకు సాంఘిక, ఆర్థిక న్యాయాన్ని కల్పించే ఉద్దేశంతో భూసంస్కరణల చట్టాన్ని శాసనసభ రూపొందించింది.

మన రాష్ట్రంలో యీయేడు జనవరి 1 వ తేదీనుండి భూసంస్కరణలు అమలు జరుగుతున్నాయి. 1973 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (భూకమతాల గరిష్ఠ పరిమితి) చట్టం — అంటే 1973 సంవత్సరపు 1 వ చట్టం — ఆనాటినుండి అమల్లోకి వచ్చింది.

ఈ చట్టంలోని 8 (1) వ సెక్షను ప్రకారం, 1971 జనవరి 24 వ తేదీనగానీ, తరువాతగానీ బదిలీ చేయబడిన లేక ఒక ట్రస్టు ఏర్పాటుచేయబడిన భూమితోసహా 1975 జనవరి 1 వ తేదీనాటికి 10 ఎకరాల మాగాణి లేక 25 ఎకరాల మెట్టభూమికి మించిన భూమి విస్తీర్ణం కలిగివున్న ప్రతివ్యక్తీ, లేక కుటుంబ యూనిట్, ప్రకటించబడన తేదీలగాయతు 30 రోజులలోగా, లేక ప్రభుత్వ ప్రకటనద్వారా పొడిగింపబడిన గడువులోగా భూమి వివరాలను ట్రిబ్యూనల్ ముందు ప్రకటించుకోవాలి. 1974 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (భూకమతాల గరిష్ఠ పరిమితి) నిబంధనలలో నిర్ణయించిన 1 వ ఫారం రూపంలో యీ ప్రకటన జరగాలి. ఈవిధంగా ప్రకటించే గడువును ప్రభుత్వంవారు 1975 ఏప్రిల్ 11 వ తేది వరకు పొడిగించారు.



24 (1) సెక్షన్ ప్రకారం ఏ వ్యక్తి అయిన ఉద్దేశపూర్వకంగా, తగిన కారణంలేకుండా యీవిధంగా తమ భూకమతాల వివరాలను ప్రకటనచేయని పక్షంలో రెండేండ్లవరకు జైలుశిక్ష, లేక రెండు వేల రూపాయల జుల్మానాకుగానీ, లేక యీ రెండు శిక్షలకుగానీ పాత్రుడవుతాడు.

భూకమతాల వివరాలు ప్రకటించవలసినవారు ఎక్కువభాగం పల్లెసీమల్లో వుండేవారుగనుక వారికి బాగా తెలియగలందులకై యీ ప్రకటన చేయబడింది.

వెంటనే, గడువులోగా, అందరూ యీ వివరాలు ప్రకటించవలసిందిగా విజ్ఞప్తి.

ఆం. ప్ర. ప్ర. సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR/503-C3/Advt/75

111

# విషయానుక్రమణిక

## మార్చి 1975



---

# చందమామ

## కళాప్రపూర్ణ కొండవీటి వేంకటకవి

తదియ వెన్నెలల చేతాకుచే విరహుల
పులకింపగాజేయు కలితనమ్ము
కడలిరాయని మేను నుడికించి పొంగించి
కలగింపగాజేయు ఘనబలమ్ము
పొటమరించిన లేతమొలక జీవింపగా
పెంపగాజాలిన యింపితమ్ము
పుడమినెల్లను వెండి పూతపూయగ జాలు
సిసలైన యసలైన పసదనమ్ము !

దోసము లవెన్నియున్న నుల్లాసమిడెడి
రాజవే నీవయని యనురాగముంచి
జగము జగమెల్ల నిన్ను మామగ దలంచె
అందచందాల పరసీమ ! చందమామ !

కన్ను వేసితివేమొ కాకోదరస్వామి
నడు నెత్తిపైనున్న నాణెమునకు
తిలకించితివొ యేమొ నలకూబరుని నూగు
మీసాలపైనున్న మీసరమును
పరికించితివొ యేమొ పార్వతీ హృదయేశు
గొంతుపై నెలకొన్న గొప్పదనము
దరిసించితివొ యేమొ పరమేష్ఠి నాభిలో
తామరపైనున్న చామనమును

చూచితివదేమొ బలరాము గోచిపాత
అక్కటా ! వీని యనుకృతి నందితీవు
పరుల యనుకృతి యెంత దుర్భరమొ తెలిసె
అందచందాల పరసీమ ! చందమామ !

నాణెమౌ రతనాల నత్తుగుల్లల గూడ
సమముగా భరియించు జనకు నెంచి
మంచి చెడ్డల మది నెంచ కెల్లర బ్రోవ
తిరుగుచుండెడి బావమఱది గాంచి
పిన్న పెద్దలతోడ విలసిల్లు మూడాళ్ళ
మసిచేయువాని సంబంధ మెంచి

నీతిపేరున నవినీతి నుద్బోధించు
కుక్షింభరుండైన గురు తలంచి

తప్పు చేసితి వని తీర్పు చెప్పినారు
చేసితివొ యేమొ వయసున దోస మొకటి
ఇంతమాత్రానకే తప్పు లెన్న దగునె
అందచందాల పరసీమ చందమామ !

లేమిచే జనుల మారాము లూడిచివైచు
పెద్దక్క నేర్పిన విద్దె వలన
కలిమిచే జనుల కన్నులు గప్పి మప్పిన
చిన్నక్క గఱపిన శిక్ష వలన
మునుముందు పుట్టి యాత్మను వంచనము చేయు
విసము బోధించిన యసము వలన
వెనువెంట మొలతెంచి వినువీథి కెగ్రబాకు-
పుడుకు గల్లెటిగించు బోధవలన

మె కముం జెంది యేనాడొ మానిసులకు
కీడు చేసితివని వాడవాడలందు
గుసగుసలు వోదు రిందు నిక్కువములేదు
అందచందాల పరసీమ ! చందమామ !

దారుకావని మునిదారల దారాడు
నీలకంఠుని జగ్గు నిగ్గు డించి
రంభాది దేవతా రామల గవగూడు
దివిజాధిపుని తలదిమ్ము డించి
మున్నూరు పువ్వారు బోండ్లతో విలసిల్లు
దశరథావనిభర్త యశము డించి
పదియాఱువేలు పైబడ్డ వ్రేతల గూడు
వసుదేవసుతుని కావరము డించి

తక్కుగలవారి నేవారి లెక్కగొనక
వేనవేలుగ గగనాన గానుపించు
నుడువులకు నెల్ల మగడవై యొంటినుంటి
అందచందాల పరసీమ ! చందమామ !

పగలె నాథుని గూడు పద్మినీ జాతిని
దలకింపజేయు నీ ధర్మదీక్ష
కలువకన్నియకు జక్కిలిగింతలిడి నవ్వి
ఉప్పొంగు నీ నయనోత్సవమ్ము
ప్రాగ్దిశాభామినీ ఫాలపట్టిక బట్టి
ముద్దాడు నీ నవ మోహనమ్ము
తామసీసతికి వక్త్రిము తేజముంగూర్చి
హవణిల్లు నీయంతరాత్మ మహము

జారచోరాళి హ దయాల సారముడుప
ఉదయగిరి నీవు కాలు మోపెదవటంచు
కవులు వర్ణించి కృతులకు చవుల నిడిరి
అందచందాల పరసీమ! చందమామ!

ఉదయాద్రిపై నీవు పదమూన్చు సమయాన
ప్రకృతికిచ్చిన నివాళిక యటంచు
కడలొత్తి నిక్కి చెంగావినందెడు నాడు
ప్రియురాలి కెమ్మోవి హొయలటంచు
అస్తాద్రిపై నీవు హజ్జ మోపెడివేళ
వారుణీసక్తత వరలె దనుచు
భువనాధిపతి గర్భమున జొచ్చుతరవాయి
తండ్రి యంకమునందు దాగితనుచు

చిత్ర చి తమ్ముగా బరీక్షించి నిన్ను
వర్ణనము చేసినారు ప్రబంధ కవులు
నిజము నిలుకడ మీద నిర్ణీతమగును
అందచందాల పరసీమ! చందమామ!

కలదొ లేదో మచ్చ గలదంచు కవులెల్ల
నిటీగా మ టీగా నెంచినారు
కలవొ లేవో యంగకములు కబ్బములెల్ల
సొగసరివంచు మెచ్చుగను బలికె
జరుగునో లేదొ నిర్జర సమూహమ్మెల్ల
నినుబట్టి తినునంచు నిందగలదు
మందెనేమొ లేదొ వందారు జనమెల్ల
ముక్కంటి ముడిమీద నిక్కితివనె

నిజమొ కాదేమొ కంటిలో నీటిలోన
పుట్టితివటంచు గాథలు పులిమిజనులు
కులుకుచున్నారు చంకలు గొట్టుకొనుచు
అందచందాల పరసీమ! చందమామ!

వలరాజు విలు నారి పలికింపగా జాలు
గణనీయమ్మైన నీ క్షమమూర్తి
మిన్నుముట్టిన పండువెన్నెల విరజేయు
రమణీయమ్మైన నీ రమ్యమూర్తి
వెలపిట్టలకు పొట్టనిండ దిండిడజేయు
భజనీయమ్మైన నీ భవ్యమూర్తి
ఉల్లమ్ము చల్లగా నుల్లసిల్లగ జేయు
మహనీయమ్మైన నీ మధురమూర్తి

అవకతవకలు లేకుండ కువలయముల
రాకరాకల క్రొంగ్రొత్త పోకడలను
వికసనమ్ములుగా జేయు విమలమూర్తి
అందచందాల పరసీమ! చందమామ!

ననవిల్తునకు బ్రయాణమ్ముగొల్పు మాన్టీడు
కుసుమమ్ములకు వాడి గూర్చు వాడు
తారాసతికి ముద్దులూరించు చెలికాడు
పొందమ్ముల హరించు మ్రుచ్చువాడు
పొలతుల హృదయాల పలికించు లయకాడు
కోడెకాండ్రను కొల్లగొట్టువాడు
జేజేల కంచాల రాజిల్లు రహికాడు
పరచక్రములడంచు బలిమివాడు

చంద్రునకు నూలుపో గన్న సామెతలకు
ఉలికిపడబోక నులిదారముల ధరించు
తండ్రిగాంభీర్యమును దాల్చు ధర్మరతుడు
అందచందాల పరసీమ! చందమామ!

బ్రహ్మవంశము నుండి పడవేసినారహో
నిన్ను నీసుతుని మన్నింపులేక
మునుల శాపవ్యాజమును మప్పినారహో
క్షయరోగివని కుంటిసాకు చెప్పి!

చందమామ

చలికి నీరజాక్ష జంకుచున్నైక హైహా
లాపనిందయి వాయసపుమ
గాండ్రించి నీమేను ఎండికల ని రహో
త్రిపురముల్ భస్మీకరించువేళ
పేరుకొసరాని కవుల కల్పించి పెంచి
మాన మర్యాదలుడిపి రేమైననేమి ?
దైవముగ నిన్ను యువసులు దలచినారు
అందచందాల పరసీమ ! చందమామ !

వలపువాసన లేగబడ బిమ్మిటివోయి
హరిహరీయనెడి సన్యాసి యొకడు
కడచన్న పసులు సందడిగొల్పు నెడదలో
చింతిల్లుచుండు వితంతు వొకతె
పుక్కిటి బంటిగా మెక్కి కండలు పెంచి
యారటించెడు బ్రహ్మచారి యొకడు
మతిలేని మగనితో మాటాడ్డ విడిపోయి
పుట్టింట బడియుండు పొలతి యొకతె
ఎందుకుం గొఱగాని దేహాచ్ఛ ప్రోని
వెంగళప్పలు గుమిగూడి వెత్రి మొఱి
కతలు గల్పించి నీకంట గట్టినారు
అందచందాల పరసీమ ! చందమామ !

శివు జటాటవిలోన చిక్కి స్రుక్కకయున్న
బలుమచ్చతో వంతబడకయున్న
దోషకరుండన్న దోష మంటక యున్న
కడు హెచ్చులొచ్చులు పడయకున్న
కోకాంగనల గుండెకోత కోయకయున్న
తమ్ములపై కంటు తలపకున్న
రాహుకేతువుల రాపు లందకయున్న
మిత్రుతేజమ్ముతో మెలగకున్న
నిన్ను నొక గొప్పవానిగా నెన్నెదమని
కవులు గిరికిరి తమ పుస్తకాలలోన
దిష్టిమండల మని నిన్ను దెలియరైరి
అందచందాల పరసీమ ! చందమామ !

పలుచుపో నిలక భూతలమెల్ల దిరుగాడి
వెలుగు నిజాలు నీ విలసనమ్ము

కొండనుండియువచ్చి గోసపూవుం దెచ్చి
బాలుర కిచ్చు నీ ప్రాభవమ్ము
చేతనాచేతన వ్రాతమ్ము ముదమంద
కాపాడజాలు నీ కౌతుకమ్ము
పన్మార్గగతుడవై సత్ప్రభుండను కీర్తి
కడలెల్ల నింపు నీ ఘన యశమ్ము
మననమ్ముం జేసి జైవాతృకునిగ దలచి
సకల సుకవులు లేత పచ్చికబయళ్ళ
వినుతి గావింతు చల్లనివేళ నిన్ను
అందచందాల పరసీమ ! చందమామ !

నిక్కి తూరుపు దిక్కునెక్కి నిల్చిన ప్రొద్దు
మొగులుదారి కళాయి పూసినట్లు
అడుగు ముందుకువేసి పొడకటు సంతలో
ఆసలెల్లను వెల్లవేసినట్లు
కడువేగమున మింటినడిమి కేతెంచుచో
గంగా ప్రవాహమ్ము పొంగినట్లు
పడమటి దిక్కుకై మెడవంచి దిగువేళ
పీయూషల హరి గుప్పించినట్లు
విశ్వరూపాన నర్ధనారీశ్వరుండు
ప్రకృతి సర్వమ్ము దానయై పరగినట్లు
తళికు వెన్నెల భూనభోంతరము నెఱపు
అందచందాల పరసీమ ! చందమామ !

చంద్రుండవై మేలి చలువ లిచ్చెద వీవు
కవిచంద్రుడను పేరుగంటి నేను
శివు భూషణమ్మవై చెలువొందెదవు నీవు
కవిభూషణఖ్యాతి గంటి నేను
రాజవై దెసల విరాజిల్లెదవు నీవు
కవిరాజనై కీర్తిగంటి నేను
లలితమౌ రాకాకళాప్రపూర్ణుడ వీవు
దండి కళాప్రపూర్ణుండ నేను

కువలయమ్మునకు మేలుగోరు వేళ
ఉభయులకు కొంత సాదృశ్యమున్న దైన
కొన్ని గుణములలో భేదమున్న దరయ
అందచందాల పరసీమ ! చందమామ !

# కరీంనగరు జిల్లా తెలుగు మాండలికం

శ్రీ చేకూరు రామారావు

తెలుగు అకాడమీవారు నిర్వహిస్తున్న ప్రాజెక్టుల్లో తెలుగు మాండలికాల పరిశోధన ఒకటి. అందులో భాగంగా 1971 లో మొదలుపెట్టి కరీంనగరు, విశాఖపట్టణం, కడప, గుంటూరు జిల్లాల భాషమీద తెలుగులో బులెటిన్లు ప్రకటించారు. ఇప్పుడు ఆ మాండలికాల వ్యవహారాలమీద విపులమైన వ్యాకరణ వివరణతో మరికొన్ని హంగులతో ఇంగ్లీషులో ప్రకటించటం ప్రారంభించారు.

ఇట్లాంటి బృహత్తరమైన కార్యక్రమం ఏ ఒకరిద్దరివల్లనో అయ్యేది కాదు. ఇది సామూహికంగా నిర్వహించేపని. ఈ గ్రంథానికి ఒక రచయిత, ఒక సంపాదకుడూ మాత్రమేగాక విషయ సేకరణచేసిన వారి పాత్రకూడా సంపాదకులు గుర్తించినట్టుగా చాలా ఉంది. ఈ ఉపుస్తకంలో తప్పొప్పులకు, లోటుపాట్లకు, మంచి చెడ్డలకు సామూహికంగా పైవారందరూ బాధ్యత వహించాలి.

ఈ రకమైన ప్రాజెక్టులు నిర్వహించటానికి ఉత్సాహవంతులైన, సుశిక్షితులైన పరిశోధక బృందంకావాలి. [illegible] పరిశోధన తీరు తెన్నులు జాగ్రత్తగా పరిశీలిస్తూ వాళ్లకి [illegible] సలహాలు ఇయ్యగలిగిన అనుభవజ్ఞులైన, సమర్థులైన పర్యవేక్షకు[illegible]. పరిశోధకులకు సరిఅయిన శిక్షణ లేకపోతే సేకరించిన విషయం అసమ[illegible] కావచ్చు, అవిశ్వసనీయమైనదైనా కావచ్చు. పర్యవేక్షకులు అజాగ్ర[illegible]ంటే అసమగ్రమైన, అవిశ్వసనీయమైన విషయాన్ని ఆధారం చే[illegible] ప్పుడు నిర్ణయాలకు వచ్చే ప్రమాదం ఉంది.

తెలుగు అకాడమీవారి [illegible] పరిశోధనలో సరిగ్గా ఇట్లాంటిదే జరిగిందని ఈ పుస్తకం నిరూపి[illegible] ఉదాహరణకు అట్లాంటి నిర్ణయం ఒకదాన్ని గమనించండి "The dialect area shows up three clear cut local dialects within its own boundaries as also inter action between them". ఇది సంపాదకీయ భూమికలో [illegible] నిర్ణయానికి రావటానికి ఆధారాలు 151 [illegible] 194 [illegible] భాషా వ్యవహార సూచకపటాలు 44 [illegible] ప్రమాణ కావాలి. అయితే ఈ నిర్ణయం [illegible] వ్యర్థం. ఉదాహరణకు ఈ కింది కరీంనగరు జిల్లా [illegible] ఇట్లాంటి పటమే ఈ పుస్తకంలో 190 పేజీలో ఉంది.([illegible] మాత్రమే)

ఈ పటంలో కోడిగుడ్డు [illegible]: 1[illegible] [illegible]వ్యల, 16 = కోరుట్ల, 17 = మెట్‌పల్లి కలిపి [illegible] మండలం., [illegible] ఆకారంలో ఉన్నది: 12 = మంథని, 13 = సిర్సిల్ల, 14 = వేములవాడ కలిపి రెండో ఉపమండలం, 18 = సుల్తానాబాద్, 19 = హుజూరాబాద్, 20 = కరీంనగరు, 20ఏ = పెద్దపల్లి కలిపి మూడో ఉపమండలం. ఈ మూడో ఉపమండలం వృత్తాకారంలో ఉండటానికి కారణం తెలీదు. 19 ని 20ఏని ఒకే నిలువుగీతతో ఎందుకు కలపగూడదు ? అట్లాగే 20ఏని, 19ని ఒక సరళ రేఖలోనూ, 18 ని 20 ని ఇంకో సరళ రేఖతోనూ ఎందుకు కలపగూడదు ? వృత్తంగా వంగినచోట ఏ సెంటరునూ పర్యటించలేదు. అక్కడి భాషను పరిశీలించకుండా ఆ ప్రాంతాలను వృత్తంలో ఇరికించటానికి ఆధారం ఏమిటి ? అట్లాగే 15, 16, 17 ప్రాంతాలను కోణాకారంలో కలపవచ్చు. అట్లా కాకుండా కోడిగుడ్డు ఆకారంలో ఎందుకు కలపాలి. 12, 13, 14 వూళ్ళు కలిపి ఆ మధ్యప్రాంతంతో సహా ఒక వ్యవహారమండలం ఎట్లా అయింది ? 12, 14 వూళ్ల మధ్యనున్న పొడుగాటి ప్రాంతంలో ఏ వూరూ పరిశోధించకుండా ఈ ఉప మండలంతో ఎట్లా చేర్చగలిగారు ? ఆ మధ్య ప్రాంతాన్ని [illegible] కోడిగుడ్డు ఆకారపు మాండలికంతోగాని, ఇటు వృత్తాకారపు మాండలికంతోగాని [illegible] అభ్యంతరం ఏమిటి ? డయలెక్టు జాగ్రత్తలో ఏమాత్రం [illegible] వారికైనా ఈ సందేహాలు రావటం సహజం. కాని ఈ ప్రాజెక్టు నిర్వాహకుల కిట్లాంటి సందేహాలు కలిగినట్టు ఈ పుస్తకంలో ఎక్కడా సాక్ష్యంలేదు. 12, 13, 14 ప్రాంతాలను ఒక పరిశోధకుడు పర్యటించినట్టు అకాడమీ ప్రకటించిన తెలుగు బులెటిన్ (1971)ని బట్టి తెలుస్తున్నది. ఈ మూడు ఒక మాండలికంగా కనపడటానికి దీనికీ సంబంధం ఉందేమో నిర్వాహకులు "చెక్" చేసుకొని ఉండాల్సింది.

ఈ పటాలను జాగ్రత్తగా పరిశీలిస్తే 12, 13, 14 వూళ్లకు మాత్రమే పరిమితమైన వ్యవహారాలు ఎక్కువ కనపట్టంలేదు. పటం 1 లో



క > క అనే భేదం మిగతా ప్రాంతాల్లో ఉండగా ఈ భాగాల్లో కేవలం 'స' వర్ణం ఉన్నట్టు చూపించారు. కాని రెండో పటంలో 12 లో క > కగా ఉన్నట్టు, 13, 14 లలో క > షగా మారినట్టు చూపించబడింది. అసలు తెలుగు భాషలో వీరు క, క, S. S. అనే నాలుగు ఊష్మాల ఉచ్చారణను రికార్డు చేశారు. క, క లకు భిన్న ఉచ్చారణ ఉండటం ఒక్క తెలుగుకే కాదు, ఏ భారతీయ భాషకైనా అస్వాభావికం. వీటిని సరిగ్గా గమనించకుండా పటాలను గీస్తే నిష్ప్రయోజనం. క, క లు ఒకే ఉచ్చారణకు గుర్తులుగా గ్రహిస్తే 12 వర్తాకార్ల మాండలికంతో ఈ విషయంలో సమానమవుతుంది. ఆమాటకొస్తే శ, ష ఉచ్చారణ భేదాన్ని వినటం కూడా కష్టమే. 11 వ పటం ప్రకారం చెయ్యక అనే విధంగా మిగతా ప్రాంతాల్లో ఉంటే, 12, 13, 14 వూళ్ళల్లో చెయ్యకనే అనే ఉంటుందని చూపబడింది. "నే" అనేది ప్రాధాన్య వివక్షకోసం చేరటానికి వీలుంది. అటువంటప్పుడు ఈ రూపం మిగతాచోట్ల రాకపోవటానికి కారణం యాదృచ్ఛికం కావచ్చు. పటం 30 ప్రకారం 12, 13, 14 లలో మా పోల్లు అనే రూపం ఉంటె మిగతా అన్నిచోట్ల ఆ అర్థంలో భార్య అనే రూపం ఉన్నట్టుగా చూపబడింది. భార్య అనేమాట మంథని, వేములవాడ సిరిసిల్ల అనే వూళ్ళలో లేదను కోవాలి, ఈ పటం ప్రకారం. ఈ వూళ్ళనుంచి తీసుకున్న పట్టభద్రులైన ఉన్నతకులాల వ్యవహర్తల్లో కూడా 'భార్య' అనే మాట లేదని అనుకోవాలా ?

ఈ విధంగా నిశితంగా పరిశీలిస్తే ఈ పుస్తకంలో వేసిన 44 పటాలూ నిరుపయోగం. వాటిమీద ఆధారపడి చేసిన నిర్ణయాలు తప్పులు. ఇంత హాస్యాస్పదమైన డయలెక్టు జాగ్రఫీని చూడటం ఈ సమీక్షకుడికి ఇదే మొదటిసారి. పైగా ఈ పుస్తకం ఇంగ్లీషులో ఉంది. అంటే ఆంధ్రేతరులు, భారతీయేతరులు కూడా చూడటానికి ఉద్దేశించారన్నమాట !

భిన్నవృత్తులవారిని, భిన్నకులాలవారిని, భిన్న వ్యవహార స్థాయిలవారిని తీసుకొని, వారి ప్రయోగాలను విచక్షణ లేకుండ పటంలో చూపించే ప్రయత్నంచేస్తే ఇలాంటి తప్పుడు నిర్ణయాలే వస్తై. వీరు సేకరించిన పద్ధతి డయలెక్టు జాగ్రఫీకి ఉపయోగించదు.

పై పటాన్ని చూస్తే ఇంకో విషయాన్ని కూడా గ్రహించవచ్చు. పర్యటన పరిశోధకులు (field workers) జిల్లా అంతటినీ పర్యటించలేదు. 6 మంథని (12) అనే వూరు ఆ తాలూకాలో ఒక మూలన ఉంది. ఆ వూరికి తూర్పున ఉన్న ప్రాంతాన్ని పర్యటించకుండా వదిలేశారు. 13,14లు, 20, 19 ల కిందుగా ఉంటే కొంతభాగాన్ని పరిశోధించలేదు. 12, 20ఎ, 14 నంబర్లున్న వూళ్ళ మధ్య చాలా ఖాళీగా ఉన్న ప్రాంతం పటంలో కనిపిస్తున్నది. అన్ని వూళ్ళను తిరగటం సాధ్యంకానిమాట నిజమే. కాని ఎన్నుకున్న వూళ్ళ మధ్యదూరం అతి విస్తారంగా ఉండకుండా చూసుకొనే బాధ్యత నిర్వాహకులకు లేదా ? దీనివల్ల కరీంనగరు జిల్లాలో కొంతభాగాన్ని అజ్ఞాతంగా వదిలేసినట్టు ఈ పటాలు చూస్తే స్పష్టంగా కనిపిస్తున్నది.

**"The present monograph gives a clear picture of the social, areal and education varicties of Telugu obtaining in the Karim Nagar district"**

అని సంపాదకులు ముందు మాటలో ప్రకటించారు. సాంఘిక భేదాల్ని అనుసరించి కొన్ని భాషా భేదాలుండటంలో ఆశ్చర్యంలేదు. అలాంటి పరిశోధన ఇటీవల చాలా భాషల్లో జరుగుతున్నది. కాని ఈ రకమైన నిరూపణ ఈ పుస్తకంలో సవ్యంగా జరగలేదు. అసమగ్రమైన విషయాన్ని ఆధారం చేసుకొని ఆయా వృత్తులవారి, కులాలవారి వ్యవహారాన్ని గురించి నిర్ణయాలు చేశారు.

సరిహద్దు, ఓటు హక్కు, దాహం, సింహం అనేమాటల్లో 'హ'కార లోపాన్ని గురించి చెపుతూ, యాచకులు, బెస్త, రజక కులాల వారి భాషలో ఈ లోపం నిత్యంగా జరుగుతుందన్నారు. కాని ఈ కులాలనుంచి ఒక్కొక్కరిని మాత్రమే వ్యవహర్తలు గ్రహించారు. ఒక్క వ్యవహర్తనాధారం చేసుకొని ఒక కులాన్ని గురించి నిర్ణయం చెయ్యటం ఏం సబబు ?

కాఫీ, మాఫీ, మొదలైన మాటల్లో 'ఫ' అనే ఊష్మోచ్చారణకు బదులు 'ప' అనే స్పర్శోచ్చారణ బెస్త వారిలో మాత్రం నిత్యంగా కనిపిస్తున్నదట. ఈ కులంనుంచి తీసుకున్నది ఒకేఒక వ్యవహర్తను. యాచకుల్లో ఊష్మ, స్పర్శోచ్చారణలు రెండూ ఉన్నయ్యట. ఒకేఒక్క యాచక వ్యవహర్తను తీసుకొని ఈ నిర్ణయం చేశారు. రజకుల వ్యవహారం గురించి ఈ విషయంలో సేకరణ జరగలేదు.

ఇంకోచోట **"Reddy, Vysyas, Sales, Kapus, Velamas, Yachakas, Bestas, Bukkas, ares, Rajakas, Goudas and Harijans show minimum occurencees of reflection"** అన్నారు. బుక్క, ఆరె, హరిజనులనుంచి కూడా గ్రహించింది ఒక్కో వ్యవహర్తనే.

భాషల్లో సాంఘిక భేదాల్ని, ప్రాంతీయ భేదాల్ని నిరూపించటంలో జాగ్రత్త వహించలేదు. ఏవి ప్రాంతీయ భేదాలు కావటానికి వీలుందో, ఏవి సాంఘిక భేదాలు కావటానికి వీలుందో, అందులో ఏవి ఆర్థికమైన అంతరువును బట్టి ఉంటయ్యో, ఏవి కులాలను బట్టి ఉంటయ్యో సరియైన నిర్ణయం చేసుకోలేదు. తీసుకున్న మాటల్లో కూడా ఒక పద్ధతిలేదు. కొన్ని ఉచ్చారణ భేదాలకోసం 3, లేక 4 మాటలను తీసుకున్నారు. కొన్నిటికి 20 మాటలదాకా తీసుకున్నారు. మహాప్రాణోచ్చారణకు ఉర్దూమాటలు కూడా తీసుకున్నారు. ఉదాహరణకూ ఖూనీ, దవాఖానా, వంటి మాటలు తీసుకుంటే ఉర్దూ ప్రభావం ఉన్నచోట ఊష్మోచ్చారణ వినిపిస్తుంది. అది మహాప్రాణోచ్చారణ అని భ్రమపడే ప్రమాదం ఉంది. మహాప్రాణోచ్చారణ పెద్దపల్లి (20ఎ) లో ఎక్కువున్నట్టు (71%) రాశారు. అక్కడనుంచి గ్రహించిన వ్యవహర్తల్లో ఇద్దరు పట్టభద్రులు, ముగ్గురు హైస్కూలు చదువు పూర్తి చేసినవారు. ఒకజిల్లాలో మహాప్రాణోచ్చారణను ప్రాంతీయ భేదంగా పరిగణించటానికి వీలుందా ? అని ముందాలోచించాలి.

ఈ సేకరణ వీరు ముందుగా తయారు చేసుకున్న ప్రణాళిక (**questionaire**)ను అనుసరించి జరిగింది. వారికి అవసరమైన విషయం అన్నిచోట్లనుంచి సేకరించిందీ లేనిదీ తెలీదు. ఒక్కో సెంటరులో, 9, 8 మంది దాకా వ్యవహర్తలనెన్నుకొన్నారు. కొన్ని సెంటర్లలో 5, 6 గురిని ఎన్నుకొన్నారు.

కులాలను బట్టి చూస్తే వైశ్యులు 16, సాలె 13, బ్రాహ్మణ 9. కొన్ని కులాల నుంచి ఒక్కొక్కళ్లనే గ్రహించినట్టు చూశాం. వ్యవహర్తల సంఖ్య తెలుగు బులెటిన్ ప్రకారం 72, ఈ పుస్తకం ప్రకారం 69.

అసలు ఈ సర్వేద్వారా ఏం సాధించదల్చుకున్నారో నిర్వాహకులకు స్పష్టమైన అభిప్రాయం ఉన్నట్టులేదు. మనకు లభించింది.మాత్రం (కొన్ని విశాల ప్రాంతాల్ని వదిలేయగా) కరీంనగర్ జిల్లాలో కొన్ని ప్రాంతాల, కొన్ని కులాల, వృత్తుల భాషా రూపాలు. అవైనా అన్నీ విశ్వసనీయాలుకావు. ఈ భేదాల్ని ఒక క్రమంలో సేకరించలేదు, ఒక పద్ధతిలో ప్రదర్శించలేదు. విద్యావంతులైన వ్యవహర్తలను ఎక్కువగా గ్రహించి మిగతా వాళ్ల భాషను గురించి ఇది ఉంది, ఇది లేదు అని చెప్పటానికి మనకేం అధికారం ఉంది ? వాటిమీద ఆధారపడి కట్టిన ఫ్రీక్వెన్సీ లెక్కల విలువ ఏమిటి ?

జీతం, మజ్జిగ అనే రెండు మాటల ఉచ్చారణను పరిశీలించారు. వేములవాడ, సిరిసిల్ల అనే వూళ్లలో ఈ మాటల్లో తాలవ్యేతరోచ్చారణ వినిపించిందట ! ఈ రెండూళ్లలోనూ కలిపి 15 మంది వ్యవహర్తను పరిశీలించారు. అసలు తెలుగులో ఈ మాటల్లో తాలవ్యేతరోచ్చారణ సాధ్యమేనా ? దీనిమీద కట్టిన ఫ్రీక్వెన్సీ లెక్కల విలువ ఏమిటి ? దీని ఆధారంతో గీసిన జిల్లాపటం విలువ ఏమిటి ?

పసుపు అనే ఒక్కమాట ఉచ్చారణను పరిశీలిస్తే ఇద్దరు మాత్రం 'పప్పుపు' అని ఉచ్చరించారట! ఒక్కమాటమీద, ఇద్దరు వ్యవహర్తలనాధారం చేసుకొని ఫ్రీక్వెన్సీ కట్టటంవల్ల ఏం సాధించాలని ? మనకు ఏం చెప్పాలని ? ఈ విధంగా పరిశీలిస్తూపోతే ఇట్లాంటి అసంబద్ధమైన పరిశీలనలు ఈ పుస్తకంలో చాలా ఉన్నై.

కరీంనగర్ భాషలో కనిపించే ప్రాంతీయ, సాంఘిక భేదాలు ఈ పుస్తకం స్పష్టంగా ప్రదర్శిస్తుంది అని ముందు మాటలో సంపాదకు లిచ్చిన వాగ్దానం ఒట్టిదేనని తేల్తున్నది.

**"It also Provides a descritive grammar of the educated speech in the area "** అని కూడా సంపాదకులు రాశారు. ఈ పుస్తకానికి "descriptive grammar" అనే పెద్దమాట వాడటం పొరపాటు. పదాలను ప్రకృతి ప్రత్యయ విభాగం చెయ్యటం ఒక్కటే డిస్క్రిప్టివ్ గ్రామరు కానేరదు. వాటిలో ఉండే నియమాలను కనిపెట్టాలి. అట్లాంటి పని అంత స్పష్టంగా ఈ పుస్తకంలో జరగలేదు. అవన్నీ చూపించాలంటే ఇప్పటికే విస్తారమైన ఈ చర్చను మరీ పెంచాల్సివస్తుంది. కొన్ని మాత్రమే ఉదాహరణ ప్రాయంగా చూపిస్తాను.

(1) 8 వ పేజీలో "The remaining phonemes... have no allophones" అన్నారు. ఒక్క ఉచ్చారణ కూడా Allophone అవుతుంది.

(2) క, చ, త, ప లకు గజ డబాదేశం కాని, పకారాని వకారాదేశం కాని అది క్రియాపదాది అయినప్పుడే జరుగుతుంది. ఈ విషయం తెలుగు బులెటిన్లో భద్రిరాజు కృష్ణమూర్తిగారి వ్యాసం చూసినా తెలుస్తుంది.

వండొచ్చిన్మది, వల్లె ) అనే రూపాలో మహాప్రాణత్వానికి పూర్వవ్యంజన పరిసరాన్ని చూపించటం పొరపాటు.

(4) విమర్శించు, అభినందించు అనే క్రియలను అకర్మకాలనటం పొరపాటు.

(5) తెలుగులో చేదర్థకమైన ప్రత్యయం ఉన్ అనే ధాతువుతో కలిసి ఉంటే అనే రూపంతో క్త్వార్థక క్రియతరవాత వస్తుంది. అది ప్రాధాన్య బోధకోసం జరుగుతుందనటం తప్పు. చేస్తే—చేసిఉంటే అనే రూపాలు ఏకార్థకాలు కావు.

14 వ అధ్యాయంలో కరీంనగర్ భాష ప్రామాణిక భాషల మధ్య భేదాల్ని పరిశీలించారు. ప్రామాణిక భాషా స్వరూపం ఫలానాదని నిర్ణయం జరగలేదు. దానిమీద రచనచేసే వారందరిలో ఏకాభిప్రాయంలేదు. ప్రామాణిక భాషను గురించి వారిచ్చిన కొటేషన్లు అంత సీరియస్‌గా తీసుకోదగినవికావు. ఎవరికివారు తాము మాట్లాడిందంతా ప్రమాణమనుకుంటున్నారు. మరి కొందరు తాము మాట్లాడిందే ప్రమాణమంటున్నారు.

ఈ పరిస్థితిల్లో అట్లాంటి భేద నిరూపణకు ప్రయత్నించటం సాహసం.

బండ్లు, పండ్లు, లోపల మొదలైన వాటిని ప్రమాణేతరాలుగా పరిగణించటానికి హేతువులేమిటి ? చేసిఉంటే అనే చేదర్థక రూపం అప్రమాణిక మనటం పూర్తిగా పొరపాటు.

ఈ గ్రంథంవల్ల కరీంనగర్‌జిల్లాలో తెలుగు భాషా స్వరూపాన్ని గురించి కొంత తెలుసుకోవచ్చు. ఈ పుస్తకం తయారు చెయ్యటానికి గ్రంథకర్త చాలా శ్రమించినట్లు కనిపిస్తున్నది. వ్యాకరణాంశాల వివరణను **descriptive grammar** అనడానికి ఈ సమీక్షకుడికి అభ్యంతరాలున్నాయి. వీటిలో దొర్లిన లోపాలను రెండో ముద్రణలో సవరించుకోవచ్చు. అసలులోపాలు విషయ సేకరణ విధానంలోనే ఉన్నై. అసలీ ప్రాజెక్టునే సరిగ్గా డిజైన్ చెయ్యలేదు. సాధించదలుచుకున్న లక్ష్యాల్లో స్పష్టతలేదు. నిర్వహణలో ప్లానింగులేదు.

(3) మూడు + పది > ముప్పై, మూడు + గురు > ముగ్గురు అనే రూపాల్లో డ, పల మధ్య డ, గల మధ్య సమీకరణం జరిగిందనటం పొరపాటు.

ఈ పుస్తకం అచ్చుకు, ముఖ్యంగా జిల్లా పటాలకు, బ్లాకులకు చాలా డబ్బు ఖర్చయి ఉండాలి, విషయ సేకరణకు, మిగతా పుస్తకాల ప్రచురణకు, మొదలైన అన్ని పద్దులు లెక్కకు తీసుకుంటే ఈ ప్రాజెక్టు ఖర్చు 5 అంకెల మొత్తాన్ని దాటి ఉండొచ్చు. ఇంత మొత్తంలో ప్రజల డబ్బు పరిశోధన పేరుతో సాగుతున్న అస్తవ్యస్తపు ప్రాజెక్టులకు వ్యర్థమయిపోతుంటే చేతులు ముడుచు క్కూర్చునే "మేధావి"వర్గం ఉన్నంతకాలం ఈ జాతి ఇట్లాంటి వాటిని భరించక తప్పదు.

---

**Karimnagar dialect of Telugu** (కరీంనగరు జిల్లా తెలుగుమాండలికం) (గ్రంథకర్త : పి. శివానందశర్మ, సంపాదకుడు బి. రాధాకృష్ణ, హైదరాబాద్. తెలుగు అకాడమీ, 1974, పేజీలు 16 + 305 + 2. వెల : రు. 16—25).

— —

# నక్షత్రాలు

‘వై వియల్యాన్’

దారం లేదు! ఆధారం లేదు!
నభో మండలంలో
నడయాడుతున్నాయి!
చెదిరిపోయిన
పాదరసం చుక్కల్లా!
పావురాయి రెక్కల
కొస మెరుపుల్లా!

ఆశల సన్నజాజి మాల
హఠాత్తుగా తెగిపోయి;
ఎక్కడి పూలక్కడ
చెల్లా చెదరైనట్లు
ఎల్లలేని ఆకాశంలో
తెల తెల్లగా మెరుస్తున్నాయి!

పొలులేని
పాలదారిలో
ఒలికి పోయిన
పాల చుక్కల్లా!
బ్లాక్ బోర్డు మీద
చాక్‌పీసుతో
వ్రాసిన అక్షరమ్ముక్కల్లా నక్షత్రాలు!

ఆకాశపు బడిలో,
ఆ విశాలమైన బడిలో;
అల్లరి పిల్లలు దాగుడుమూత లాడుకుంటున్నట్లు
దూర దూరంగా......అంచుల్ని తాకుతూ!

ఆ నక్షత్రా లన్నిటినీ
ఏదో దారంతో చేర్చి;
ఒక హారంగా మార్చి;
ఆగామి స్వామి
మెడ నలంకరించాలని నేను కోరుతూ!

అప్పుడప్పుడూ ఆరేడేసి
రంగుల్ని చూపే ఆ నక్షత్రాలు
అవుతాయా ఏవరో
మానవమాత్రుడు వేసిన చిత్రాలు?

నూతనత్వాన్ని కోరుకునే
మానవాళికి చిన్న విన్నపం —
నిత్య నూతనంగా మెరిసే
ఆ నక్షత్రాలు కావా అందుకో చిహ్నం?

నక్షత్రాలు! నక్షత్రాలు!
గగన స్థగిత నక్షత్రాలు!
చకచ్చకిత చంచలాకృతులు!
నక్షత్రాలు! నక్షత్రాలు!

# పోతన భాగవతములో పోయిన ఒక కథా భాగము

## శ్రీ విక్రాల శేషాచార్యులు

శ్రీ మహా విష్ణువు యొక్క చరిత్రములు పవిత్రములు విచిత్రములు నైనవి. వాటిలో శ్రీ కృష్ణావతారమునకుఁ జెందినవి మిగుల రసికజన మానసోల్లాసకరములైనవి కూడాను. అవి— శ్రీ కృష్ణుఁడు దినముల బిడ్డగ నున్నది మొదలు బాల్య లీలలు, శృంగారము, ఎత్తుకు పైయెత్తులు, వంచకులను మంచి గనే మాయ చేయుటలు శౌర్యమునకు శౌర్యము, వేదాంతము మున్నగునవి చదువు వారికి వినువారికి చమత్కారజనకములు.

అట్టి శ్రీకృష్ణ కథలు శ్రీ భాగవతము (దశమ—ఏకాదశస్కంధములు), బ్రహ్మ వైవర్త పురాణము (శ్రీ కృష్ణ జన్మఖండము) మున్నగు పురాణముల యందు విస్తరముగ నున్నవి.

ఆంధ్రులలో పండితేతరులు కూడా పోతన్నగారి ఆంధ్ర భాగవతము వల్లనే ఆ గ్రంథములోని శ్రీ కృష్ణ చరిత్రము నెరింగిరని చెప్పవచ్చును. బహు గ్రంథ పర్యవేక్షణమునకు గావలసిన యవకాశము సాహిత్య జ్ఞానమున్ను కల పుణ్యాత్ములు బ్రహ్మ వైవర్త పురాణ విష్ణు పురాణ గర్గ భాగవతాది పురాణాంతరములలోను, వేదములలో నుపనిషత్తులు (ముఖ్యముగ గోపాలతాపి న్యుపనిషత్) మంత్రశాస్త్రములోఁ జేరిన పరాశరసంహితాది గ్రంథములయందునుఁ గల రాధాకల్యాణము, సత్యభామా గర్వాపహరణము, అర్జున శరసేతు సంరక్షణము, స్వబ్రహ్మచర్య ప్రకటనము మున్నగు సద్వృత్తములగు కథలనున్ను నెరింగి యానందించుచుందురు.

పోతన్నగారు భాగవతానువాదమునందు శ్రీ భాగవతము ననుసరించుచు గూఢమైన గ్రంథార్థమును తేటఁ బరుప శ్రీధరీయ వ్యాఖ్యానములోని విషయములనున్ను జెర్చి భగవద్గుణ వర్ణనాది ఘట్టములను భాగవతోక్త క్రమమున నభివర్ణించి భక్త్యావేశములో వాటిని మూలగ్రంథమున నున్నవానికంటె నెక్కుడుగ రచించుచు, కేవల కావ్యసరణికి సరసములుగాఁ దోపని తత్త్వ విషయములనుఁ గూడ నతిపేశల కవనంబున హవణించి మనోహరముగాఁ దోపించుచు (2వ స్కంధము 5 వ అధ్యాయము హిరణ్యకశిపునితోఁ బ్రహ్లాదుఁడు చెప్పుట "నతే విదుః . . . నైషాం మతిః . . . అను 31—32 శ్లోకములకు— చం. చదివిన వాని నూతఁ గొనివాడ్క), రసోద్దీపకములు కాని కథాంశములనుఁ గూడ రచనా చమత్కృతిచే నతి రమణీయములుగాఁ జేయుచు (2 స్కంధము 5 వ అధ్యాయము ప్రహ్లాద చరిత్రలోనే "ఏకదా సురరాట్పుత్రం . . . అనెడు 4 వ శ్లోకమునకు— "శా. అంతం గొన్ని దినంబు లేఁగిన . . . మున్నగు 6 పద్యములు), 8 వ స్కంధము 3 అధ్యాయము గజేంద్ర మోక్షములో శ్లో. తం తత్త్వ దార్త ముపలభ్య. . . 31—32—33 మొత్తము 3 శ్లోకములకు— "మ. అల వైకుంఠపురంబులో . . . మొదలగు 20 దివ్య పద్యములు), కొన్ని తావుల శ్రీ విష్ణుపురాణములోని గ్రంథముల నుండి (దశమస్కంధము పూర్వ భాగమునందు నరకాసురునితోడి సత్యభామా యుద్ధము వంటి) క్రొత్త కథల నెత్తి కూర్చియు, భాగవతమును ఒక స్వతంత్ర ప్రబంధమునట్లు రమ్యతరముగ నిర్మించినారు. పోతన్నగారి ఈ భాగవతానువాదముతో మన ఆంధ్రభాషా యోషామతల్లికి కోటి వరహాల విలువ గల ఒక రత్న భూషణ మేర్పడినది.

కాని యిట్టి ఆంధ్ర మహా భాగవతమునందు కృష్ణ కథలో (దశమ స్కంధము పూర్వ భాగములో 502 పద్యము మొదలు 585 వరకు నున్న) బ్రహ్మకృత శ్రీకృష్ణ గోవత్సాపహరణ కథలో మధ్యను చమత్కార కారణమైన కొలది కథాంశము పోతన్నగారి యనుగ్రహమున కేలనో పాత్రము కాక పోయినది. అది సంస్కృత భాగవతమునందుఁ గలదు. దానినిఁ దెలుపుటకు జరిగిన పూర్వ కథ ఉభయ భాగవతముల నుండునది చదువరుల చిత్తమునకు వచ్చుటకుఁ గాను ముందు సంగ్రహముగా వాకొనెదను.

అజుఁడు కృష్ణుని మహిమ నొక్కదానిని చూడఁ దలంచి— ఒకనాడు కృష్ణుఁడు ఆవులను లేగలను నీళ్ల త్రాగించి ఒక పచ్చికబీడులో త్రోలి తాను మిత్రులతోటి చల్ది లారగించుచుండఁగా నవి దవ్వున కేఁగ బ్రహ్మ వాటి నపహరించి అంతర్ధానము చేసెను. కృష్ణుఁడు మిత్రులను భుజించుచుండుఁడని చెప్పి తాను వెళ్లి వెదకి కానక వచ్చులోపల బ్రహ్మ గోపబాలురనున్ను అంతర్ధానము జేసి ఒక గుహలో దాచెను. కృష్ణుఁడు వచ్చి మిత్రులు కూడా అంతర్ధానమగుటను తాను విశ్వవిదుఁడు కాన బ్రహ్మకృతముగా నెరింగి తానే గోవత్స గోపబాల రూపములఁ దాల్చి ఒక్క సంవత్సరము చరించెను. అంత కాలము బ్రహ్మకు ఒక్క త్రుటి సేపు అయ్యెను.

ఇంతవరకు సంస్కృతాంధ్ర గ్రంథముల నుండు కథ. ఇంకను ఆంధ్ర భాగవతములో అంతర్ధానమైన యంశము. "అజుఁడు గోవత్సములను దాచి తన నగరికిఁ జేరులోపలనే "శ్రీకృష్ణుఁడు బ్రహ్మ వేషముతో తత్పురము సొచ్చి స్వమాయా మోహితులైన ద్వార పాలకులచేత బ్రహ్మను వెడలఁగొట్టించెను" అనునది. ఇది సంస్కృత భాగవతమున నొక్క శ్లోకముతోఁ జెప్పఁ బడి యున్నది. వ్యాఖ్యానమునందు అర్థ వివరణముతో కథ చక్కగ నవగతమగు చున్నది. ఒక వేళ నియ్యంశము సంస్కృత భాగవతమునందు ఒక్క శ్లోకముతోఁ బ్రతిపాదితము కనుక పోతనగారును ఇయ్యంశమునుఁ బెంచక ఆ ఒక్క శ్లోకమునకు ఒక్క పద్యమునే వ్రాసి సరిపుచ్చి ఉండ నా పద్యమొక్కటి లేఖక ప్రమాదము చేత గ్రంథమునందు చేరక పోయి ఉండును అని తలంచినను ఒక రిద్దరు వ్రాసిన ఒకటి రెండు గ్రంథములలో అట్లు జరిగి యుండిన నుండవచ్చును గాని అందరు వ్రాసిన ముద్రించిన వాటిలో అట్టి పొరపాటు జరుగునా? జరుగదు. కాన పోతన్నగారే వదలియుందురు. కారణము చింత్యము. ఐనను అయ్యంశము లేకున్నను కథలో లోపము లేదు అని కొందరనవచ్చును. నిజమే. కాని సంస్కృత భాగవతముఁ జదివినవారు ఆంధ్ర భాగవతము చదువునప్పుడు ఈ పట్టున నిది వారికి లోపముగనే యనిపించును.

ఈ శ్లోకమునకు సంగ్రహముగనో విస్తరముగనో పోతన్నగారి యను వాదము లేకుండుటకు నా మనస్సుకు దోచిన కారణము— ఈ శ్లోకము పోతన్నగారి మూలగ్రంథములో ఉండి ఉండదు అని. అయిన ఒక్క గ్రంథములోని ఒక్క శ్లోకము కొన్ని గ్రంథములలోనుండుటయు, కొన్నిటః లేకుండుటయు నుండునా? యనిన ఉన్నది. "శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము తర్వాత శ్రీ వేంకటేశ్వర స్తోత్రములో "అవనీ తనయా కమనీయ . . . వినా వేంకటేశం ననాథో. . అను శ్లోకముల నడుమ "సుముఖం సుహృదం . . . అను శ్లోకము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారు మున్నగు కొందరు ప్రచురించిన గ్రంథములలో నుండుట, చెన్నపురిలో ఆనంద ప్రెస్సువారి స్తోత్రార్ణవము (ద్వితీయ తరంగము) బెంగుళూరులో ముద్రితమైన స్తోత్ర రత్నాకరము వంటి గొప్ప విద్వాంసులు పరిష్కరించిన కొన్ని గ్రంథములలో లేకుండుటయు నా గ్రంథములం జూచిన తెలియును. పది శ్లోకములు గల చిన్న స్తోత్రములోనే, యిట్టిలున్నది. ఇకను పెక్కు వేల శ్లోకములు గల మహా గ్రంథములో ఒక్క చిన్న శ్లోకము కొందరి మాతృకలలో పొరపాటున చేరకపోవుటలో సందేహము లేదు. పాణినీయ శిక్ష 11వ ఖండలో "శ్లో. యేన ధౌతా గిర: పుంసాం . . . త్రిణయన మభిముఖ . . . అను రెండు శ్లోకముల మధ్యలో "అజ్ఞానాంధస్యలోకస్య" అను ఒక శ్లోకము కొన్ని గ్రంథములలో నుండుట, కొన్నిట లేకుండుట చూచుచున్నాముకదా? ఈ శ్లోకము కలిగినవి లేనివియునైన ముద్రిత— లిఖిత— తాళపత్ర గ్రంథములు మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు స్థాపించిన మా సొంత పుస్తక భాండాగారములో పది పదిరెండు ఉన్నవి. ఈ పాణినీయ శిక్షకు మా తాత (పితామహులు)గారు షడంగ వేదజ్ఞ శ్రీమాన్ కళత్తూరు విక్రాల రాఘవాచార్యులవారు రచించిన "భారద్వాజ రాఘవీయ" మను భాష్యములో నీ శ్లోకము యొక్క భాష్యము చివరన "కేషు చి" త్పుస్తకేష్వయం శ్లోకో న దృశ్యతే" అని తెలిపియున్నారు. ఇకనుఁ గొన్ని కలవు. సంస్కృత గ్రందములలోనే కాదు. ఆంధ్ర గ్రంథములలోను ఇట్టి గళితములు కలవు. ఒకటి చూపెదను— అప్పకవీయము మొట్టమొదట 1859 సంవత్సరములో శ్రీ రేకము రామానుజ సూరిగారు పరిష్కరించి మద్రాసులో సూర్యాలోక ముద్రాక్షరశాల యందు ముద్రింపించిరి. వారు ముద్రించుటకుఁ గాను పరిష్కరణార్థము గైకొనిన వ్రాతప్రతులలో నన్నిటను 4వ ఆశ్వాసము 344వ పద్యము సర్వ లఘు సీసమునకు అప్పకవి రచించిన పద్యము లేనందున శ్రీ రామానుజసూరిగారు "కరివరద . . . అను పద్యమును రచించి గ్రంథములోఁ జేర్చి ఆ సంగతినిఁ బీఠికలో "సర్వలఘు సీసమును బ్రతులలో లేమిఁ జేసి నూతనముగ నేర్పరుపఁ బడియె" అని (పీఠిక 2వ పుట)లోఁ దెలిపియున్నారు. పిమ్మట 1934వ సంవత్సరములో వావిళ్లవారు ప్రచురించిన యపుడు పరిష్కర్తలు చూచిన అన్ని వ్రాత ప్రతులలో అప్పకవియే వ్రాసిన (రచించిన) "చిరుత యగు . . . అనునది యుండి దానిని పద్యముల వరుసలోఁ జేర్చి శ్రీ రామానుజ సూరిగారి రచిత ముద్రిత పద్యమును అధో నివేదికలో జేర్చి ముద్రించినారు. ఆ విషయమును పీఠికలో (37 వ పుటలో) దెలిపి ఉన్నారు. పాదమునకు 36 అక్షరముల (లఘువుల) వంతున 4పాదములకు 244 అక్షరములు, దాని యెత్తు గీతికి మరికొన్ని యక్షరములు నుఁ గలిగిన సీసపద్యమంతటి పెద్ద పద్యమే యిట్లు కొన్ని గ్రంథములలో నుండి కొన్నిట లేకుండ నిఁక 36 అక్షరములు మాత్రము గల చిన్న అనుష్టుప్ వంటి ఒక శ్లోకము కొన్ని గ్రంథములలో నుండి కొన్నిటఁ బొరపాటున త్యక్తమగుటలో శంకింపఁ బనిలేదు. కనుక పోతన్నగారి భాగవత తాళపత్ర గ్రంథములో నీ శ్లోకము లేఖక ప్రమాదము చేత చేరక యుండవచ్చును. ఐతే భాగవతమంతటి మహాగ్రంథము నాంధ్రీకరింపబూనిన పోతన్నగారు ఒక్క మాతృకనే చూచి మరికొన్ని మాతృకలను జూచి యుండరా? అన్నచో— ముద్రణమునకుఁ గాను పరిష్కరణార్థము శ్రీ రామానుజ సూరిగారు చూచిన లన్ని అప్పకవీయ తాళపత్ర మాతృకలలో అప్పకవి కృతమైన సర్వ లఘుసీసము లేనియట్లు పోతన్నగారు చూచిన భాగవత మాతృకలయం దాశ్లోకము లేక యుండును అని తలంచనగును.— పోతన్నగారి కంటెను చాల యేండ్లు ముందటి పెద్దలు వ్రాసుకొనిన గ్రంథములలో నీ శ్లోకము దానికి వ్యాఖ్యలున్ను యున్నవి—

పోతన్నగారు *క్రీ. శ. 1422—1444 లోని వాఁడు. వీరికంటెను సుమారు 178 సంవత్సరములకు ముందు (1269) నున్న శ్రీ వేదాంత దేశికుల వారి కాలములో ముదుసలి వారై యున్నవారు, శ్రీ భగవద్రామానుజీయ శ్రీభాష్యమునకు శ్రుత ప్రకాశికాఖ్య వ్యాఖ్య రచియించినవారునైన శ్రీ వ్యాసాచార్యులవారు శ్రీ భాగవతమునకు శుకపక్షీయాఖ్య వ్యాఖ్యను రచించిరి. అనంతరము తదనుసారముగనే వీరరాఘవీయ వ్యాఖ్య అవతరించినది. ఈ విషయము వీరరాఘవీయ వ్యాఖ్యాన ప్రారంభ శ్లోకములు వీరరాఘవీయ భూమికలం జదివిన తెలియగలదు. ఆ పంక్తులు—

వీర రాఘవీయ వ్యాఖ్యానము— "శ్లో. శ్రీమ ద్భాగవతం పురాణమఖిలం వ్యాఖ్యాతృభి ర్వ్యాకృతం వ్యాసార్యై: . . . 1 తదాదర్శితం1 పంధానం సముపాశ్రితో వివృణుయాం . . . (వీ. రా. వ్యా. 4) —వీరరాఘవీయ భూమిక—

"శ్రీమచ్ఛ్రుత ప్రకాశికా ప్రణేతృ వ్యాసాచార్య వర్య విరచిత మితతమ శుక పక్షీయాఖ్య వ్యాఖ్యాక్షర రేఖా మేకా మప్య నుల్లంఘ్యా 22వ హితమనా: ప్రణినాయ శ్రీమద్భాగవత చంద్ర చంద్రికాఖ్యాం వ్యాఖ్యాం ద్వాదశభిర్వర్షై: 13" అని.

ఇట్లు వీరరాఘవాచార్యులవారు భాగవత వ్యాఖ్యాన రచనకు తా మనుసరించిన పూర్వ వ్యాఖ్యానములో వ్యాఖ్యాతమై యుండుటచేతనే బ్రహ్మ వేషధారియైన కృష్ణుని చేత బ్రహ్మ వంచితుఁ డాయెనని చెప్పెడి ఆ శ్లోకము "బ్రహ్మా 2పి స్వాసనస్థేన . . . అను శ్లోకము వీరరాఘవీయ వ్యాఖ్యానమునకుఁ బాత్రమై యొప్పినది. ఇందుచేత పోతన్నగారి కంటెను ముందటి పెద్దల వ్రాసుకొనిన గ్రంథములయందును నీ శ్లోకమున్నట్లు ఎంచనగును. పోతన్నగారి మాతృకలో లేనందున వా రనువదించరైరి యని భావించఁ దగును.

కథా మధ్యమున నున్న నియ్యంశము ఆంధ్ర భాగవతములో లేనందున నాంధ్రులలో నసంస్కృత విద్వాంసులకు మరుఁగు పడిపోయినది.

ఈ కథాంశము వలన నా కొకప్పుడు మిత్రులతోటి జరిగిన చర్చ ఇచ్చట వ్రాయఁ దగి యున్నది.

---

* ఈ కాల నిర్ణయము ఆనంద ప్రెస్సువారి భాగవతములోని వాగప్పాడి కుప్పుస్వామయ్య బి. ఏ. గారి ఉపోద్ఘాతము నుండి గైకొనబడినది.

నే నొకప్పు డొక గ్రామములో మిత్రుని యింట కొందర కోర్కెపై కృష్ణ కథ నుడువుట తటస్థించినది. అందు గోవత్సాపహార ఘట్టమున నీ యద్భుత కథనున్ను నుడివితిని. దానిని విని మిత్రులు ఇది భాగవతమున నున్నదా యని యడుగ నున్నది యని నేను బదులు చెప్ప రెండు మూడు భాగవత గ్రంథము లచ్చటఁ జేరినవి. ఒకటి చాలకాలమునాడు అచ్చైనది. కడమ రెండు చెన్నపురిలో నానంద ప్రెస్సు వావిళ్ల ప్రెస్సులలో ముద్రితములు. వాటిలో నీ కథాంశము లేదు. నేను ముందు సంస్కృత భాగవతములో చదివినందునఁ జెప్పితిని. అచ్చట సంస్కృత గ్రంథము దొరకదాయె. వారు సంస్కృత భాగవతమును చూడనివారు కాఁబట్టి మా కిట్టి చర్చ జరిగినది. కథ యైన పిమ్మట వారు "తమ రీయంశమును మరి యేదేని పురాణమునందుఁ జూచియుందురేమో" అని ప్రశ్నించిరి. అందుకు నేను "కాదు. నేను నాలుగు వ్యాఖ్యానములతో కూడిన సంస్కృత భాగవతమును రెండు మారులు పారాయణ మొనర్చినాఁడ. భగవదాజ్ఞా కైంకర్య రూపముగ మొదటిసారి. రెండవసారి— నేను ముందు సంస్కృత భాషలో రచించిన బాల భాగవత మనెడు కావ్యములోకి కథా సంగ్రహణార్థము. మత్కృతమయిన ఆ కావ్యమునందు నియ్యంశమును వర్ణించి యున్నాఁడ" అని తెలిపి మీరు సంస్కృత భాగవతమునుఁ జూచినప్పుడు ఈ కథాంశమును జ్ఞాపకముంచుకొని అందుఁ జూడు డని చెప్పితిని. ఇది నా యనుభవము. నుక ఆంధ్రు లందరు ఎరుంగు నిమిత్తము భగవన్మాయా మహిమము బోధించు నియ్యంశమునకుఁ జెందిన మూలమును, తద్వ్యాఖ్యాన పంక్తులను సంస్కృత భాగవతము నుండి యెత్తి యిట వ్రాయుచున్నాఁడ.

1885 సంవత్సరములో వనపర్తి సంస్థానమున బ్రహ్మ విద్యావిలాస ముద్రాశాలయందు విశాల పత్రములలో ఆంధ్రాక్షరములతో వీరరాఘవీయ భాగవత చంద్ర చంద్రికాఖ్య వ్యాఖ్యాన సహితముగ ముద్రితమైన శ్రీ భాగవతము 10 స్కంధము 13 అధ్యాయములో వత్సాపహార ఘట్టమునందు—

శ్లో. బ్రహ్మా ఽ పి స్వాసనస్థేన చతురాస్యేన శౌరిణా
మోహితై స్స్వపుర ద్వార్స్థై[illegible] పరిభూతో న్యవర్తత" 45

అని దీనికి వీరరాఘవీయ వ్యాఖ్య భాగవత చంద్ర చంద్రిక—

"తత్ర కిం వృత్త మిత్య పేక్షాయా మాహ" బ్రహ్మా ఽ పీతి" వత్సా న్వత్స పాలాంశ్చ తిరోధాపయిత్వా, బ్రహ్మా ఽ పి స్వస్థానం గతః, తత్ర స్వస్యా ఽ ఽసనే స్థితేన,' చతుర్ముఖ రూపేణ శౌరిణా, మోహితై, ర్ద్వారపాలైః, పరిభూతః, పరమేష్ఠీః స్వాసన మధితిష్ఠత్యేవ. కస్త్వ మాగతో ఽ సీ త్యేవం పరిభవం ప్రాపిత స్తతో న్యవర్తత". అని.

2 3 బొంబాయిలో శ్రీకృష్ణదాసాత్మజ ఖేమరాజుగారు తమ శ్రీ [illegible]శ్వర యంత్రాలయములో (1815 శకములో) తిర్యక్పత్రముల [illegible] (అడ్డ కాగితములలో) నాగ రాక్షరములతో ముద్రించిన శ్రీధరస్వామి రచిత "భావార్థ దీపికా వ్యాఖ్యా" శ్రీ ఉద్ధవాచార్య టిప్పణీ సహితమైన శ్రీ భాగవతము దశమస్కంధ పూర్వార్ధములో "బ్రహ్మ మోహ నిరూపణము" అను [illegible] 1[illegible] నందు 39 40 శ్లోకముల మధ్యలో కుండలీ కృతము ([illegible]) —

శ్లో. 1 బ్రహ్మా ఽపి యాత స్స్వస్థానం తత్రస్థేనహి
శౌరిణా! మోహితై ర్ద్వారపాలైశ్చ పరిభూతో న్యవర్తత

అని కొంచెము పాఠ భేదముతో నున్నది. దీనికి అధో నివేదిక బెట్టి అచ్చట నీ పంక్తులున్నవి.

"1. అయం శ్లోకో వీరరాఘవీయటీకాసమేత పుస్తక ఉపలభ్యతే. తస్య టీకా చేత్థం— అని వ్రాస వీరరాఘవీయ వ్యాఖ్యాన పంక్తులే ముద్రింపబడి యున్నవి. "తత్ర స్వస్యా ఽ ఽ సనే స్థితేన. అనుటకు బదులు "తత్రతస్యా ఽ ఽసనే స్థితేన" అని "స్వస్య"కు బదులు "తస్య" అని మాత్రము భేదముతో ముద్రితములు.

4—ఇకను భారద్వాజ శ్రీకృష్ణ గురు విరచితముని భావ ప్రకాశికా వ్యాఖ్యాన గ్రంథము (ఇది 1910 సంవత్సరములో చెన్నపట్టణము ఆనంద ముద్రాశాలలో నాగరాక్షర ముద్రితము)లో

శ్లో. బ్రహ్మ ఽపి స్వాసనస్థేన చతురాస్యేన శౌరిణా
మోహితై ర్ద్వార పాలైశ్చ పరిభూతో న్యవర్తత"

దీనికి పై వ్యాఖ్యాన పంక్తులు—

"తతః కిం వృత్త మిత్య పేక్షాయా మాహ.బ్రహ్మేతి. వత్సా న్వత్సపాంశ్చ తిరోధాప్య బ్రహ్మ ఽ పి స్వస్థానం గతః. తత్ర స్వాసనస్థేన చతుర్ముఖ రూపేణ శౌరిణా మోహితైః ద్వారపాలైః పరిభూతః. "పరమేష్ఠీ స్వాసన మధితిష్ఠత్యేవ. కస్త్వ మాగతో ఽసి" ఇత్యేవం పరిభవం ప్రాపితః న్యవర్తత".

బ్రహ్మదేవుఁడు లేగలను గోపాలులను అంతర్ధానముఁ జేసి తన స్థానముఁ జేరెను. ఆ తన స్థానమునందు చతుర్ముఖ రూపముతో తన ఆసనము నందుఁ గూర్చుని యున్న కృష్ణునిచే మోహితులైన తన ద్వార పాలకులచేత నిరాకృతుఁ డయ్యెను. బ్రహ్మ తన సింహాసనము మీఁదనే యున్నాఁడు. నీవు ఎవ్వఁడవో వచ్చితివి" అని బ్రహ్మ పరాభవము నొంది మరలెను అని ఉభయ వ్యాఖ్యాన పంక్తుల అర్థము.

వీటిలో భాగవత చంద్రచంద్రికా, మునిభావ ప్రకాశికా వ్యాఖ్యాన గ్రంథములలో శ్లోకము యొక్క పూర్వార్థ మొక్క రకముగ నున్నది. ఉత్తరార్ధము కొంచెము మారి యున్నది. భావార్థ దీపికా, మునిభావ ప్రకాశికా గ్రంథములలోని ఆ యుత్తరార్థ మొక్క తీరున నున్నది. కాన నీ పాఠ భేదమేల కలిగెనని కొందరకు శంక కలుగ నోపును. అందుకు— సర్వ శాస్త్ర గ్రంథములలోను నీ పాఠాంతరము లుండుట బహు గ్రంథావలోకనము జేయు వారెరుంగుదురు. నవకపులే తమ గ్రంథములలో కొన్ని పద్యములకు లేక శ్లోకములకు క్రింద పాఠాంతరముల ముద్రింపించుచుండ నిక ననేకమంది విద్వత్కవులు వ్రాసుకొనిన పూర్వ గ్రంథములలో నుండుట వింతకాదు. ఈ ఒక్క భాగవతములోనే పలుచోట్ల పాఠాంతరము లుండుట చూడవచ్చును. పాఠాంతరములు పండితులు ప్రాచీనగ్రంథములను వ్రాసుకొనునప్పుడు శ్లోకము నందలి యర్థము ననుసరించి ఇష్టానుసారముగ సలిపిన కొలఁది సవరణలతో నేర్పడునవి. కనుక ఈ శ్లోకమునకు నిట్లు పాఠాంతరమేర్పడి యుండును.

ఈ ఘట్టమునకు విరాఘవీయ వ్యాఖ్యానమునందు "పిత్రాపహార ఘట్ట మనియు, ప్రతిపత్తి వ్యాఖ్యాన గ్రంథమునందు బ్రహ్మ మోహ నిరూపణ మనియును జెప్పె.

ఇట్లు పలుచోట్ల వివిధ వ్యాఖ్యానములతోటి ముద్రితములయిన గ్రంథములయం దీ యంశము కలదు. దీనికి బూర్వ ప్రణీతములైన వ్యాఖ్యాన పంక్తులన్ని పై విధముగ నున్నవి.

ప్రక్షిప్తములు (అన్యులచేత చేర్పబడినవి) కొన్ని గ్రంథములలో నుండి కొన్నిట లేకుండుటయుఁ గలదు కాని నీ శ్లోకము కొన్ని గ్రంథములలో నుండి కొన్ని గ్రంథములలో లేదు కాని ప్రక్షిప్తము (అనఁగా అన్యులు చేసి చేర్చి నది) అనఁ జనదు. ప్రక్షిప్త శ్లోకములకు ముందు వెనుక ( ) ఇట్టి కుండలీకరణము అనఁగా బ్రాకెట్టు పెట్టుటయు, శ్లోకసంఖ్యయు వ్యాఖ్యయు లేకుండుటయు, (పిదప శ్లోకమునకు శ్లోక సంఖ్య వేసినను వ్యాఖ్యానము చేసినను వ్యాఖ్యాతలు వానిని ప్రక్షిప్తము అని తెలుపుటయుఁ గలదు. మేఘ సందేశము ప్రథమసర్గములో "హారాం స్తారాం స్తరళ ఘుటికాన్ . . . ఇత్యాది 33—34—35 మూడు శ్లోకములకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథసూరి వారటి వ్యాఖ్యానావతారికలో "ఇతః పరం ప్రక్షిప్తమపి శ్లోకత్రయం వ్యాఖ్యాయతే" అని ఆ మూడు శ్లోకములను ప్రక్షిప్తములుగఁ దెలిపి యున్నారు. "బ్రహ్మాపి స్వాసనస్థస . . . అనెడు ఈ శ్లోకమునకు అట్టి కుండలీకరణము (బ్రాకెట్టు) లేదు. శ్లోక సంఖ్య యున్నది. వ్యాఖ్యాత లెవ్వరు దీని ప్రక్షిప్తమని వ్రాయలేదు. కాన నిది ప్రక్షిప్తము కాదు. *

ఇక నే కవియేని కావ్య రచనలో నియ్యంశమును వర్ణించెనా ? అని అరయుదమేని

1. 1800 సంవత్సరములో పిఠాపురం సంస్థానపు మంత్రిగా నుండిన నియోగియైన అవసరాల పద్మరాజు రచితమై 1809లో అమలాపురము శర్వాణీ ముద్రణాలయాధిపతులగు పే.వేంకటేశ్వర్లగారిచే ముద్రితమైన చంపూ భాగవత (కావ్య)ములో (30వ పుటలో) వర్ణితము. ఆ పంక్తులివి—

"అథ చతురాననో నిజసదన మాసాద్య తత్ర కమలాసనా సీనస్య చతు రాస్యస్య లంఘిత వాసర శశాంక దశస్వవిషాద . . ." మిత్యాది.

2. శ్రీ నూజవీటి రాజాగారైన శ్రీమద్వేంకట రంగాప్పారాయ మహా రాజ సంస్థాన విద్వాంసులు శ్రీ వైష్ణవులు శ్రీమదాత్రేయ గోపాలకృష్ణార్య విరచితమైన శోభనాద్రీశ వైభవ మహాకావ్యము ఉత్తర భాగములో శ్రీ కృష్ణావతార కథయందు షష్ఠ (6) సర్గమున (1168వ పుటలో)

"శ్లో. సద్య స్సత్సపరింప్య పంకజభవో౽ న్తర్ధాప్య
వైఱం పున, స్తావసం ప్రాప్య చతుర్ముఖకృతి యు
జా సింహాసన స్థాయినా, శ్రీశేనా౽౽ హితమో
హాన్తః కృతతిర స్కారః ప్రతిహారకైః బృం
దర్శ్యోనా న్నిష్పత్యా౽ పునః స్తృత్యాత్మనా
౽౽ సేహసా". 71

ఇట్లు వైష్ణవ వైష్ణవేతరులలోని కొందర కవీంద్రుల యనుగ్రహ మునకుఁ బాత్రమై యున్నది ఇక్కథాంశము.

ఇకను ఆంధ్రములో నే కవీశ్వరుని యొక్కయేని కటాక్ష వీక్షణ మిక్కథాంశముపైఁ బ్రసరించెనా? అని యన్వేషించిన—

1. ముడుంబ సింగరాచార్యులవారి యథా మూలమైన భాగవతాను వాదమునందు నీ శ్లోకమునకు పద్యము కలదని చూచినవారు తెలుపుచున్నారు.

2. ఆంధ్రములో అనేక కావ్య రచయితలైన (క్రీ. శ. 1750లోని వారు) మరింగంటి సింగరాచార్యులు గారి "కృష్ణ శతానందీయము" అను ప్రబంధమునందు విస్తృతముగా నిక్కథ అభివర్ణితము. ఇది ప్రాచీన ప్రబం ధములవలె ప్రౌఢ ప్రబంధము.

3. అద్యతన కాలములో విక్రాల శ్రీ దేవమ్మ రచితమైన శ్రీకృష్ణ విరించీయము అను ప్రబంధమునందు నాతి సంక్షిప్తముగ వర్ణితము.

అన్వేషించినచో నింకను నెన్ని గ్రంథములలో చూడఁ గలమో? *

ఇట్లాంధ్రములోను కొందఱు ప్రాచీన నవీన కవివర్యుల లేఖి నియు నీ కథాంశముమీఁద పనిఁ జేసినది.

తాపత్రయ హరమయిన శ్రీకృష్ణ మహామహిమ సుధాసముద్రము నందలి యొక బిందువును ఆంధ్ర మహాజన మనుభవించి ధన్యము కాఁగ లందులకును, భక్తుల యొక్కయు, నవనవ హరికథా శ్రవణ కుతూహల హృదయుల యొక్కయు బ్రహ్మోదార్ధము ఇయ్యంశమును చర్చించి వ్రాసితిని కాని పోతన్నగారి రచనలో లోపముండి— దానిని జూపుటకుఁ గాదు అని విజ్ఞు లకు విజ్ఞాపనము. కొండ త్రవ్వి ఎలికనుఁ బట్టినాఁ డని యనకుండుటకై ముందుగ పురోభాగులకు వందనములు.

బంగరు తేకులపైఁ గడు
రంగుగ వాగ్దేవి పూని వ్రాయందగు శ్రీ
రంగము భాగవతము హరి
పొంగఁగ రచియించినట్టి పోతనకు నతుల్.

---

* ఈయన విషయము ఎం. కృష్ణమాచార్య విరచిత హిస్టరీ ఆఫ్ క్లాసికల్ సాంస్క్రిట్ లిటరేచర్'' అను నింగ్లీషు గ్రంథములోఁ దెలుపఁ బడియున్నది.

* ఆయిన శ్రీకృష్ణ కథలను విస్తరముగఁ జెప్పెడి (1) హరివంశము (2) విష్ణుపురాణము (3) బ్రహ్మ వైవర్త పురాణములలో నియ్యంశము చెప్పఁ బడ లేదే కారణమేమనిన? బ్రహ్మ వైవర్త పురాణములో విరివిగ వర్ణితమైన రాధా వృత్తాంతము తొలి రెండు గ్రంథములందుఁ గాని భాగవతమునందు గాని నామమాత్రముగనైనను పేర్కొనంబడని యట్లు నీ యంశమున్ను వానిలో చెప్పఁ బడ దాయెనని యెరుంగఁ దగు.

# చీకటి ముసుగు

శ్రీ జి. వి. సుబ్బారావు

బొట్టన వ్రేలినుండి
నడినెత్తి దాకా
తన్నాను ముసుగు
వెలుగు భరింపలేనని !

విడిచిన శ్వాసనే
మరల పీలుస్తున్నాను
వెలిగాలి పడదని !

పలయాలుగా చలిగాలి
గిలిగిలి పెడుతుంటే
దుప్పటిలో తల దూర్చాను
తప్పించుకొందామని !

తిమిరాలు భ్రమియిస్తూ,
మమకారాలు పెనవేస్తూ,
ముసుగులో ముచ్చట్లు
విసుగు లేదనుకొన్నాను !

నిండా మునిగినోడికి
చలే తెలియదని
భలే మురిసిపోయాను !

కానీ; —

అజ్ఞానం ఆపాదమస్తకం
ఆవరించిందని,
విజ్ఞానం కూపస్థ మండూకంలా
కలలు కంటుందని,
అసమానత్వం అంధకారంలో
ఆక్రమిస్తుందని,
దురహంకారం కార్చిచ్చులో
దహించివేస్తుందని,
నల్లని ముసుగు తెల్లని పదసత్యాన్ని
కప్పివేస్తుందని,
చల్లని ఈదురుగాలి ఉల్లంలో కరుణా కవోష్ణాన్ని
ముంచెత్తివేస్తుందని,
చీకటి ముసుగులో ఆకలిదప్పులు
సమూలంగా పశిస్తాయని,
తెలిసి కొనే లోగా,
మెలకువ వచ్చి కన్నుతెరిచేలోగా
నిలిచిపోయింది
నా ఊపిరి ! —
ముసుగులో ముసిరిన
మసక చీకట్లలో
ఉక్కిరి బిక్కిరై !!



# చెరువు దగ్గర....

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

అది పెద్ద చెరువు.

బుక్కరాయ సముద్రంవాళ్ళు బుక్కరాయ సముద్రం చెరువు అంటారు. కాని దేశంలో వాసుకేమో అనంతపురం చెరువనే— లింగప్ప చెప్పాడు. లింగప్పకి అన్నీ తెలుసు. రెండూళ్ళకీ ఆనుకునే వుంటుందది.

గట్టుమీద నిల్చుంటే ఒకవైపున చెరువు గట్టుల్ని ఒరుసుకుంటూ, అలలు అలలుగా ఎగసిపడే అలవిగాని చైతన్యాన్ని యిముడ్చుకొంటున్న ఆనంద సాగరం. గట్టుకు రెండోవేపున చూపుమేరంతా పచ్చనిపైర్లు. పైర్లనడుమ గుట్టలు. గుట్టల్లో గవులు. గవుల్లో మఠాలు. ఒక్కో దానికీ ఒక్కో చరిత్ర. 'పెనకసెర్లకాడ గంపమల్లయ్య కొండలో గవిలో నిమ్మకాయెత్తే యీ గవిలో మఠానికి దొల్లుకొత్తుంది' ఇంకా చాలా చెప్పాడు లింగప్ప.

చెరువుగట్టుమీద గణేశుడికి గుడికట్టారు. చుట్టూ చెట్లు కూర్చో డానికి రాతి అరుగులు. ఇంకా ముందుకివెళ్ళి ఆకాశంక్రింద నిలవడం సుశీ లమ్మకు యిష్టం. అక్కడ ఆమె మనసు విప్పారి, వికసించి, చెరువులోని నీళ్లలాగా మహానందంతో సుళ్లు తిరుగుతుంది. ఆ ఆనందానికి ఆకాశమే అవధి. స్వేచ్ఛలోకి ఎదిగిన మనసును గణేశుడి ముందుంచి నమస్కరిస్తుంది- ఇంటికి తిరిగి వెళ్ళేప్పుడు.

ఇంటికి వెళ్ళగానే మనసు తిరిగీ స్మశానంగా మారిపోతుంది. మృత్యు దేవతనీడ ఆమెను ఆవరిస్తుంది. 'నేను ఏ అనుభూతీ లేకుండా యిలానే వడిలి వాడిపోతాను' అనుకుంటుంది. నిస్పృహతో, ఏదో చెయ్యాలని, దేన్నో పొందా లని, ఏదో తపన. ఏమీ చెయ్యలేని నిరాశ. తనజీవితం తనదికానట్టు, ఎవరి బలవంతంమీదనో బ్రతుకుతున్నట్లు బాధ. జీవితకాలంలో ముప్పై అయి దేళ్లు—చాలాభాగం—గడచిపోయింది తెలీకుండానే. ఇహ చచ్చిపోవడం తరువాయి. బ్రతకుండానే చావు! ఆమెలోని నిజం జీవితాన్ని అనుభవించాలని, నవ్వాలని, 'ఏడవాలని, అందులో లీనమై, పోవాలని ఆరాటపడుతూ, దాన్ని అందుకోలేక విడిగా నిలిచిపోయి, వ్యర్థంగా నశించిపోతున్నట్లు భావన కల్గుతుంది. తానేదో బలాత్కారానికి గురిఅవుతున్నట్లు, . ఎవరో తనను మోసం చేస్తున్నట్లు అని పిస్తున్నది. గడచినజీవితం ఎడారిలాగా, ముందున్నది స్మశానంలాగా తోస్తు న్నది.

'నాకేదో దయ్యం పట్టింది' అనుకుంటుంది ఒక్కోసారి. అయినా ఆ ఆలోచనలు ఆమెను వదలవు. కొంతకాలంనుంచి ఆమెలో ఇలాంటిమార్పు వచ్చింది. తనలోని ఎవరో తనను చూచి నవ్వటం మొదలెట్టారు.

అంతకు ముందు ఆమెలో ఏవిధమైన అసంతృప్తీ ఉండేది కాదు. ఆమె ఉత్తమురాలు. తరతరాలుగా మంచిని పోర్చుతూవచ్చిన రక్తం ఆమె నరాల్లో ప్రవహిస్తున్నది. ఆమె పెద్దల్ని కాదనలేదు. భర్తను దైవసమా నుడిగా ఎంచుకున్నది. కష్టాల్లో వుండేవాళ్ల ఎడల దయాదాక్షిణ్యాలు చూపిం చింది. భోగభాగ్యాల్ని ఎన్నోరూపాల్లో మహదానందంతో భావించుకున్నది. పూజించింది. ఆచారాల్ని అనుసరించింది. ఇంతకుమించి మరేదో కావాలని ఆమెకు తోచలేదు.

ఆమెభర్త గోపాలరావు కమర్షియల్ బాంకు నడుపుతూ బాగా సంపా దిస్తున్నాడు. నవ్వుని చురుకైన మొహం, మల్లెపువ్వుల్లాంటి బట్టలు, చెదరని క్రాపు, పరిసరాల్ని క్రమ్మివేసే ఫారిన్ యుడికొలోన్ వాసన—అతనిలోని యీ లక్షణాలన్నీ ఆమెకు చాల ప్రియమైనవి.

అతను ఆమెకు బహిఃప్రాణము. అతన్ని చూసి ఆనందపడుతుంది. గర్వపడుతుంది. అతనులేని జీవితం ఆమెకులేదు. అతనికి చిన్న జలుబుచేసినా, ఏమైపోతాడోనని భయపడి, అతనుక్షేమంగా వుండేటట్లు చేయాలని పరమేశ్వరుడికి మ్రొక్కుతుంది. అతను ఇంట్లోంచి బయల్దేరినప్పటినుండీ ఆమెమనసు భయంతో కొట్టుకుంటుంది. బయల్దేరిన రైలు సవ్యంగా గమ్యంచేరునా ? దోవలో ఎన్నిమలుపులు, ఎన్నిఅవరోధాలు, ఎన్ని అపాయాలు ! అన్నింటిని తలచి తలచి భర్తక్షేమంకోసం ఎంతగానో ఆరాటపడి, తపించి, ధ్యానించి మ్రొక్కి, వెయ్యికళ్లతో ఎదురుచూచి, అతను కనిపించగానే మహదానందంతో ఆహ్వానించి.... ప్రతిక్షణమూ అతనికోసమే బ్రతుకుతుందామె.

'సీతా' అని పిలుస్తాడు గోపాలరావు ఏకాంతంలో.

సుఖంగా గడిచింది కాలం. ఆమెకు 'అవసరాలు' అనేవిలేవు. గోపాలరావును ఆమె కోరింది ఒక్కటే—క్రొత్తగా కట్టిన ఇంట్లో ఎత్తుగోడలూ విశాలమైన వైన గదులూ ఉండాలని. వైశాల్యంలేనిచోట ఆమె ఉక్కిరి బిక్కిరి అయి పోతుంది. మనసు కుంచించుకుపోయి, ఇరుకులో చిక్కుబడ్డట్లు విలవిల్లాడు తుంది. అది ఒక ఊహగా కాకుండా నిజంగా, భౌతికంగా బాధిస్తుంది. అదొక్కటే ఆమె ఆధారం.

ఇప్పుడు అంతా మారిపోయింది. 'ఏం, ఇన్నికష్టాలు—లేనివి—వూహి స్తున్నావేం ? అతను బాగుండాలని లేదా ?' 'జలుబుకే మనుష్యులు చచ్చి పోతారా ?" 'ఈ పాతివ్రత్యం ఏటిష్టం చేసుకోడానికి అతనిమీద లేనిపోని అపాయాలు కల్పనా' —లోపల్నుంచి నవ్వుతారు ఎవరో. ఆమె నిరుత్తరయై గాబరాపడుతుంది. పురాణకాలంనుంచి మహాపతివ్రతలు పతినే సదా ధ్యానిస్తూ, అతని క్షేమంకోసమే అహర్నిశలూ భగవంతుని వేడుకుంటూ, తులసీమాతకు పూజలుచేస్తూ ఉండటం అందరికీ తెలిసిన విషయమే కదా ! అయినా లోప ల్నుంచి పుట్టుకొస్తున్న వెక్కిరింపు ఆగలేదు. 'నేను ఉత్తమురాల్ని' అన్న అహం ముక్కలైంది. 'నేను ఏ తప్పు చేయలేదే. ఎందుకీ అసంతృప్తి ? అనేకయుగాలనుంచి తరతరాలు ఎన్నుకుంటూ వస్తున్న భారతీయ జీవన విధానం ఉత్తమమైనది కాదా ? అందులో లోపం ఏర్పడిందా ?' అనుకున్నది.

కడుపులో పువ్వును దాచుకున్న మల్లెమొగ్గ ఈ మనసు అన్పిస్తున్నదామెకు.

'మనింట్లో ఆడపిల్లలు మగరాయుళ్లలాగా చెట్లూ చేమలూ ఎక్కి తిరగరాదు' ఆ జామకాయలు తియ్యగా వుంటాయి. పళ్లతో కసిక్కున కొరికితే తియ్యని రసం వూరి వస్తుంది. ఆకాయలుకోసం మిగతా పిల్లలతో కలిసి చెట్టెక్కిన ఏడేళ్ల సుశీలను కట్టడిచేస్తున్నది వాళ్ల నాయనమ్మ. అప్పట్నుంచీ ఆపిల్ల చెట్టెక్కలేదు. 'మనింట్లో ఆడపిల్లలు ఒకరింటికివెళ్లరు' ఆపిల్ల వెళ్లలేదు. సుశీలకి పైటలు వేసుకునే వయసు వచ్చినప్పుడు వాళ్ళ నాయనమ్మ చెప్పింది—'ఒక్కచోట వుమ్మేస్తే తుంపర్లు అన్ని వూళ్లల్లోకీ ఎగిరిపడ్తాయి. పేరు ఎట్లా నిలబెడతావో, జాగ్రత్త' సుశీలపేరు నిలబెట్టింది. ఫలానా ఇంటివారమ్మాయి బుద్ధిమంతురాలనిపించుకున్నది. ఆ ఇంట్లో పుట్టే ప్రతి ఆడపిల్లా ఒక ఉత్తమాయిల్లాలు, 'ఎప్పుడూ పొరపాటు రాకూడదు. తప్పు అనేదానికి నిష్కృతిలేదు. పేరు నిలబెట్టు జాగ్రత్త జాగ్రత్త జాగ్రత !!!'—తెలివివచ్చినప్పట్నుంచీ వాళ్ల జీవితాన్ని గురించి ఏర్పరచుకునే ముఖ్యసూత్రం యిదే. సుశీలమ్మ ఆ ఇంటిబిడ్డ.

పిల్లలు పుట్టకపోవటం యీ అసంతృప్తికి కారణమా ? అనుకుని వెంటనే త్రోసివుచ్చింది. లేనివాటికోసం బాధపడటం ఆమె తత్వంకాదు.

తన జీవితంమీద, తన మనసులో పుట్టే భావాలమీద, తన నమ్మకాల మీద, 'తన' మీద వ్యతిరేకతలాంటి భావం పెరిగింది ఆమెలో. తన మనసే తనను నలిపివేస్తున్నట్లు, స్వేచ్ఛ అనేది తనకులేనట్లు ఉక్కిరి బిక్కిరి అవుతుంది. 'మంచితనం' అన్న ముసుగు తనకెందుకు ఆవరించింది ? ఈ ముసుగులోంచీ వ్యవహరించడానికేగాని 'జీవించ'డానికి తనకు హక్కులేదేల ? 'ఏపనిగాని సద్యస్ఫూర్తితో ఆనందంగా చెయ్యలేనా ? అనుకుంటుంది.

ఏడాది క్రిందట లింగప్ప గోపాలరావుగారి బాంకులో వాచ్‌మన్‌గా చేరాడు. ఎనభై ఏళ్ల వయసు, మోకాళ్ల నొప్పులు, కూర్చునిలేస్తే బాధతో మొహం చిన్నదవుతుంది. పనిచేస్తేగాని ఇంట్లో గడవనిస్థితి. కొడుకు చోటు లేశు సంపాదిస్తున్నా పైసాసాయం చెయ్యడు వానిది వేరే కాపురం. ఇక్కడ పని ఖాళీ వున్నదని తెలిసి వచ్చాడు. సుశీలమ్మకు జాలేసింది. గోపాల్ లింగప్పని పరీక్షించి పనియిచ్చాడు. రాత్రి బాంకులో నిద్రపోతాడు లింగప్ప. పగలు కొంతసేపు ఇంట్లో తోటపని చూస్తాడు. పనిలేనప్పుడు సుశీలమ్మ లింగప్ప కబుర్లు ఉత్సాహంగా వింటుంది. కొండలలాగా చెట్లులాగా బుక్కరాయ సముద్రం చెరువులాగా అనిపిస్తాడు లింగప్ప ఆమెకు. లింగప్ప కబుర్లు వింటుంటే మనసు ఏదో స్వేచ్ఛను పొందుతుంది. ముసలితనం, నొప్పులూ అన్నీ విడిపోయి ఒక జీవవాహినిగా మారిపోతాడు. తన బంధువుల్ని, వంశ చరిత్రను, యర్రగడ్డమ, అందులోని వనాంతరాల్ని, దేవుళ్లను, దేవుళ్లకు జరిపిన పరసల్ని, తాను తిరిగిన దేశాల్ని, వాసనాజీవులైన జంతువుల్ని, మనిషి జాతిని, దాన్ని నడిపే ధర్మాన్ని—అన్నిటినీ ఆక్రమించుకొంటూ పెరుగుతాడు లింగప్ప.

'ఆ బిటీష్‌రాజ్యంలో సంగతి...'అంటూ మొదలౌతాయి అతని కబుర్లు సాధారణంగా. అప్పుడు బిటీషు రాజ్యంలో—తాలీత బస్సులు వాలుగు సెక్రాలవే, సిస్సవి. శార్జీలు కూడా దమ్మిడీ బోట్లు, అరణా—అంతే. రామసంద్రప్ప బస్సులో కండక్టరుగా చేరాడు లింగప్ప, ఆయన ఎత్తారం మడిసి. ఊపాక పాయం, ఎర్రగా రాజాయకట్టుండేవాడు. 'ఒరేలింగా, ఎట్లానావున్నాం పెప్తే నప్పుడు, పెట్టినట్టా గాకుండా పెట్టాలట్లా గాకుండా ఒంటి సెయ్యెత్తితే పలంలేదు. రొండుసేతులూ నెత్తిమీకెత్తి దణ్ణంపెట్లు' అని సెప్పినాడు. అప్పట్నుంచీ లింగప్ప ఎవురికేనా రొండుసేతులూ మీకెత్తి బుర్రవొంచి 'దొరా' అని దణ్ణం పెడ్తాడు. ఆయన నేర్పిందే. ఒది దాన్ని మానే నియమంగల వాడను కొని పనిలో చేర్చుకున్నాడు గోపాలరావు. అనుకున్న పని [illegible] వ్యసనంగా చెయ్యడం లింగప్ప స్వభావం. కాని నియమంగా పనిచేసుకుంటూ పోవడం ఒకటే అతని ముఖ్యలక్షణంకాదని త్వరలోనే తేలిపోయింది. వూరినిండా లింగప్పను తెలిసినవారే. పని ఒదిలి, నడిమధ్యలో, కనపడ్డవాళ్లతో మాట్లాడటం లింగప్పకో అలవాటు. మిర్పారిమీద సినుకులు పడ్డయ్యా ? వంకలు పారినయ్యా ? సెరువుకి నీళ్లు ఎన్ని మెట్లొచ్చెయ్యి'వంటి పనికి మాలిన విషయాలు అందర్నీ అడిగి కనుక్కుంటాడు. తాను తెలిసిందనుకున్న విషయాన్ని గురించి ధారాళంగా సలహాలిస్తాడు 'ఆఫ్టరాల్ పనిచేసే వెధవని గుర్తుంచుకోడే. బోడి సలహాలిస్తాడు' అని విసుక్కుంటాడు గోపాలరావు.

గోపాలరావు లింగప్పని పనిలోంచి తీసేద్దామనుకునేంతలో సుశీలమ్మ అడ్డుపడ్డది. ఆపాటికే లింగప్పపట్ల ఆత్మీయత ఏర్పడ్డది ఆమెకు. తన జీవితంలో తాను అనుభవించలేనిదేదో లింగప్ప జీవితంలో వెదుక్కుంటున్నదామె మనసు. లింగప్పలో ఏదో లయ వున్నది. సజీవమైన భాష, దాని కనుగుణంగా చేతుల కదలిక, ముఖభంగిమ—యీ అన్నిట్లో ప్రవహించే విషయం—ఆ విషయాన్ని జీవించిన లింగప్ప—లింగప్ప, అతని జీవితమూ వేరుకానేకావు !

ఒక పాట కచేరీలో బాలమురళీకృష్ణ 'ఎందరో మహానుభావులు' పాడగా విన్నది అతను పాడుతున్నాడు, వింటున్నాడు, ఎందరో మహానుభావుల్ని తలుచుకొని ఆనందిస్తున్నాడు...ఒక్కడు శ్రోతలులేరు, గాయకుడు, అతనొక్కడే వున్నాడు....అతనూ లేడు, [illegible] ఆనందసమాధి నిమగ్నమై ముదంబునను యశంబునగలవారే ఉన్నారు...వాళ్లూలేరు ఒక తన్మయానాదం, ఒక స్పందనమాత్రం ఉన్నది...అప్పుడామె కళ్లలోంచి ధారాపాతంగా నీళ్ళు కారిపోయాయి.

ఒక్కోసారి లింగప్ప మాటలు వింటుంటే ఆమెకు ఎందుకో ఆనాటి అనుభవం గుర్తుకొస్తుంది. లింగప్ప [illegible] ఆమెకు తెలుసు. 'మా మనవరాలికి ఒళ్లు కాలిపోతా వుంది' అని వరుసగా నాలుగురోజులు చెప్పాడు. అయిదోరోజున 'సూది' [illegible] తగ్గిపోయింది' అన్నాడు. 'అస్పత్రికి తీసుకెళ్లావా' అనడిగింది సుశీలమ్మ. '[illegible] పాడిసిపోనారు' అన్నాడు. '[illegible] సంబంధంలేదు' అన్నదామె. ''ఏమో, తగ్గిపోయింది' అన్నాడు, [illegible] ఆ విషయం ఎందుకు అన్న ధోరణిలో [illegible]. 'వెర్రి మనిషాడు' అనుకుంది. ఎప్పుడో [illegible], తెలియకుండానే చచ్చిపోతాడు' మనస్సు [illegible]. 'నాకు [illegible] మా ఇంట్లోవాళ్లకు తెలుసు. బాగా [illegible]. [illegible] బెండి పిసుక్కొని తిని, బాగా [illegible]. [illegible]

బోతదో ! ఇంగో మందు బనిశే...' జ్వరం అనేది ఒక్కరకమేవుపున్నట్లు ! కాని ఆ వెర్రితనంలోనే ఒక నిండుదనం, ఏదో ఏకత్వం, జీవితంలో నమ్మకం కన్పిస్తుంది. 'మా పెద్దోల్లు—నాయనలు, పెదనాయనలు—గుంపు పెద్ది. యాభై మందిలు. మా వోమిశానికంతా నేను మిగిల్నాను. మా మేనమావల ఇంటకి ఒగడు మిగిలినాడు. తక్కినజనాలు యాడబోయినారో...ఎన్నిరాసులు యీసేతలమీద మోసినానో ఎక్కడ ఎవురు సచ్చినా ఎవిక్కి తీసేదిలే. పదాఅనేదే...'అతని గొంతు తగ్గిపోతుంది. కాని అందులో జాలిగాని దుఃఖంగాని వుండదు. తల వూపుతూ దీర్ఘంగా అంటాడు 'దెసెలోల్లం ముందుకి కాటి దిక్కుకు పోవల్సినోల్లంగెదా' సుఖం, దుఃఖం, జబ్బు, చావు—అన్నీ జీవితంలో భాగమే లింగప్పకు.

'నాకో ?' అనుకుంటుంది సుశీలమ్మ. 'పీనుగువెళ్తుంటే చూడకూడదు. చిన్నపిల్లలు జడుసుకుంటారు' నావికాని విలువలకోసం నాదికాని జీవన విధానంలో సాగుతూ, అర్థంకాని దానికోసం అర్థమయ్యేదాన్ని విడిచి, జీవంకోసం చూడబోయి జీవితాన్నే పోగొట్టుకుని..... 'నాకు జీవితమే మృత్యువులో భాగం ?' అనుకుంటుంది విరక్తితో.

## 2

"తొలిత వూల్లో పార్టీలు పడతారు. సరువులకని పిల్లలు, అంబటిత ఒక ముసిల్ది ఒచ్చి సంసారం పెడతారు. తరవాత ఒక ఎనుంగొడ్డునిపట్టి పాలమ్ముతారు. రాంగ రాంగ వూల్లోని బావి యిల్లూ అమ్ముకొని ఇక్కడే సెరిపోతారు. నీదేవూరంటే అనంతపురం అంటారు. ఎవురైన్నా అడుగు, నీదే వూరంటే అనంతపురం అంటారు 'అసులా', అని అడుగుతా 'అవును, అసులే' అంటారు. అప్పుడు నేను వాల్లని ఒకటేమాటడుగుతా 'నీది మొదుట్నుంచే అనంతపురమైతే తొలితొలిగ యీ వూరెంతుండిందో సెప్పు. అప్పుడు వాల్యా వుండిన మడుసు లెవురో ఇప్పుడెవురో సెప్పు' అని 'అ, నే ఒచ్చి ముప్పై ఏళ్లయింది....నీదేవూరు' అంటారు. 'మాది యావూరో!... ఎక్కడనుంచీ ఒచ్చివానో' అంటా..."వినయంగా వంచిన తలని వూపుకుంటూ నవ్వుకుంటూ బోడినెత్తి తడువుకుంటాడు లింగప్ప. అనంతపురమూ లింగప్పా ఎనభై ఏళ్లూ కలిసే వున్నారు.

శామీలని ఇంజనీరు దొర, ఎత్తారం మడిసి, టోపీ పెట్టుకొని, గొడుగు కర్రాయకట్టు ఒంకికర్ర పట్టుకొని బేజోరుగా నడుత్తాడు—ఆయన కట్టించే రేలుటేసను, ఆయన గుంటూరు టాన్సపరైపోతా 'నా దెగ్గిర పనిత్తా, పనిత్తా, రారా వరవోడ' అన్నాడు. అప్పుడు లింగప్పకి దూడపాయం. అయినా పోలా అయినవూ రిడిసిపెట్టి యాడికిపోతాడు !

ఇప్పుడు లింగప్ప ముసలివాడు. పొట్టిగా గట్టిగా కుదిమట్టంగా కన్పించినా వయసుతోపాటు శరీరంలో కండ హరించుకుపోయింది. అమాలీ అందరికీ ఒచ్చేదే— మోకాళ్ళ ఇంతలావున వాచి సలుపుతూ పీకుతూ వుంటాయి. కుడికాలు పేనుంచీ కిందిదాకా యీడుత్తుంది. పని చెయ్యకపోతే [illegible] తండ్రి అంటేనేకంపరం వోబులేశుకి, ఎన్ని అవకాశాలు పైకి రావడానికి ! సరైనపని ఒక్కటే చెయ్యలేదు లింగప్ప. 'అప్పుడీ వూరెంతుంది ? పాయ రె. జీనియర్ కాలేజీ వుండేసోటు అడివి. చెట్లు, పలం జాత్. సరిసా కం రూపాయికిత్తా, తీసుకోమని సుబ్బయ్య బంగపాయె. నాకెందుకీ యడివిలో, అని తీసుకోకపోతి. ఇంజినీరు కాలేజీ దెగ్గర ఎకరా అయిదు రూపాయిలకిత్తా, మీ కురవోల్లకి ఎనికొత్తదని బుప్పాశారి అడుక్కునె మనిసీ మానూలేని ఎట్టెట్టు సోటని ఒద్దనేత్తి' వోబులేశుకి విన్నకొద్దీ మండుకొస్తుంది. సరిగ్గా తెలివిగా వ్యవహరించివుంటే యీపాటికి తాము పెద్దోళ్ళుగా వుండవలసింది ! లింగప్ప చింతలేకుండా చెప్పుకుపోతాడు 'నేను సూడంగానే యీ అనంతపురం ఎన్ని రవాలమారింది ! పెద్దోల్లు దివాలాతీసిపోనారు. సన్నజనం పేకెక్కి మాడీల మీద మాడీలు కట్టినారు. కిట్టప్పని తొలిత యీవూల్లో వోటలు బెట్టినాడు. ఆ యమ్మకి పెయినిండా బంగారే. ఒక బవంతి గట్టినారు—గోడల్లో తంబాల్లో నీడలు గనపడేట్టు కట్టినారు. ఏమి దర్బారు జరిగింది ! ఇప్పుడయ్యన్ని యీటికి బొయినయ్యో ! ఆయమ్మ యీవూల్లో అడక్కతింటా వుంది. అప్పుడు బేట వరండాలో బొరుగులమ్ముకుంటున్న కదిరి సేసప్ప ఇప్పుడు షేషారొడ్డి. యమ్మెల్లే. ఇప్పటోల్లు పేకిలేత్తన్నారు—దొంగ డబ్బులోల్లు, కల్లమ్ముకునే వోల్లు, మట్కా ఏజెంట్లు...."

'నీవు మాత్రం అటాగే అడుగునే వున్నావు' అంటాడు వోబులేశ కసిగా.

లింగప్ప జీవితంలోని పెద్ద ఆపద ఆ కొడుకు అని సుశీలమ్మ అనకుంటుంది. "ఇటువంటి కొడుకుల్ని కష్టపడి పెంచి ఫలమేమిటి లింగప్పా అన్నదోసారి.

"పెంచాల్సిన పద్ధతి వుంది గనక పెంచుతాం. తరవాతకి ఏంచేత్తారు, ఎట్టవుతుంది, అనుకుంటామా ?....ఇంతజనాలు ఎందుకు పెంచుతున్నారు?... వాల్లు బిడ్డాపాపల్తో సుకంగవున్నారు, మనకురేరని గుల్లు గోపరాలు తిరగతారెందుకు ?...మన పెద్దోల్లు మనన్ని ఎందుకు పెంచారు ?...ఇది ఎన్నోతరాలుగా వత్తన్న పద్ధతే గందా... పలం సూసుకుంటే?... పిల్లలే ఒద్దనుకుంటే?.. ఇదేం వెర్రి ప్రశ్న అన్న ఆశ్చర్యంలో మునిగిపోయాడు కాసేపు. 'వూరికే బువ్వతిని ఇంటో సేతులు ముడుసుకు కూసోవాలా ? పిల్లి , కోడి, కుక్క, నక్కా అన్ని జీవులకీ వుండేదే గందా ? రెక్కలొచ్చేదాకే పెంచాలి. ఆ పేన దేవుడు... మనిసి పుట్టిందెందుకు ?....' ఇంతకంటే ఎక్కువగా ఆలోచించలేక, ఆమె ముఖంలోకి దీర్ఘంగా చూశాడు. 'కాలం మారిపోతావుంది. మంచిసెడ్డ పాపం పున్నెం లేకపోనాకా నాయనేంది ? కొడుకేంది?... నేనేమో మా యమ్మయ్యకి సేతనయినయ్యన్నీ సేసినా. దెశెలు అయినాక మంచంలో జెరంతో వోరం రోజులుంది. పియ్యెత్తే దెగ్గిర్నుంచీ అన్నీ సేసినా. అంగిట్లోనుంచీ మిటాయి, జిలేబి, కారాబూంది అన్నీ పొట్లాలు గట్టించి తీసుకెళ్లి పెట్టినా. నాకేం అక్కర్లేదని తలూపింది. అయినా అన్నీ తినిపించినా. సచ్చినంక రాత్రంతా బజన పెట్టించినా. జనానికంతా పేదసాదకి బాగా పెట్టినా..."ఉత్సాహంగా చెప్పుకుపోయాడు.

గొర్రెల్ని మేపుకుంటూ యర్రగెడ్డంతా తిరిగాడు లింగప్ప 'గార్లదిన్నె, కనంపల్లి, తఇగాసుపల్లి, గుమ్మేపల్లి, పోరురాయి, నాగసంద్రం, ఒంకిరేసు కాలవ, అంతరగంగ, కంగల్లు, ఒప్పేరు...నోటిలో యీవాను పోమ్మయ్యా, అయన్నీ వున్నై యీ గెడ్డన.. 'వూళ్ల పేర్లు చెప్తోట్లు చప్పరించినంత పీతితో నోరు అడిస్తూ వస్తాడు. అనంతపురం గురించీ, అదివున్న యర్ర

గడ్డ గురించి ఎవరైనా ఏ కొంచెం ఆసక్తి చూపినా కునుకుతున్న కళ్లల్లోకి చివ్వున పొంగివస్తుంది జీవం. అతని జ్ఞాపకాల్లోని ఒక్కో విషయం, అతని జీవితంలోని ఒక్కోముక్క, యర్రగడ్డ చరిత్రలోని ఒక్కోభాగం, అందులో స్వేచ్ఛగా తిరిగిన కురవల జీవితాల్లోని విశేషాలు—తిరిగి జీవిస్తాయి. యర్ర గడ్డ అతనితల్లి. ఆ బూవమ్మ బిడ్డ అతను.

“మా కురవోళ్లలో పొద్దున్నే మొగంకడిగినో డెవురు? లేసేది, సద్దిదినేది, సేతులు గొర్రెలకి రుద్దేసి, మూత్తుడుసుకుని పోతావుండేది. నీళ్లు—నీళ్లక్కడ దొరుకుతే వనంతరాల్లో దిరిగే వాళ్లకి? వున్నప్పుడుంటై, లేనప్పుడుండవు. అందుకే మా కురవోళ్లు దప్పిని సంపేత్తారు. తొలీతే ఎక్కువనీళ్లు తాగరు. వున్నయ్యని ఇప్పుడు తాగితే, లేనప్పుడెట్లా ?...”

“సిక్కంలో ఆడోల్లు బువ్వదెత్తె ఎంతమంది బీదాబిక్కీ మేవుండే తావు ఎతుక్కుంటూ ఒచ్చేవోల్లు ! లేదనకుండా అందరికీ పెట్టాల్సిందే. పిల్లలున్నారంటే పాలు తిరిపెంగా పొయ్యాల్సిందే...”

“ఒకపాలి డొక్కల సెరువుకాడికి మంద దోలకపోయినం. మాల పున్నమి. పెదబోయోల్లంతా ఎనబైమందొచ్చిన్రు, తలాక తిరిపెంపిల్ల లియ్యమని, యాడదెచ్చిత్తుం అన్ని పిల్లలు ! ‘మేం ఒగిటిగూడ యీము. మెబ్బులో గావాలంటే మందంతా డోలకపోన్రి’ అనేసినం. వాలు పరాక్రమం సేయబట్టినరు, ‘యాగెడ్డ కురవోల్లురా మీరు’ అంటా. ‘యర్ర గెడ్డ కురవోల్లంరా’ అని మేంపదిమందిం. ఇంతలో ఆదోవంటె పోలీసుజీపు బోతంటె వాల్లు తగ్గి ‘రెత్తిరికొచ్చి ఎత్తకపోదాము’ అని మల్లినారు. మేం మందలేపుకొని ఇంకో దోవన పల్లొచ్చినం....”

దూడపాయంలో లింగప్ప బవుదింకంగా వుండేవాడు. తుమ్మదిగాని యీతదిగాని, సిగరదిగాని, గిరుసుకట్టెగాని సొక్కాలేకుండా వుత్తపేన ఇరగ్గొట్టేవాడు. తిండి బేదినేవాడు. లారీల్లో కీనరుగా బోతా మదరాసుదాకా విన్నాడు. ఒసిపేటదాకా దిన్నాడు. హోటల్లో తొలినాడే అన్నం పెట్టేది. తరవాత మొగంచూసి లేదనెత్తారు. కల్లంగడికిపోతే ముంతతో కల్లిత్తే అది తాగి, ముంతని కూడా నములుకోని తినేవాడు. దాన్నంటే లింగప్పని గనుక్కొని వాల్లు ముంతలియ్యరు. సీసాలిత్తారు.

‘ఒక పాలేవయిందంటే ఒక పల్లెలో హోటలోడు అన్నమొండి మా ఆరుగురికీ బెట్టినాడు. అందరూ దిని లేసిపోయినారు. నాకు సాలల్లా. ఆడు అన్నం లేదనేసినాడు. నాకు మారు బెట్టేదాకా లెయ్యనని కూసున్నా. తాగిన మంపరం, తక్కిరి బిక్కిరి. వాడు పెట్టాలా. నాకు కోపవొచ్చి అరిత్తరాకులూ పిండిజేసి తింటి. ఈనెలు గీనెలు అన్నీనములుకోని తింటి. నా యిత్తరాకు దోసె బీక్కొని తిన్నట్టు తింటి. ఇంకా గబ్బు లేపతా సూడని వూల్లోకి బోయి ఒక గాడిదని బుజాలమీది కెత్తుకొని మోసుకొచ్చి వాడింటిముందెత్తి. అప్పుడు వాడు మల్లీ అన్నంసేసి యిచ్చినాడు మూటగట్టి... వూరు జేరినంక మూడుముంతల కల్లుదాగి, ముంతలుదిని, ఒకటిన్నర దరాము సారాయిదాగినా. పావలాకు గంప కురాకు దీసుకొనితింటి. కడుపునొప్పిఎత్తుకుంది.ఇంటికిబోయినా.

అతి సామాన్యపు జీవితం. అధమాధమపు జీవితంకూడా. ‘కాని అది చావు తాకలేని జీవితం. నిరంతరం ప్రవహించే జీవవాహిని’ అనుకున్నది.దానిలో ఎంతనవ్వు ! ‘సెప్పే, నగుతారు. నాకే నగొస్తావుంది...’ ముసలిమొహంలో నవ్వువిసిరి, విరిగి, ముసలికళ్లల్లో నీళ్లూరుతాయి. తలకిందికి దించేసి బుజాలు ఎగిరిపడేలా నవ్వుతాడు. ‘ఆ బిటేసు రాజ్జెం సంగతి...మదరాసు బీసిః బోయినం. అప్పుడు రొండణాల కొకటవులు. కొత్తటవులు నెలమీదేసి, బొరుగులు పుట్నాల కొనిపోసి సవద్రంయేవుకి యీవుతిప్పి బొరుగులు నవులుకుంటూ బీసిలో ఆటలాడేవోల్లనిసూతూ గూసున్నాం. వాల్లు మెమ్మల్నిసూసి వూరికే నవ్వను బట్టినారు. వారు నవ్వుతుంటే ఎందుకో తెలీకుండానే మేవూ నవ్వుతుండాం. మా పెద్ద పెద్ద కొప్పుల్నిసూసి నవ్వుతుండా రనుకున్నాం... ఆడోల్లకి గూడా వుండవు అంతపెద్ద కొప్పులు..ఇంతలో ఎనిక్కి తడి తగిలింది...ఎనక్కి తిరిగి సూద్దుం గెందాం, రొండణాల టవుళ్లు బొరుగులు అన్నీ సవుద్రంలో కెల్లిపోయె. వాల్లు నవ్వా, మేం నవ్వా...’ లింగప్పా, సుశీలమ్మా ఒకరొకరు చూసి ఒకటేగా నవ్వుకుంటారు.

‘అవెమ్మాప్, యియ్యాల మెమ్మల్ని బోజినానికి బిలిస్తివంట. వాగప్ప జెప్పాడులే’ అంటాడు పండగనాడు. పనిమనిషి ఎంకమ్మ గాబరాపడతది. ‘ఎవురూ జెయ్యలేని వంటలు జెత్తావంట...యాపాకు పాయసం, మోదగాకువడలూ...’ నవ్వుతో బుజాలూ తలా వూగిపోతై. ఇంకా నవ్వుతూనే వుంటాడు. ‘లంయి మాత్తరం వూరికే ఒత్తాయ్యా యీ కాలంలో’ అంటూ మొహం ముడుచుకొని వెళ్లిపోతుంది ఎంకమ్మ.

“ఫలానా మనిషి ఎలాంటివాడు ?’ అని అడగ్గానే లింగప్ప ఆలోచన్లో పడతాడు. పెద్ద తలగుడ్డ కిరీటాన్ని పైకెత్తి సర్దుకుంటాడు. కళ్లు పైకెత్తి జ్ఞాపకాల అరల్లోకి తొంగిచూస్తాడు. ‘ఎవురికీ ఏవీ అన్నాయం సెయ్యలేదు. ఎవురినోరూ కొట్టలా!’ అంటాడు తలాడిస్తూ. అదొక్కటే లింగప్పకు తెలిసిన విలువ !

దీర్ఘమైన జీవితంలో ఆతనివలన కొందరికి సహాయం జరిగింది. తల్లి చచ్చి ఆస్పత్రిలో దిక్కులేకుండా వున్నపిల్లను పేదపిల్లల హాస్టల్లో చేర్పించాడు. ఆ పిల్ల ఇప్పుడు హిందీ టీచరుగావుంది. ఒకసారి దోవతప్పి ఏడుస్తున్న పిలగాణ్ణి బస్సుఛార్జీలిచ్చి వాళ్లవూరికి పంపించాడు. దొంగలు పట్టుకుపోతున్న పిల్లని విడిపించి దొంగని చితకదన్నాడు. పెళ్లిళ్లకి బొట్లు చేయించుకోడానికి ఎందరికో సాయంచేశాడు. అయినా లింగప్పని ‘మంచివాడు’ ‘పరోపకారి’ అనడానికి వీల్లేదు !

## 3

గణేశుడి దేవాలయానికి కొంతడబ్బు విరాళంగా యిచ్చాడు గోపాలరావు, ఆ డబ్బుతో పెద్ద పఠాలు తెచ్చారు. గోడలకు అలంకరించడానికి దేవుళ్ల బొమ్మలు, మహా పతివ్రతల చిత్రాలు, నరకంలో పాపులు నానావిధాలయిన హింసలకు గురియవుతూ వుండడం, ఏఏ పాపాలకి ఏఏ శిక్షలో అన్నీ వివరంగా చిత్రించివున్నాయి. సుశీలమ్మకు ఆ పఠాలు నచ్చలేదు. కాని గుడికివెళ్లే జనం కళ్లుమూసుకుని దేవుడిముందు అయిదు నిముషాలు నిలబడితే, ఆ పఠాలముందు కళ్లు తెరుచుకుని పదినిమిషాలు నిలబడతారని ఆమెకు తెలుసు. అక్కడేవో పూజలు చేయించడానికి సాయంత్రం ఆరుగంటలకు వెళ్దామని చెప్పాడు గోపాల్.

బాంకులో అప్పుతీసుకుని తిరిగి ఇవ్వకుండా ఎదురు తిరిగి మాట్లాడుతున్న వాళ్ళిద్దరిమీద కేసులుపెట్టి డిక్రీ తెచ్చుకున్నాడు యీ మధ్యనే. దాని తాలూకు పూజలు ఇవాళ.

ఆరున్నరవుతున్నా గోపాల్ ఇంకా ఇంటికిరాలేదు. సుశీలమ్మకు గుడికి వెళ్లాలనిగానీ వెళ్లకూడదనిగానీ ప్రత్యేకంగా ఏమీ అనిపించలేదు. అందువలన బట్టలు మార్చుకోకుండా లింగప్పతో దేవుళ్ల గురించి మాటాడుతూ కూర్చు న్నది.

లింగప్ప దేవుళ్లని ఏవూరివాళ్లో వూరేగించడానికి తీసుకెళ్తుంటే సుశీలమ్మకు చూపించాడు ఒకసారి. నెత్తి గుర్రాలమీద బంగారు వెండి గొడుగుల కింద రంగురంగులుగా నెమలిపింఛంకంటే అందంగావున్నారు, మంచి ముదురు రంగుల్లో.

"సామికి రంగెయ్యాలంటే ఎపురెయ్యాలని ముందు పెసాదం అడుగుతారు. సామి చెప్పినట్లు జరగాలి. పుట్టపర్తి జినిగిరోళ్లది జీకావన్నె, గొల్లపల్లి సామికి వాళ్లెరంగెయ్యాలి...సామిని పాలకీలోపెట్టి, పేన ఎర్రగుడ్డ—బల్లాలోనే నెత్తారు దాన్ని—కప్పి, నకారు డోల్లులు వాయిత్తా తీసుకెల్తుంటే బేరబ్బసంగా వుంటాడు !..."

"కురవోళ్లకి యర్రగెడ్డన దెబ్బె ఏడుమంది దేవుళ్లు. వాల్లురేతులు పాలికికట్టితో సామిని ఆలాదాగా గుర్రం అలాదాగాసేసి కరిపిత్తారు..." అపరిచితుడు అనంతుడు అయిన స్వామిని మామూలు వడ్డంగివాళ్లు మామూలు పాలికికట్టితో చెయ్యడమా ! పిల్లల బొమ్మల్లాగా !

"తెలీనోల్లు అడుగో కురవోల్ల దేవుడు బేరప్పసామి ఎల్తుండాడు అంటారు. తెలిసినోల్లు పేరు సెప్పుకుంటారు. యావూరిసామికి ఆవూరిపేరే. ఆకునూరప్ప, గుంతకల్లప్ప, అనంతపురంసామి అంతరగంగుంటే ఒచ్చాడు ఒక అంతర గంగప్ప, దెబ్బె ఏడు మందిలోకీ పిన్నోడు ఇటికి నాలయ్య..." చిన్నవూరికి పరిమితులైన చిన్నస్వాములు ! సుశీలమ్మకు లింగప్ప దేవుళ్ళ మీద సదభిప్రాయం కలగలేదు. 'ఈ కాలంలో ప్రపంచం అంతా ఒక్కటే పూజాన్లాలేవు, దేవాలాలేవు ! మనిషి జాతిఅంతా ఒక్కటే. మనిషిలేడు ! అయినా పాపం, పాతకాలపు ముసిలాడికేం తెలుస్తుంది' అనుకుంది.

"ఒక్కో దేవుడికీ అలివిగాని సొమ్ములు. ఒక్కోసామిని నలుగురు మడులు మొయ్యలేరు. అన్ని సొమ్ములు ! మీ సామిని మేం మెరవని సేపిత్తాం, మా వూల్లో పరుసేపిత్తాం అంటే యీనంటానికి యీల్లేదు. యియ్యాల్రంటే. సొమ్ములన్నీ పెట్టి పాలకీలోపెట్టి పంపిత్తారు. దొంగలొచ్చి నడిమెద్దెన అడ్డగిత్తే ? సామినిదించి 'ఎపురిగ్గావాలో ఎత్తకపోన్రి. నిచ్చేపంగా ఎత్తకపోన్రి' అంటారు. ఎప్పుడూ ఎత్తకపోలేదు. ఒకపాలి నలుగురుదొంగలు ముట్టినారు. కలు గనపడక దిక్కులకోడు బరిగెత్తె. అంత సత్తెం సామిది !...

"ఇంకా రెడీకాలేదా ? కేసు వోడిపోయిన కదిరికాపు వాల్లొచ్చిపడ్డారు. ఏభవ బెదిరింపులూ వాళ్లూనూ. పోలీసులకు ఫోన్‌చేసి వాళ్లను బయటికి నెట్టించివేసరికి ఆలస్యమైంది....' అంటూ లోపలికొచ్చాడు గోపాలరావు, లింగప్పను చూచి నొసలు చిట్లించాడు. సుశీలమ్మ లింగప్పతో సమానంగా మాట్లాడుతూ వుండటం ఆయన కిష్టంలేదు.

"బెణకప్ప గుడికెల్తావా అమ్మా' చిన్నగా అడిగాడు లింగప్ప అంతవరకూ గోడకానుకొని ఒంటికాలిమీద ఒంగినిలబడి చేతులాడిస్తూ ధీమాగా మాట్లాడు తున్నవాడు గోపాల్ కనబడగానే నిటారుగా నిలబడి గొంతు తగ్గించుకున్నాడు సుశీలమ్మకి నవ్వొచ్చింది.

గణేశుణ్ణి వాళ్లు బెణకప్ప అంటారు. గణేశుని తలచుకోగానే ఆమెకు ఆనందం కలిగింది. ఆయన్ని రాతితో చేశారు, కంచుతో చేశారు అని ఎవరు అనుకుంటారు ! సకలలోకాలకు ప్రభువు పార్వతీ తనయుడు. కల్యాణ గుణాలయుడు...

చకచకాలేచి పదినిముషాల్లో తయారైంది. భర్త ప్రక్కనే కారులో కూచుని గుడికెళ్తుంటే మనసు ఏవో ఉన్నత శిఖరాలపై నిలిచింది. భార్యాభర్తల సంబంధం—ఆత్మపరమాత్మల సంబంధాన్ని సూచించే మహత్తరమైన బంధం—ఈ అవున్నత్యాన్ని లింగప్ప ఎన్నడూ వూహించలేడు ! చెప్పినా అర్థం చేసుకోలేడు ! 'కురవోల్లు సీరలు మారుత్తారు'

పూజ అయ్యాక చెరువుగట్టుమీద కొంచెంసేపు కూర్చున్నారు. ఎనిమిది దాటింది. గుళ్లో జనం లేరు. పూజార్ల అలికిడి కూడా లేదు. ముష్టివాళ్లూ లేరు. చంద్రుడి వెన్నెల గుడ్డిగావుంది. లేచి కారుదగ్గరకు బయల్దేరారు. చెట్లక్రింది చీకట్లలోంచీ నలుగురు మనుషులు వచ్చి చుట్టుముట్టారు. ఇద్దరు గోపాలరావు నోరు మూసేసి చెట్టుకుకట్టారు. మిగతా యిద్దరు సుశీలమ్మని పట్టుకుని నగలన్నీ ఒలిచేశారు. ఆమెను క్రిందికితోసి చేతులూ కాళ్లూ పట్టేశారు. 'ఏవండీ' అని కేకపెట్టి తన్నుకుంటున్న ఆమె నోట్లో గుడ్డలు కుక్కారు...ఎవరూ ఆమెను రక్షించలేదు...

హాస్పిటల్లో తెలివొచ్చింది జరిగింది సరిగ్గా జ్ఞాపకంలేదు. పట్టరానిబాధ. గుండెల్లో మంట. ఒళ్లంతా మంట. లోపలి మంటలో దేనికోసమో వెతుకులాట.

నేను...నేను ?...సీత...ఎవరు మైలపడిపోయింది ?

మెదడులో అగ్నిపర్వతం బ్రద్దలైంది.

ఛీ, ఈ శరీరం నాది కాదు.

ఇది మురికి, పెంట, కుళ్ళు, అసహ్యం.

దుఃఖం, బాధ, కసి, ద్వేషం...

ఇది నశించిపోవాలి. కుళ్ల నాశనం చెయ్యాలి. మంట ఆరాలి...

అందరూ 'ఏమరి వున్నప్పుడు బయటికి వెళ్లింది. బావిలో దూకింది. ఎవరో పెద్దగా అరిచారు.

తెలివచ్చేసరికి మళ్లీ మంచంమీదే వున్నది.

బరువు. ఆయాసం. వూపిరికోసం, ప్రాణశక్తికోసం గింజుకుంటోంది శరీరం.

మెల్లగా కళ్ళెత్తి చూసింది. గోపాలరావు కనిపించాడు. అతన్ని పరీక్షగా చూసింది. 'నేను చావాల్సిందే' అనుకుంది. బ్రతికి ఏం చెయ్యాలి ?

ఆమె సుశీలాదు. మంచం దగ్గర లింగప్ప కాపలా వున్నాడు. 'ఎం(డిన్‌గాని ఏదైనా మందో విషం తెచ్చిపెట్టు, లింగప్పా' అన్నది. కుసుకురోంచీ మగతగా విన్న లింగప్ప గోడకు జారగిలబడి తలగోక్కుని 'పానం పోగొట్టుకోటం పాపమమ్మ. ఎందరు జనాలు బతకటంలేదు! దేవుడుపెట్టినయ్యన్నీ అనుబగించాలి గదా' అన్నాడు.

దేవుడు ! ఆ పేరెత్తితేనే ఆమెకు కక్షపుట్టింది. ఎవడు దేవుడు? ఎక్కడున్నాడు ? వాడి న్యాయం ఏమిటి ? నిజంగా దేవుడనే వాడుంటే గుడిముందే ఇటువంటి అత్యాచారం జరుగునా ?!

అత్తా, ఆడబిడ్డా వచ్చారు. కన్నీళు కార్చారు. 'ఆ ప్రాణం ఆ ప్రాణం అప్పుడే పోయుంటే బాగుండేది ఏం పాపం చేసుకున్నావో ఖర్మ' అన్నారు.

నాన్నగారూ అన్నాచెల్లెలూ వచ్చారు. తనకోసం బాధపడి ఏడ్చారు. కాని తనని బ్రతికించగలమాట వాళ్ళదగ్గరలేదు.

గోపాల్ యిహ ఎన్నటికీ తనను 'సీరా' అని పిలవడు.

'నా జీవితం నాశనమైపోయింది. నేను నశించిపోయాను" ఆమెకు అలవిగాని దుఃఖం ఆవేశం వచ్చాయి. 'నేను సుశీలను. నన్ను ఏ మలినమూ అంటలేదు. కావాలంటే అగ్ని పరీక్ష పెట్టండి. నాకేమైనా పాపం అంటితేనే మసైపోతాను...నేను సీతను. నిప్పులాంటిదాన్ని. నేనుఅప్పుడూ యిప్పుడూ ఒకటిగానే వున్నాను."

అయినా గోపాల్ తనను గుర్తించడు ! అతను ఎవరో పరాయివాడిలాగా సంబంధంలేని వాడిలాగా అన్పించాడు. ఇన్నాళ్ళ బ్రతికిందంతా వూహేనా ?

ఈ మనిషి, ఇంకో మనిషి, అందరు మనుషులూ తనను వెలివేశారు...

తనను తానే వెలివేసుకుంది.

'లింగప్పా, నాకేమైనా తెచ్చిపెట్టు' అన్నది ఏడుస్తూ.

'ఏలనమ్మా, వూరికే సచ్చానంటావు ! ఈ వూళ్ళో వుండలేకపోతే మావోళ్ళకాడికి కుంటిమద్దికి పంపిత్తా. అయిదరాబాదలనుంటీ ఒచ్చినావని సెప్తా. ఏదో కోడల్ని సుట్టంరాలివని యాదో నేసెప్పుకుంటా. నీకేల అదంతా బతకటానికి సాలేలేదా ?' అన్నాడు.

లింగప్పకేమీ తెలీదు, బతకటం తప్పించి,

బతుకు ! ఇంకా బతుకు ! నూరేళ్ళ బతుకు !

ఇంత ప్రపంచంలోనూ లింగప్ప ఒకడే ఆప్తుడుగా కన్పించాడు.

కాని...బతకటమా ?...ఎట్లా...ఎందుకు ?...

కళ్ళుమూసుకుంది.

ఒంపులులేని బాటలో పచ్చని పైర్ల మధ్యగా ఆకాశం క్రింద నడుస్తూ చల్లనిగాలులు ఒంటిమీద ఆడుకుంటే తాతదగ్గరి కెడుతున్న ఒక ఆనందం—

పాల సపోటాల గంపముందు కూచుని ఆరుచిలో వాసనలో లీనమై వరుసగా తింటున్న ఒకి మాధుర్యం—

దేవుడూ, దేవుడూ, మా అమ్మ నీ దగ్గరి కొచ్చిందా ? నీ వెప్పుడూ నా దగ్గరుంటావా ?' అని కన్పించని దేవుణ్ణి ప్రశ్నిస్తున్న ఒక దుఃఖం —

'ఎందుకు ఇప్పుడీ జ్ఞాపకాలు వెలికివచ్చాయి ? ఇవి నాలోవున్నాయని నాకే తెలియదే!' అనుకుంది.

లింగప్ప లేనప్పుడు మెల్లగా లేచింది. సంధ్య వెలుగులోనికి వెళ్ళిపోయుంది. చెరువు ఎండిపోయి వున్నది.

కట్టమీద నిల్చుని ఆకాశంవైపు చూచింది. పెద్దగోళం—అనంతమైనది. కదలనిది, మారనిది—మాతృ గర్భంలా తనను చుట్టుకొని వున్నట్లనిపించింది. అట్లాగే చూస్తూ నిలుచుంది. ఆ కదలని దాన్లోనే దిగిపోయే సూర్యుడు, ప్రాముఖ్యతలోని కొస్తున్న చంద్రుడు, కళ్ళు తెరుస్తున్న నక్షత్రాలు— వెలుగులో క్షణక్షణం మారుతున్న ప్రపంచం—అంతా తన చుట్టూ—ఈవిశ్వానికి కేంద్రం తానే!

ఆమెకు సంతోషం కల్గింది. మనసు తేటపడింది. గుడిదగ్గర గట్టుమీదనే ఎంతోసేపు నడిచింది. 'నాకు అంటిన తప్పు ఏది ?' అని తన్నుతాను చూచుకున్నది. 'నాకు తప్పు అంటితే నాలో ప్రాణం ఎందుకున్నది ? ప్రాణం భగవంతుడు కదా ?' అనుకుంది.

భగవంతుడికి తప్పు ఒప్పూలేవు. పాపం పుణ్యంలేవు. ఆయనే అఖండమైన ప్రేమ. అనంతమైన కరుణ.

ఆమె మెదడులో గొప్ప కంపం కలిగింది.

ఆనందమో ప్రేమో ఉన్మాదమో—ఏదో తెలియరానిది వెల్లువలా పొంగింది.

అప్పుడే చంద్రుడు చచ్చిపోయాడు.

ఆమెకు చీకట్లో ఎదుర్రాయి తగిలింది. బోర్లాపడి క్రిందికి దొర్లిపోయింది. రాళ్ళు తగిలినచోట చర్మం చీరుకుపోయింది. కాని ఆమెకు నొప్పి కాని భయంకాని అనిపించలేదు.

ఆమె చచ్చిపోయింది.

---

# ప్రాజ్ఞేంద్ర

## శ్రీ కే ఎస్వీ

పడుకుంటే

తెల్లారిపోతుంది
పడుకోకున్నా కన్నుమూయకున్నా
ఇలాగే తలపుల్ని అతుకుతూన్నా
రాత్రి గుండెల్లోకి చూస్తూ చూస్తూ
రహస్యాలెన్నిటినో కలబోస్తూ వడబోస్తూ
క్షణంక్షణం జ్ఞాపకాల అంపశయ్యమీద దొర్లుతున్నా
— ఎప్పుడో తెల్లారిపోతుంది
చప్పుడులేకుండా
పిట లు కువకువలాడకుండా
తూర్పు తెల్లగా వొళ్లువిరుచుకోకుండా
చుక్కలు వెలవెలబోకుండా కనుమరుక్కాకుండా
మట్టివాసన మారకుండా
ఎప్పుడో ఒకప్పుడు
ఇటె తెల్లారిపోతుంది
కాని, మళ్లీ రేపు
మసకబారిన నా చూపు
పగుళ్లు వేయక మానదు
ఒంటరిగా శూన్యాన్ని పోషించే అంతరంగం
విరిగిపడే అలలా
చెదరిపడే కలలా
భంగపడక తప్పదు
తప్పని సరయ్యే నరకంలో
చప్పన కూలబడక తప్పదు
అర్థంకాని వేదనలాంటి బ్రతుకులో
హాలాహలాన్ని భరించక తప్పదు
మనోమరుభూమిలో ఆరు బుతువులూ శిశిరాలే !
మకరందానికై తెరుచుకున్న మనస్సులో మషిపంకమేరాలే ! !

---

# పొన్నూరు భావనారాయణస్వామి దేవాలయం

## చరిత్ర

పొన్నూరులోని భావన్నారాయణస్వామి దేవాలయం గురించి మనకు చారిత్రకంగా శాసనాలవల్ల 11వ శతాబ్దంలో కులోత్తుంగ చోళుడు ఈ ఆలయానికి ప్రహరీగోడలు కట్టించి ప్రస్తుతపు పేరు ఒసంగాడని తెలుస్తున్నది. కృష్ణాజిల్లా మాన్యుయల్‌లో మెకంజీ ఈ విధంగా వ్రాశాడు. "క్రీ. శ. 1109 లో కులోత్తుంగ చోళుని దానము విష్ణువునకు అనగా భావనారాయణస్వామికి అంకితము చేయబడింది. ఈ ప్రదేశమునకు సంస్కృత పర్యాయపదము 'స్వర్ణ'. దీనికి తమిళములో సరియగు పదము 'పొన్నూరు' అయినందువల్ల చోళరాజులచే పొన్నూరు అని పిలువబడి యుండవచ్చును"

దరిమిలా రక్తాక్షి సంవత్సరమున (1804) రాచూరు జమీందారు శ్రీ మాణిక్యారావునుండి కుల దైవికములవలన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు సర్వాధికారముగా 'మాతలి' వ్రాయించుకొన్నారు. ఇప్పటి వరకు వాసిరెడ్డి వంశీయులు దేవాలయాన్ని చాలా అభివృద్ధిలోకి తీసు కొనివచ్చింది— దేవాలయ ఆధ్వర్యంలో సంస్కృత పాఠశాల కళాశాల నడుపుటకు కారణభూతులైనారు.



పొన్నూరులోని శ్రీ భావనారాయణస్వామి దేవాలయపు గాలిగోపురం. దాని ముందు గల శిలాశాసనంకూడా చూడవచ్చు.

## గాథ

పొన్నూరు సమీపంలోని నండూరు గ్రామస్థుడు కేశవయ్య మేనల్లుడు గోవిందుని వెంటబెట్టుకొని కాశీలోని శ్రీ భావనారాయణుని దేవాలయంలో సంతాన ప్రాప్తికి భగవంతుని ప్రార్థించాడు. కూతురు కలిగితే తనకిచ్చేట్లయితే కేశవయ్యకు మారుగా తాను ప్రార్థిస్తానని గోవిందు చెప్పిందానికి అతను ఒడంబడి ఇంటికి తిరిగివచ్చాడు. తర్వాత తనకు గలిగిన అక్కలక్ష్మిని గూని వున్నదని గోవిందుకు ఇవ్వటానికి కేశవయ్య నిరాకరించగా గోవిందు ప్రార్థనపై స్వామి కాశీనుంచి సాక్ష్య మివ్వటానికి అతనివెంట బయలుదేరి వచ్చాడు. పొన్నూరువద్దకు వచ్చిన తర్వాతస్వామి తనవెంబడి వస్తున్నదీ లేనిదీ అనుమానం వచ్చి వెనుతిరిగిచూడగా గోపి వద్ద మసలదే ప్రస్తుత పొన్నూరులో శ్రీ భావనారాయణస్వామి అంతర్ధానమయాడు. కేశవయ్య ఆకాశవాణి తెలియచేసిన మీదట తర్వాత తన కూతురును గోవిందుకు ఇచ్చి పెళ్లి చేశాడు.

సాక్ష్యం ఇవ్వటానికి వచ్చినందున ఆయనకు ఇప్పటికీ సాక్షి భావనారాయణస్వామి అని పిలుస్తారు. ఆయనతోపాటు వచ్చాయనీ కాశీ విశ్వనాథుడు, పేరులేని పెద్దమాను అనే రెండు చెట్లు, తుంగభద్ర అనే ఒక ఏరు ఇక్కడ చూపిస్తారు.

పదవ శతాబ్దంలో 'అప్పను' సీమాధిపతి శ్రీ నంద్యాల నారపరాజా అనే ఆయన తన రాచపుండు నివారణకు తీర్థయాత్రలు చేస్తూ ఇక్కడికి వచ్చినప్పుడు, భావనారాయణస్వామి కలలో కనిపించి పుట్టలోవున్న తనను వెలికితీసి పూజకు ఏర్పాటు చేయవలసిందిగా ఆదేశించినట్లు అందుచేత శ్రీ నారపరాజు గర్భాలయాన్ని నిర్మింపచేసాడని ఆయన రాచపుండు నయమయిందనీ చెపుతారు.

## ప్రస్తుతం

ప్రస్తుతం దేవాలయం క్రింద 320 ఎకరాల మాగాణి, 56 ఎకరాల మెట్ట ఉన్నాయి. సంవత్సరానికి లక్షన్నర రూపాయల ఆదాయం వస్తుంది.

# పద కవిత

## (తాళ్ళపాక కవుల దృష్టి)

శ్రీ కె. శ్రీనివాసులు శెట్టి

'పదం'1 అనేది ఒక మనోహరమైన సంగీతాత్మక ప్రక్రియ. దీనికి రాగం, తాళం రెండు మూల ద్రవ్యాలు. సాహిత్యానికి కూడ ఇందు ప్రాధాన్యం ఉంటుంది. ఇటువంటి రచనకు పదం అనే పేరు పాల్కురికి సోమనాథుని కాలానికే స్థిరమైనట్లు తెలుస్తున్నది. 2 లాక్షణికులు 'పద్యమ్ చతుష్పదమ్' అన్నారు; అంటే నాలుగు పాదాలున్న పద్యంలో నాల్గవ భాగానికి పదం అనో, పాదం అనో పేరు సిద్ధిస్తుంది. ద్విపదలో అయితే అది రెండవ భాగం, షట్పదిలో ఆరవ భాగం అవుతుంది. ఎనిమిది పాదాలున్న జయదేవుని అష్టపదులిట్టివే. తెలుగు కన్నడ భాషలలో పదానికి భాగం అనే అర్థం పోయి ఇప్పుడు పాట అనే అర్థమే రూఢమైంది.

పదం అనే సంకేతం తెలిసినప్పటికీ తాళ్లపాక కవులు తమ రచనలను సంకీర్తనలనే వ్యవహరించినారు. అన్నమయ్య సంస్కృతంలో 'సంకీర్తనలక్షణము'3 నే గ్రంథాన్ని రచించినాడు. దీనిని తెలుగు చేసిన తిరుమలయ్య "మహనీయంబగు సంకీర్తన నామక పద సంప్రదాయం బెట్టిదనిన" 4 అని పదానికి పర్యాయపదంగా సంకీర్తన శబ్దాన్ని వాడినాడు. అంతేకాక భరతముని నాటి నుండి పదానికి లక్షణాలు చెప్పబడినట్లు స్పష్టం చేసినాడు. తాళ్లపాక కవులకు పూర్వం కృష్ణమాచార్యుని సింహగిరి వచనాలున్నాయి. ఆతడు తన వచనాలను- సంకీర్తనలనే పేర్కొన్నాడు. 5 వేంకటాచల విహార శతకంలో కూడా 'కృష్ణమాచార్య సంకీర్తన'లనే ఉన్నది 6 కాని చిన తిరుమలయ్య వీనిని పదాలని వ్యవహరించినాడు. 7 అన్నమయ్యకు 'సంకీర్తనాచార్యుడ'నే కాక, 'పద కవితా పితామహుడ'నే బిరుదు కూడ ఉంది. దీనిని బట్టి తేలిన సారాంశం — పదం— సంకీర్తన అనేవి ఒకదానికొకటి పర్యాయపదాలని. కాలక్రమంలో ఇది శృంగారరసమయం. రాగతాళబద్ధం అయిన ఒక ప్రత్యేక పద్ధతికి చెందిన రచనకు సంకేతనామంగా సంగీత రసికుల సంప్రదాయంలో నిలిచిపోయింది. క్షేత్రయ్య కాలానికే ఈ వాడుక వచ్చినట్లుంది. 8 రంగాజమ్మ 'మిగుల శృంగారంబు గప్పట్లు పదములు మృదురసాస్పదములగుచు రాణింప' రచించెనట. కీర్తన శృంగారాత్మకమైన పదమైనదని సుబ్బరామదీక్షితులుగారి అభిప్రాయం. 9 అంటే శృంగార రస స్పర్శ లేనిది పద శబ్ద వాచ్యం కాదనే రూఢి ఏర్పడింది.

తెలుగు సాహిత్యంలో 'తుమ్మెద పదాలు' ఆదిగాగల పద రచనలు, తాళ్లపాకవారి సంకీర్తనలు లేక పదాలు, క్షేత్రయ్య పదాలు, పలనాటివీర గాథ వంటి సుదీర్ఘమయ గేయ రచనలు— తందాన పదాలు కానవస్తున్నాయి. వీటిలో పద శబ్దానికి గల అర్థ పరిణామం తెలుగులోని పద కవిత్వ వికాసాన్ని తెలియజేస్తుంది. "తుమ్మెద పదాలు" అంటే పాట అనే సామాన్యార్థమే. తాళ్లపాకవారి పదాలు లేక సంకీర్తనల్లో అది పల్లవి—చరణాలు అనే ప్రత్యేక లక్షణాలతో విలసిల్లి శృంగారపరంగానో, అధ్యాత్మపరంగానో, రచియింపబడిన సంగీతాత్మక రచన అనే అర్థం వస్తుంది. క్షేత్రయ్య పదాలలో ఇది ఒక్క శృంగారానికే పరిమితం. పలనాటి వీరగాథ మొదలైనవాటిలో వీరరస స్ఫోరకమైన గేయాంశం ఉన్న సాహిత్య రచనగా విదితమవుతుంది.

ఏ వాఙ్మయంలోనైనా పద్య కవిత్వం కన్నా పద కవిత్వమే ముందు పుట్టి పెరుగుతుందని విజ్ఞుల అభిప్రాయం. 'పదకవితకు నాదం, కాలం రెండు పాద పీఠాలు! దీని రాణింపుకు తోడ్పడేవి కవిత్వం భాషా సాహచర్యం. లేకుండా కేవలం నాదకాల లయితే ప్రధానంగా ఉండేవి సంగీతం. పద కవిత్వంలో నాద కాలాలతోబాటు భాషా రచనకు కూడా ప్రాధాన్యం ఉంటుంది. రాగ తాళలయలు పద కవిత్వానికి అలంకారాలు మాత్రమే. పద్య కవిత్వంలో గతి ఛందో రూపంగా అప్రత్యక్షంగా ఉంటుంది. పద్య కవితను చూచిన చూపుతో పద కవితను చూడరాదంటూ శ్రీమాన్ అనంతకృష్ణశర్మగారు ఇట్లా వివరించినారు—

"స్వతంత్రమైన ధారాళత గల పద్యరచనలో లక్ష్య [illegible] కని చూపగలిగినంత అఖండత, వైశాల్యం, సూక్ష్మత, వైవిధ్యం మొదలైన గుణాలు పద రచనలో చూపలేము. మరి రాగతాళాలు, స్వరాలు వ్యవహరించినట్లు, అర్థభావ భావనలను పట్టి చూపగలిగిన పద రచనలో ఉన్నంత వర్చస్సు, శక్తి, ఆకర్షణ పద్య రచనలో రాదు".10

తాళ్లపాక వారి సంకీర్తనలు . . . కవిత్వము, రాగతాళాలు పరస్పర సౌహార్దంతో కలిసి తయారైన నిండు రచనలు. పల్లవి లేక ధ్రువ పదము, అనుపల్లవి, మూడు చరణములు— ఇవి కలిసిన స్వరూపమే సంకీర్తన లేక పదం". దీని స్వరూపం 'సంకీర్తన లక్షణం'లో ఇట్లా నిరూపింపబడింది.

"పదముల యర్థము బల్లవి, వదలక యున్నట్టి నేక వాక్యాల జేయున్ గుదిగుచ్చినట్లు తగులై, 1 పదము తుదిన్ [illegible] బల్లవి యుండున్" 11

లక్ష్యంగా క్రింది పదాన్ని చూడవచ్చు.

ఏం రాదమ్మ యింతిరో వా
నేల రాదమ్మ నన్నేలిన వాడు ॥పల్లవి॥
వచ్చని పులుగుల బండి నీ... 
వచ్చువింటి పిన్నబాలుని తండ్రి

పచ్చని చాయలం బాయని బంగారు
పచ్చడము బాగైన వాఁడు :ఏలః

తెల్లని పులుగుపై తిరుగ మరిగినట్టి
తెల్లని సతి పాలి దేవర తండ్రి
తెల్లని పఋుపుపై లేలి పొరలు వెట్టు
తెల్లని కన్నులం దెలివైన వాఁడు :ఏలః

కొండవింటి వాని గుత్తకొనిన యట్టి
కొండుక ప్రాయపుం గూఁతురు తండ్రి
కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
కొండ తలవెత్తి గురుతైన వాఁడు :ఏలః

(శృం. సం. 3—303)

పాటలో చరణాలెన్ని ఉన్నా పల్లవిలోని భావాన్నే పోషించి, పల్లవితోనే ముగుస్తాయి. 'పద రచనలో భిన్న సందర్భాలకు చెందిన అర్థ భావాలు కాని, భిన్న రాగతాళలయలు కాని ఉండవు ! దీనికి విరుద్ధంగా భిన్న రాగ తాళాలు గల 'సూళాదులు'★ అనే పదాలు ఎన్నో 15, 16 శతాబ్దాలలో కన్నడ భాషలో పుట్టినవని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపినారు.[12] విభిన్న రాగతాళములలో నడిపిన సూడాది గీతములు తాళ్లపాకవారి సంకీర్తనలలో కూడ గలవని ముట్నూరి సంగమేశంగారు తెలిపినారు.[13]

పద కవిత ముక్తక రచన వంటిది. దేనికది స్వతంత్రం— సమగ్రం. క్రీ. శ. 14వ శతాబ్దం నాటికే పదానికి ఈ స్వరూపం ఏర్పడినట్లు తెలుస్తున్నది. క్రీ. శ. 15, 16 శతాబ్దాలలో ఆంధ్ర కర్ణాట వాఙ్మయాలలో ఇటువంటి పద రచన విరివిగా సాగింది. తెలుగులో తాళ్లపాకవారు, కన్నడంలో దాస కూటానికి చెందిన శ్రీపాద రాయలు మొదలైనవారు ఇటువంటి పదాలు రచించినారు. కన్నడంలో వీనిని 'దాసర పదగళు' అంటారు.

తాళ్లపాక కవులు తమ రచనలను వర్ణ్య విషయాన్ని బట్టి రెండు తరగతులుగా విభజించినారు. 1. శృంగార సంకీర్తనలు 2. వైరాగ్య సంకీర్తనలు. 'పదములు శృంగార వధూమృదు మధుర మనోజ్ఞ వాక్యమిశ్రమములైనప్పటికి, 'విదితార్థగ్రామ్యోక్తులు పదిలముగాఁ బొంకమెట్రిగి' పలికితే చాలన్నారు. 'పల్లవనారీవ్యేళ్చాద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు' గ్రామ్యాలైనా చెల్లుబడి అవుతాయన్నారు. 'జగతిం గల చెల్లుబళ్లు నగినగి భాషించునట్టి నాఁడి పలుకుల్ తగదన రహిచెడుఁ బువ్వుల సొగసుడుగం బికిసి కంపుచూచిన భంగిన్', అని నానుళ్లను, పలుకుబళ్లను స్వేచ్ఛగా వాడినారు. వైరాగ్య పదాలు మాత్రం 'అగ్రామ్య రమ్యములై విష్ణు చరితోదారములై' ఉండవలెనన్నారు.[14] వీనికి అధ్యాత్మ సంకీర్తనలనే వ్యవహారం కూడ ఉంది. పదం సంస్కృత ప్రాకృతాలలో గాని, దేశ భాషల్లో గాని రచింపబడవచ్చు.[15] అది సంప్రదాయబద్ధమై, అలంకారం, చమత్కారం, భావం, రసం, శయ్య మొదలైన కావ్య సామాన్య గుణాలతోనే కాక, దైవిక మానుష రచనా పావనములుగా ఉండవలెనన్నారు. 'బూఋగు కాయం గొరికిన నీరస తూలంబు దిశల నిండు గతి నిస్సార పదబంధ కవితా పారీణుల పదము హాస్యాస్పదమై ఉండు నెల.[16]

లక్షణ భేదాన్ని బట్టి ఈ పదాలను 1. వృత్త పదం 2. నిబంధ పదం 3. చూర్ణ పదం— అని మూడు తెరగులుగా విభజించినారు. వృత్త పదాలు షడ్వింశచ్ఛందో భేదాలకు చెందినవి. యతులు, ప్రాసలు, పదాలు, మాత్రలు తాళ సంగతులు కలిగినవే నిబంధ పదాలు. తాళ్లపాకవారి సంకీర్తనల్లో ఇవే కనిపిస్తున్నాయి. గేయగంధులైన కృష్ణమాచార్యుని సింహగిరి వచనాలు. రాగతాళబంధములైన పెదతిరుమలయ్య వైరాగ్య వచన మాలికలు చూర్ణ పద శాఖకు చెందినవి. ఇవిగాక దరువులు, ఏలలు, గొబ్బిళ్ళు, చందమామ పదాలు, మున్నగు సంకీర్తన భేదాలకు కూడ లక్షణాలు వివరించినారు. ఈ లక్షణాలకు లక్ష్యాలు కూడ చాలవరకు తాళ్లపాకవారి సారస్వతంలో కనిపిస్తాయి.[17] ఇవే తర్వాత పద కర్తలకు శిరోధార్యాలైనాయి.

తెలుగు సాహిత్యంలో ఆది కాలంలో 'తుమ్మెద పదాలు' మొదలైన పద రచనలున్నాయి. కన్నడిగుల ప్రభావంతో తర్వాతి కాలంలో పాడుకొనడానికి అనువైన వచనాలు రచింపబడినాయి. తాళ్లపాక వారి కాలంలో తాళ లయాత్మకమైన వచనాలతోబాటు నిర్దిష్ట లక్షణాలతో సంకీర్తనలనే పద రచనలేర్పడినాయి. క్షేత్రయ్య కాలంలో శృంగారాత్మకం, అభినయ యోగ్యం అయిన పదాలకు ఆకారమేర్పడింది. ఇలని కాలంలో పదానికి సంకీర్తనమనే పర్యాయనామం తొలగిపోయింది. త్యాగరాజు కాలంలో సంగీత ప్రాధాన్యంతో సాహిత్యాన్ని వామమాత్రంగా చేసుకొన్న కృతులేర్పడినాయి.

పద కవిత నిసర్గమధురమూ, నిరాడంబరమూ అయినది. జనసామాన్యంలో చోటు చేసుకొని, సజీవమై నిలిచింది. భారతదేశంలో పదకవితకు ఇతర భాషలలో గౌరవప్రచారాలున్నాయి. వంగభాషలో పదకర్తల రచనలు ప్రముఖాలు. హిందీలో సూరదాసు. మీరా, కబీరు పదాలకు విశేష ఆదరం ఉంది. తెలుగు భాషలో తప్ప ఇతర భారతీయ భాషల్లో పద కవితను నిందించినవారు కూడా అరుదే.

ముది విటులు విధవ లంజలు
పదకవితలు మారు బాస బాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిర వీరవరులు కడిది పురమునన్[18]

'ఇట్లు నగుబాట్లపాలైన పదకవితకు తాళ్లపాకవారు ఉన్నత స్థాయి నిచ్చి నెలకొల్పినారు.[19] సుప్రసిద్ధమైన దేశి రాగాలలో, సుగ్రాహ్యమైన లయ తాళాలలో నిబంధించి పదాలను సులభీకరించినారు. వానిని 'పరకవిత్వ వాణి వీణా నినాదములు'గా, 'సర్వమంత్ర పరమ రహస్యోద్భావనములు'గా, గాయక నికరానములు'గా తాళ్లపాక కవులు తీర్చినారు. అవి—

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమ వీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్లపాక యన్నయవచో మూర్తుల్ ప్రమోదించుతన్"[20]

## అధో జ్ఞాపికలు :-

1. 'పదగతౌ పద్యతే అనేన ఇతి పదమ్' అనే వ్యుత్పత్తితో ఏర్పడింది. దీనికి 'పొందబడింది' అని అర్థం. 'పదమ్ వ్యవసిత త్రాణస్థాన లక్ష్మాంఘ్రి వస్తుషు' అని అమరకోశంలో ఈ పదానికి ఉద్యోగం— రక్షణం—స్థానం చిహ్నం అనే అర్థాలున్నాయి.

2. "పదములుం దుమ్మెద పదముల్ ప్రభాత, పదములుం బర్వత పదములా నంద పదములు శంకర పదముల్ నివాళి, పదములు వాలేశు పదములు గొబ్బి పదములు వెన్నెల పదములు సంజ, వర్ణన మరి గణ వర్ణన పదము"
(పండితారాధ చరి. వాద ప్రకరణ. పు. 513)

3. చూ. సంకీర్తన లక్షణము. ప. 15, 17—పు. 139–40. T.T.D. Tallapakam Telugu works Vol. II Minor Works-1935.

4. చూ. సం. ల. పు. 140

5. '... ఈ సంకీర్తన ఫలం బెవరు వ్రాసిరి ...' (సిం. వ. పు. 1—1) '... ఇది కృష్ణమాచార్యులు చెప్పిన సంకీర్తన ఫలంబు' (సిం వ. పు. 2—2)— ఆంధ్ర రచయితల సంఘము— హైదరాబాదు. 1968.

6. '... కృష్ణమాచార్య సంకీర్తనంబులం జొక్కి' సింహాద్రి యప్పయ చేతం గాదు' వేంకటాచల విహార శతకము (పు. 23. ప. 52)— శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు— T. T. D. Publications 1967.

7. 'ధర కృష్ణాచార్యాదిక పరికల్పిత పదములు తాళబంధచ్ఛందో విరహితమై' (చూ. సం. ల. ప. 54. పు. 147)

8. 'పదము పాడగా వినేవో చదరంగమే చూచేవో'

9. 'తెలుగు సాహిత్యంలో దేశి కవిత' . . ఆర్వియన్ సుందరం. పు. 66.

10. 'అన్నమాచార్యుని కవిత'— రా. అ. కృ. శర్మ (వాణి. 22—7—55)

11. సంకీర్తనలక్షణము— (ప. 39)

12. 'అన్నమాచార్యుని కవిత' (వాణి 22—7—55)

13. 'అన్నమాచార్యులు— గేయ సాహిత్యము'— డా. ముట్నూరి ,సంగమేశం
★ సూళాదులు— సూడ: సూళాది అన్నది ప్రసిద్ధ అలంకార సప్తతాళం బులును, రగణమఠ్యంబును, ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగ ధాతువులతో ఏక కలగా (యథాక్షరముగా) విళంబ, మధ్యమలయలు గలదియై వర్ణక్రమంబులతో సాహిత్య రూపమై యుండును. ఈ సూళాదులు శ్రీ పురందరదాసులువారు గాక తక్కినవారెవరును జూచినట్లు కనుబడలేదు— సుబ్బరామదీక్షితులు—' సంగీత సంప్రదాయ ప్రదర్శిని'. పు. 57

14. సంకీర్తన లక్షణము. ప. 58, 59, 60

15. సంకీర్తన లక్షణము. ప. 27

16. సంకీర్తన లక్షణము. ప. 69. 70

17. ..."తాళ్లపాకవారు సంకీర్తన లక్షణమును శ్రీకరించుటయే కాదు వానికిం దగిన లక్ష్యములను గూడ రచించి 'సంకీర్తనా పరిశుద్ధి' కేతయో పాటుపడిరని నిస్సందేహముగా చెప్పవచ్చును"— తాళ్లపాక కవుల కృతులు— వివిధ సాహితీ ప్రక్రియలు (పు. 458) డా. వేటూరి ఆనందమూర్తి, 1974.

18. చూ. చాటు పద్యమణి మంజరి— వేటూరి ప్రభాకరశాస్త్రి

19. 'తాళ్లపాకవారి సారస్వత సేవ'— రా. అ. కృ. శ. (వాణి 22—9—1956)

20. 'సంకీర్తన లక్షణము'— ప. 12.



# రసో వై సః....

"రాధా"

"రసో వై సః" "రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి" ఇది వైదిక వాక్యము. పరమాత్మాను సంధానముచే సమాధియందు యోగిచిత్తవృత్తియను భవించెడిది ఆత్మానుభూతి. అదే పరమానుభూతి. అదే మోక్ష సాధనము, అందు బాహ్యేంద్రియ ప్రత్యక్షానుభూతియుండదు. ఉన్నచో నదియాత్మానుభూతికాదు. బాహ్యేంద్రియ ప్రత్యక్షముల నన్నింటిని మనోన్తర్లీనముచేసి తద్ద్వారా కేవలము మానసిక ప్రత్యక్షముగ తచ్చైతన్యమును ననుభవించుటయే పరమాత్మానుభూతి.

అది లౌకికానుభూతులకన్నా భిన్నమైనది. అది లౌకికేంద్రియార్థసన్నికర్ష జన్యజ్ఞానరూపమైన ప్రత్యక్షముకన్న భిన్నమైనది. కనక నీయది పరమాత్మ సాధన భూతమైనది. లౌకికానుభూతులన్నియు లౌకికసాధన హేతువులు కాగా అలౌకికమై యోగి చిత్తవృత్త్యనుభూయమానమగు నదియే యానందము. ఆ అలౌకికానందమే రసమని పై వాక్యమాధారముగ నాలంకారికులు ఘంటా పథముగ చెప్పిరి. అటువంటి యానందమునే కావ్యాస్వాదనద్వారా పొందవచ్చును. కనుకనే కావ్యానందమలౌకికమైనది. లౌకికమైన యానందము వేరొండు గలదు. పుత్రస్తే జాత: (నీకు కొడుకు గల్గెను), ధనం తేదాస్యామి (నీకు ధనమునిచ్చెదను) మొదలుగాగల వాక్యముల ద్వారా యానందము గల్గును. కానీ యది తాత్కాలికము. అది పాశవికము. అందులో నాత్మానుభూతిలేదు. ఇంద్రియాన్తర్లీనతలేదు. అందుకేయిదిలౌకికము. కాని భావుకతానుసంధానముచే రమణీయార్థములను చూచి యాయర్థములను మననము చేయుట ద్వారా మానసిక చైతన్యమును పొందవచ్చును. బాహ్యేంద్రియ ప్రత్యక్షము లన్నింటిని యంతర్లీనముగావించి యా యానందమును ననుభవింపవచ్చును. రమణీయ చిత్రమును చూచి యా చాక్షుషాభిజ్ఞానమును నంతర్లీనము గావించుకొనిన యా చిత్రమునకును మనకును మధ్య యే వ్యక్తియైనను మనకు కన్పింపడు. ఆ వ్యక్తిని మనము గుర్తింపలేము. అందు చాక్షుష ప్రత్యయమును మానసికాంతర్లీనము గావించుటయే కారణము. అట్లే కావ్యాస్వాదనమున గూడ కావ్య శబ్దములను గొని మానసికాన్తర్లీనము గావించెడి సమయమున బాహ్యశబ్ద శ్రవణము జరగదు. అప్పుడు శ్రవణేంద్రియ జన్య ప్రత్యక్షము మానసికాన్తర్లీనత నందినదని యర్థము. కావున నట్టిస్థితిలో నలౌకికమైన కావ్యానందము ననుభవింపవచ్చును. అది లౌకికానందముకంటె భిన్నమయినదని ముందు చెప్పబడినది కదా.

లోకము ద్వంద్వ ప్రవృత్తిగతము. అందు సుఖదు:ఖములు మంచిచెడులు కలయికలిసియే యుండును. ప్రతివ్యక్తియు లౌకికజీవనకారణముచే సుఖ:దు:ఖాది ద్వంద్వ మిశ్రితత్వమునే పొందియుండును. ఆ తత్త్వము విచిత్రమైనది. ఒకే సమయమున సుఖహేతు నిర్దిష్టమైనచో సుఖమునుపొందును. దు:ఖహేతు నిర్దిష్టమైనచో దు:ఖమును పొందును. సుఖదు:ఖోభయ నిర్దిష్టమైనచో తదుభయ స్థితిపొందును చైత్ర, పుత్రస్తే జాత :, కన్యా తే గర్భిణీజాత: (ఓయీ నీకు కొడుకుపుట్టెను ఓయీ నీ కుమార్తె (పెండ్లికాని) గర్భిణియైనది). మొదలుగాగల వాక్యమువలన సుఖ దు:ఖానుభూతి కలుగకపోదు. దానినే సుఖదు:ఖోభయ మిశ్రితమైన యుత్కంఠ యంటారు. శకుంతలను నత్తవారింటికి పంపినపుడు కణ్వుడు పొందినది యట్టి యుత్కంఠయే. అది లౌకికము. కానిఆ లౌకికమైన యుత్కంఠను భావించుట ద్వారా సామాజికుని హృదయ ఫలకమున ముద్రితమగునదియ లౌకికానందము.

పైం జెప్పబడిన సుఖదు:ఖములు శారీరిక మానసిక భేదములు రెండు విధములు. శరీరముచేతననుభవింపబడెడిది శారీరకము. మనస్సుతోననుభవింపబడెడిది మానసికము. సుఖమునకు గూడ హేతువులు కొన్ని కలవు. ఇష్టసిద్ధి, బావన, మానసికచైతన్యము. నవి— ఆ మానసిక చైతన్యజన్యమైన సుఖమునకు యానందమని పేరు. దానిని సుఖమనరాదు. అట్లన్నచో నది లౌకికమేమగును. దానిని యానందమనే వ్యవహరింతము. జీవిత పరమార్థ తత్త్వమున దానిపేరు మోక్షము. కావ్య పరిభాషలో నదే యానందము. అదే రసము. పరమాత్మాను భూతిలో పరిస్థితులను కూలించిన ఆనందము కల్గినట్లు కావ్యమున సముచిత సామగ్రి సముల్లాసము రసానుభూతిని గల్గించును. అయితే ఇది యందరకునేల కలుగదనరాదు. సమాజములోని యెందరు ఆత్మతత్త్వమును అవగతము చేసికొని సమాధి నిశ్చలులు కాగలుగుచున్నారు. బాహ్యేంద్రియ తత్త్వవిహీనులు మాత్రమే అట్లు కాగలరు. అట్లే కావ్య జగత్తున కూడ బాహ్యేంద్రియ తత్త్వములను విడిచి మానసికానందమును పొందినచో నది యానంద హేతువగును. అదే రసమగును.

ఈ యానందము నీ యనుభవాలు లోకముకంటే భిన్నమయినవి విచిత్రమైనవి. విచిత్రానుభూతి నొసంగగల్గినవి. దీనికి యే తార్కికులును యే వైయాకరణులును, మరెవ్వరును లక్షణములు నిర్ణయించలేరు. దీనికి వానితో వేగిలో పనిలేదు. అవన్నియు దీనికి సంగములు మాత్రమే. భరతుని నాట్య శాస్త్రమునకు వ్యాఖ్య వ్రాసిన యభినవ గుప్తుని వాక్యములను కొన్నింటిని పరిశీలింతము.

తథాహి. సచ అతృప్తి వ్యతిరేకేణ అవచ్ఛిన్న భోగావేశ : ఇత్యుచ్యతే. భుంజానస్య అద్భుతభోగ స్పందా విష్టస్య చ మన: కరణం చమత్కార ఇతి, స ఏవ సాక్షాత్కార స్వభావ: మనస : అధ్యవసాయో వా సంకల్పోవా స్మృతిర్వా. తథాత్వేన స్ఫురన్నస్తు. యదాహ.

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోపి జన్తు :
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.

అత్ర హి. స్మరసీతి యాస్మృతి: ఉపదర్శితా నతార్కిక ప్రసిద్ధా పూర్వం నిరస్యార్థస్య అనుభవాత్. అపితు ప్రతిభానా పరపర్యాయ సాక్షాత్కార స్వభావోయ మితి, సర్వథా తావదేష అపి ప్రతీతి:. ఆస్వాదాత్మా యస్యాం రతి రేవ జాయతే. తత ఏవ విశేషాన్తరుపు సహితస్యాస్ సాంరసనీయ నాసతి న లౌకికీ, నమిథ్యా. న అనిర్వాచా నవాలౌకికతుల్యా, నతదారోపాది రూపా."

దుష్యన్తుడు దూర్వాస శాపవశమున శకున్తలను మరచినాడు. లేదు. దూర్వాసుడే మరపింపజేసినాడు. నగరానికొచ్చిన దుష్యంతుడు హంస పదికా గానమును విన్నాడు. అపాటే యున్నది.

అభినవ మధులోలు పస్త్వం, తథా పరిచుంబ్య చూత మంజరీం

కమల వసతి మాత్ర నిర్వృత్త: మధుకర విస్మృతోసియే నా కథం"

ఆ మాటలు దుష్యన్తునిలో నేదో చైతన్యాన్ని కల్గించాయి. వెంటనే స్మరింపాడు" రమ్యాణీక్ష్య..."అని అనుకొన్నాడు. ఎవరిని స్మరించాడు? శకుంతలనా ? అయితే దుర్వాస శాప మేమయినట్లు ? ఆమెను విస్మరింపవలెనే, మరి దేనిని స్మరించెను. అందుకే భావస్థిరాణి జననాన్తర సౌహృదాని అన్నాడు. ఇక్కడ జననాన్తర విషయకము. ఇందు జనన శబ్దమును జన్మపరముకాగా గాక భా వ నా ప ర ము గా స్వీకరింపవలెను. ఆ భావనాన్తర జన్య మైన వాస్తవికమైన సంస్కారమునే దుష్యంతుడు స్మరించినాడు. కాగా దుష్యంతుడిలో నాస్మరణముండి యుండవలెను. కాని దానిని నిర్ధారించలేము. ప్రక్కనే అబోధ పూర్వమన్నాడు. అది సామాన్యముగా కూడకాదు. నూనమ్ అని నిశ్చయముగా చెప్పుచున్నాడు. అబోధ పూర్వముమయితే స్మరించుటెట్లు. "సంస్కార జన్య జ్ఞానం స్మృతి:" అని కదా తార్కికసమ్మతమైన స్మృతి లక్షణము. ఇక్కడ సంస్కారమే లేదు. ఉన్నచో శాపమే తప్పు. ఆస్మృతివాచ్యము, వ్యంగ్యము అని రెండు విధములుగా నుండగలుగు.

దిన్యాసమపి కృత విస్మయాం పురస్తాత్

అంపస్తమ్భురదరవింద చారు హస్తాం

ఉద్వీక్ష్య ప్రియమివ కాంచనుత్తరన్తీ

సుస్మార్తీన్ జలనిధి మంథనస్య శౌరి:

ఇందు స్మృతివాచ్యమైనది. లాక్షణిక సమ్మతమైన సంస్కార జన్య జ్ఞానము నందున్నది. కాని ఇందు వాచ్య స్మృతి.

రక్తంబు మంద హసితం శ్వసితాని తాని

సా _ కొంక విధురా మధురా స్సశ్రీ

అద్యాపి మే హృదయ మున్మదయన్తి హన్త

సాయంత సంబుజ మనోదరలోచనాయా:

ఇందు వ్యంగ్య స్మృతి ఇది గూడ సంస్కార జన్య జ్ఞానమే. స్మృత్యుదయ దర్శన రత్నంథి, అప్పుబలతౌదులు మున్నను నవి స్మతిధ్వనిలోనేచేరునని జగన్నాథుని సిద్ధాంతము. కాగా స్మృతివాచ్య వ్యంగము అని ద్వివిధము. అది సంస్కార జన్యజ్ఞానమే.

కాని పై శ్లోకమున అబోధ పూర్వమను పదము సంస్కారజన్యత్వమును ప్రస్ఫుటపరచుచున్నది. కాని తార్కిక లక్షణమెట్లు పొసగును. కనుకనే యభినవగుప్తుడు దానిని ప్రతిభానా పర పర్యాయమైన సాక్షాత్కార స్వభావమని వచించినాడు. ప్రత్యక్షనముల్లసితమైన యొక విశిష్ట లక్షణముతో గూడిన స్మరణమిది. అందుకే దానికి అలౌకికత్వము.

ఒక్క స్మృతియేకాదు. రామాయణములో చూడుడు.

హృదయాన్నపయాతోసి దిక్షు సర్వాసు దృశ్యసే

వత్సరామగతోసీతి నంతాపేనానుమీయతే.

రాముడు వనమునకు వెడలినాడు. దశరథునకా విషయము తెలుసు. తానే పంపినాడు. కాని ఓరామ ! నీవు వెడలితివని సంతాపముచే మాత్రమే అను మానించుచున్నానన్నాడు. అనుమానమన్నేమి ? అనుమితికరణం అనుమానం, పరామర్శ జన్యజ్ఞానం అనుమితి:, వ్యాప్తి విశిష్ట పక్ష ధర్మతాజ్ఞానం పరామర్శ " ఇది అనుమాన సమగ్రరూపము. ఒక్కవ్యాప్తిని స్వీకరించి తద్ద్వారా మరొక్క వ్యాప్తిని సాధించుటయే యనుమాన విషయము. అది అసిద్ధ సాధకము. అది సిద్ధమయినచో ననుమాన బాధకమే. అది పక్షతను సాధించలేదు. మరి రాముడు వెడలినట్లు దశరథునకు తెలియును. తెలిసిన దానినే మరల సాధించుచున్నాడు. తెలిసిన దానిని సాధించుటెట్లు ? అది కుదరదు. అందుకే యిట తార్కిక సిద్ధమయిన యనుమానముకాదు. తార్కిక సిద్ధమయిన యనుమానములో ప్రత్యక్షముండరాదు. ఉన్నచో ననుమానముల కవకాశములేదు. ప్రత్యక్షమున్నపుడు దానికి విరుద్ధముగ గూడ అనుమాన ముండుటకు నవకాశములేదు. కాని ఇందు దశరథునకున్నని దిక్కులలో రాముడు కన్పించుచున్నాడు. అన్ని దిక్కులలో కన్పించి రాముడు ప్రత్యక్ష ప్రమాణ సిద్ధుడైనాడు. ప్రత్యక్ష సిద్ధుడయిన వతనిని నను మానమూలకముగ సాధించుట పొసగునా? లేదు. ప్రత్యక్షముతో సాధించుటకు వీలుగా నివానినేననుమానముతో సాధింపవలెను, అయితే యిక్కడనుమానమేమిటి ? ఇది యలౌకికమైన యనుమానము. సామాన్యమయిన అసిద్ధ సాధ్య మాత్రమున పర్యవసానము చెందనిదే యనుమానము. ముందటి స్మరణమువంటిదే. ఇది వన గమనాన్ని సాధింపకపోయినను తద్ద్వారా దశరథుడనుభవించిన బాధను పెంచ గల్గుతుంది. ఆ శ్లోకాన్ని చదివిన సహృదయుడు దశరథునిలోని బాధను భావన చేయగలడేగాని ఆ ప్రమాణముద్వార రామ వనగమనాన్ని సాధింపలేడు. ఇక్కడ మరొక్క విశేషము కలదు. రాముడు వెళ్ళినట్లును వెళ్ళనట్లును గూడయున్నాడు. అందుకే అనుమానమునందు లేకయు నున్నట్లున్నది. కనుకనే దానికి యలౌకికత్వ కత్వము. కాగా లౌకికయైన యీ యానందముగాని యీ సాహిత్య విషయము ములుగాని లౌకికములకన్న పూర్తిగ భిన్నము అని తేలినవి. రసోవైస: యన్నశ్రుతి సూక్తుల ద్వారా ఆనంద మయాత్మకమైన యీరారసముఖ పలువురు నిర్వహించిరి. నాట్యశాస్త్రకర్తయైన భరతుడు విభావానుభావ వ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తి: అని యుగ్గడించెను. ఇందలి సంయోగ నిష్పత్తి పదములు నపేక్షిత వ్యాఖ్యములు. కనుకనే పలువురు విమర్శకులు పలురీతుల నారస లక్షణమును విమర్శించిరి. ఉత్పత్తియని భట్టలొల్లటుడు అనుమితియని శ్రీ శంకరుడు, భుక్తియని భట్టనాయకుడు అభివ్యక్తియని యభినవగుప్తుడు గూడ సంయోగ పదమును వ్యాఖ్యానించిరి. సిద్ధాంతాను సారముగ నెన్నియు రస నిరూపకములు బయలుదేరినవి. ఉదాహరణాత్మకముగా రసనిరూపకములను పరిశీలించిన పలువురు విమర్శకుల దృష్టి నాకర్షించిన భవభూతి శ్లోకము నెన్న దగినది.

వినిశ్చేతుం శక్యో నసుఖమితివా దు:ఖమితివా

ప్రమోహో నిద్రావా కిమువిష విసర్ప: కిమ్మద:

తవస్పర్శే స్పర్శే మమహి పరిమూఢేంద్రియ గణో
వికార: చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ"

ఈ శ్లోకము శ్రీరామునిచే ననుభూతమయినట్లు వర్ణింపబడిన చైతన్యోన్మీలక చైతన్య భ్రమణాత్మకమయిన అనుభూతిరసానుభూతి. సుఖమో దుఃఖమో! ప్రమోహమో నిద్రయో విషసర్పమో ముదమో యర్థము కాని యొకానొక వికారము శ్రీరాముని, సీతాస్పర్శముచే పరిమూఢేంద్రియ గణునిగా వించి చైతన్యమును భ్రమింపచేయుచున్నది. మరల సమున్మీలనము గావించుచున్నది. పై శ్లోకమున పరిమూఢేంద్రియ గణ: వికార: చైతన్యం భ్రమయతి సమున్మీలయతి అనుపదములు విశేషించి యెన్నదగినవి. ఇంద్రియములు పరిమూఢములైనవి. అనగా వ్యాపారమును కోల్పోయినవి. బాహ్యేంద్రియములు పరిమూఢములైనచో వస్తుస్థితి స్వభావాదులు తెలియవు. కన్నులు లేనివానికి వస్తువర్ణము తెలియదు. త్వక్కులేనిచో వస్తుమార్దవాదులు తెలియవు. వీనులు లేనిచో శ్రుత్యశ్రుతులు తెలియవు. ఇట్టిది బాహ్యేంద్రియములు పరిమూఢములైనచో కల్గెడియనుభూతి. కాని ఇక్కడ బాహ్యేంద్రియ పరిమూఢత్వమునుకాదు. సీతాస్పర్శ దివ్యభావమనస్సునకు కూడ నందనిది. సుఖదుఃఖాద్యనుభూతులు మానసికములైనవి. సుఖమో దుఃఖమో నిర్ణయింపలేని పరిస్థితి శ్రీరామున కేర్పడినవి. మోహమో నిద్రయో యవగతము చేసుకొనలేని యవస్థ రామున కేర్పడినది. విషవిసర్పమో, మోదమో యనిశ్చితమయిన స్థితి శ్రీ రా ము న కే ర్ప డి న ది. అనగా మానసికాను భూతులైన పైవాని యందు శ్రీరాముడు నిశ్చయజ్ఞానము కోల్పోయినాడు. మనస్సు పరిమూఢము కానిచో నిశ్చయ జ్ఞానము కోల్పోవుట జరగదు. అందుకు పరిమూఢేంద్రియ గణశబ్దము మనఃపరము. స్పర్శస్పర్శమున నింద్రియగణము పరిమూఢవంగుట యను బట్టి త్వక్కుగూడ పరిమూఢమగుచున్నది. త్వక్కుగూడ పరిమూఢము కానిచో మిగిలిన ఇంద్రియములు పరిమూఢములైనను అనుభూతిని పొంద వచ్చును.

ప్రశ్చ్యోతనం ను హరి చందనపల్లవానాం
నిష్పీడితేందు కరకందళ జోను సేక:
ఆతప్త జీవిత తరో: పరితర్పణోమే
సంజీవనౌషధి రసో హృది ప్రసక్త:

శ్రీరాముడు మూర్ఛిల్లినాడు. సీత అదృశ్యయై శ్రీరాముని స్పృశించినది, దాన శ్రీరాముడు లశ్వాసితుడైనాడు. మోహ సమయమున యాస్పర్శమువలన గల్గిన యనుభూతిని శ్రీరాముడిట్లు వితర్కించుచున్నాడు. హరిచందన పల్లవములు ప్రవాహమా— పిండబడిన చంద్రకిరణముల కొనల యందలి రసమా? ఏమిది? దుఃఖముచే వాడిన నా జీవిత వృక్షమునకు సంజీవనౌషధివలె నా హృదయమున పూయబడినది అన్నాడు. ఇందు స్పర్శజ్ఞానముచే బాహ్యేంద్రియ పరి మూఢత్వ దశయందును శ్రీరామునకు ననుభూతి గల్గినది. కాగా మనస్సు త్వక్కు గూడ శ్రీరామునకు పరిమూఢములైనవి. మన స్సంయోగము లేక ఏదియు జరుగుటకు వీలులేదు. ఇది తార్కికులకు కూడ సమ్మతము. మనస్సు కూడ పరిమూఢమయినచో మరల దానివలన శ్రీరామునిలో నిర్వికార చైతన్యమును గల్గించినట్లు, అసలు వికార మెట్లు గల్గినట్లు. ఆ వికారము చైతన్యమును పోగొట్టుచు మరల దీపింప జేయుచు నుండి నట్లు. ఇక్కడ నొక్కటి విచారింతము. ఇంద్రియ గణము పరిమూఢమగుట యన్న బాహ్య జ్ఞానమును కోల్పోవును. అనగా ఆంతరముగానవి పనిచేయును. బాహ్య చైతన్యమున కవకాశమీయక ఇంద్రియ గణమంతయు అంతర్లీనము గావింపబడినది. అనగా సర్వేంద్రియములను తమలోతాము రమించినవి. ఇట్లు రమించిన యా యింద్రియములు నొక్కచో చేరినవి. అనగా బాహ్య ప్రపంచమును వీడి ఇంద్రియ గణమంతయు నాంతరిక చైతన్యమును పొంది తనలో తాను రమించినవి. ఆ ఆంతరంగిక చైతన్యము గూడ స్పర్శము వలన గల్గినది. అనగా స్పర్శమునకు స్పర్శమునకు నడుమ యెడమున్నదన్నమాట. ఆ స్పర్శ గల్గినప్పుడాంతరిక చైతన్యము భ్రమసిపోవుచున్నది. కాని పోలేదు. అది భ్రమలోపుగనే మరల స్పర్శ గల్గి యాంతరిక చైతన్యమును మరల యుద్బుద్ధము గావించుచున్నది. ఇదియంతయు క్షణముల మీద జరిగిపోవుచున్నది. ఇది మనసుకు సంబంధించిన యాంతరిక చైతన్యము. బాహ్య సంబంధము లేనిది. బాహ్యేంద్రియములందు నంతర్వ్యాప్తములైనవి కాన అవ్యక్త చైతన్యములైనవి— ఇవి లౌకికముకాదు. అయినచో నింద్రియములు స్వాంతర్లీనము కారాదు. కనుకనే యిది య లౌకిక చైతన్యము. భగవద్భక్తులకు నింద్రియములను స్వాంతర్లీనము చేయుట ద్వారా యాత్మాంతర్లీనము గావించినపుడు గల్గెడి యనుభవం యిట్టిదే. అదియు లౌకికము కాదు. అలౌకికమే. అలౌకిక చైతన్యమువలన భగవద్భక్తులకు నానందము గల్గినట్లు నీయలౌకిక చైతన్యము వలన వికారము గల్గుచున్నది. (ఆనందము). అదే య లౌకికమైన రసానందము. అందుకే 'రసంహ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి' అన్నారు. నాటకాది దర్శనముచే సామాజికు లనుభవించెడిది యిట్టి రసమే. కనుకనే యిది సమ్యక్ మిథ్యా సాదృశ్యాది జ్ఞాన ప్రతీతులు కన్న భిన్నమైనదని చెప్పుటయు కందు.

ఈ రస స్వరూపము సిద్ధమైన పిమ్మట దానిని సమగ్రముగ వైశిష్ట్య పురస్సరముగ భవభూతి మరియొక శ్లోకమున నిరూపించినాడు. భవభూతి దానిని సాక్షాత్తు రసపరముగ పల్కలేదు. కాని వ్యంగముగ నది రసపరమనుట నిర్వివాదాంశము. చూడుడు—

"అద్వైతం సుఖదుఃఖ యోరనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్ అహార్యోరస:
కాలేనావరణాత్యయాత్ పరిణతే యత్ ప్రేమసారే స్థితమ్

భద్రం తస్య సమానుషస్య కథమప్యేకం హితత్ ప్రార్థ్యతే" అని యన్నాడు. దాంపత్యము యొక్క యొకానొక మంచి మానుషుడెప్పుడూ కోరుచున్నాడట— అదే ఆ మంచియే అవసరముగ యిప్పయింపబడుచున్నది.

సుఖదుఃఖయో: అద్వైతం అని భవభూతి ప్రకృతిపరముగా వాడినాడు. రసమున గూడ సరిగినదియే సిద్ధాంతము. సుఖ దుఃఖములకు రసములో సమాన స్థితి, శకుంతలా దుష్యంతుల శృంగారము వలనగాని విదూషకుని హాస్యము వలన గాని సామాజికులలో గల్గెడి యానంద మొక్కటియే. శృంగారము వలన శృంగారము, కరుణము వలన కరుణము ఇట్లు ఏ రసము వలన నా స్థితి గల్గుటను రససిద్ధాంతము నంగీకరింపదు. అందుకే సుఖదుఃఖములకది యద్వైత స్థితి గల్గించున్నది. [illegible]

"కరుణరస ప్రధానమైన కావ్యము దుఃఖమయమగుట వలన దానికి రచనమునగాని సహృదయమునకు పఠనమునందుగాని రంగస్థలమున ప్రేక్షణమునగాని యెట్లు ప్రవృత్తి గల్గును. దుఃఖరూపమనిష్ట సాధనమగుటం జేసి కరుణరస ప్రధానమగు కావ్యమును గూర్చి నివృత్తియే యుచితమగును. సమాధానము. సుఖాధిక్యము. ఇష్టతావచ్ఛేదకము. ఇష్ట సమనియత ధర్మము. సుఖరూపమైన యిష్టము అధికమగుటం జేసి దుఃఖరూపమగు ననిష్టము నల్పమగుటంజేసి ప్రవృత్తియున్నదే. సానపై గంధము తీయ క్లేశము గలదని శ్రీగంధ లేపనమునందు నెవనికేని నివృత్తి గల్గుచున్నదా? ప్రవృత్తియె గల్గుచున్నది. గొడుగువాతప క్లేశకరమని మానక యెండలో వానలో నెవడు గొడుగు వేసుకొనకున్నాడు. కావ్యము లోకోత్తరాహ్లాద జనకము. అందు కరుణరసజన్యము నించుక శోకము కలదని దాని నెవడు పరిహసించును. ఇంక కావ్యమున నలౌకిక భావనా ప్రభావము చేత శోకము ప్రతిబద్ధమగును. కేవలాహ్లాదమే గల్గును. అందుచే శోకము సహితము నాహ్లాదజనకమే అనువారి మతమున కరుణరసాది ప్రధాన కావ్యములందు ప్రవృత్తి నిర్బాధకమే"

అనుగతం సర్వావస్థాసుయత్ అనుటయు రస సిద్ధాంతమున నసువన్నమే. అన్ని యవస్థలందును రసమనుగతముగనే ఉండును. దానికి నవస్థాభేదమేదియులేదు. సంసారాత్మకమైన వాసన కారణాత్మకము లేని విభావాదులున్నచో చాలును. దేశ కాలవయోవస్థా భేదవిహీనమై యానందాత్మకమైనయా రసము సర్వావస్థలయందును సర్వ భావములయందును గూడ సమమే యనుట నిర్వివాదాంశమే.

విశ్రామో హృదయస్య యత్ర అనుటయు నుపపత్తి నిర్బాధకమే. రసము నందు హృదయము విశ్రమించును. అనగా హృదయ చైతన్యము సంతర్పాతమగునది రసములోనే. అనగా ఆనందములోనే. హృదయమును కోరునది యానందమునే. ద్వంద్వ ప్రవృత్తికమైన యీ జగత్తున ప్రతి ప్రాణియు కోరునది విశ్రాంతినే. హృదయ విశ్రమమునే యీ రసమును తజ్జన్యమైన యానందమును నీ లౌకికమగుటచే హృదయమందు విశ్రమించియు నారటచే నగలదు. ఈ విషయమును భరతుని నాట్యశాస్త్రమందలి శ్లోకము నిరూపించగలదు.

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం
విశ్రాంతి జననం కాలే నాట్యమేతద్భవిష్యతి
(భరతుని నాట్యశాస్త్రము 1. అధ్యాయము)

పై శ్లోకమందలి విశ్రాంతి పదము సంవిద్విశ్రాంతి పరముగా నన్వయించుటలో దోషముండదేమో. "పరసా యస్య ఆహార్యోరసః అను వాక్యము ప్రమాణమే (రస శబ్దమునందు ఆనందపరము). ఆహరింపనీయరానిది రసము. క్రమపరిణతిని చెందిన కొలది సంవిద్విశ్రాంతి స్థిరమై యానందానుభూతి పెరుగును గాని తరగదు. కనుకనే క్రమపరిణతిలో గూడ నీరసము అహార్యము. అనగా సర్వవస్తుజాతమును బోలి రసము క్రమపరిణతిలో శక్తిని కోల్పోదు. అందుకే యలౌకికము.

కాలేనావరణాత్యయాత్— యత్ స్నేహసారేస్థితమ్. ఈ పదమును రస నిరూపణమునకు ప్రతీక. రసాస్వాదమునకు పూర్వరంగము ఆవరణ నాశము ప్రధానమయినది. ఈ విషయము నిరూపించుటకై జగన్నాథుడు, "రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణా చిదేవరసః 'భగ్నావరణ చిద్విశిష్ట రత్యాదిరేవ రసః' అని అభినవ గుప్తాదుల రస సిద్ధాంతమును వివరించినాడు. ఈ యావరణభంగము 'కాలేన' (క్రమముగ) గల్గునది. అనగా లౌకికములైన కార్య కారణములను నాటకీయములైన యనుభావ విభావములుగా మార్చుకొన్న తర్వాత గల్గునది యావరణాత్యయము. ఇందు నామార్పున కవసరమయిన యా కాలము కాలబ్ధవావి. యావరణాత్యయమునే పరిణతమైనది. స్నేహసారము. అనగా విభావానుభావాదుల కలయిక యొక్క దృఢాంశము. (సారో బలే దృఢాంశేచ) (అమరకోశము). అనగా స్థాయి. అందుండువాని యనుభవంలో తెలుసుకొన వలసినది రసము.

సుమనసస్య అను పదమును నీ సిద్ధాంతమున కనుకూలమే. ఇది సహృదయపరము. రసానుభూతి సహృదయులకే గల్గును గాని యితరులకు గలుగదు. పూర్వ పునరనుసంధానాత్మకమైన భావనా విశేష మహిమచే యనుభావ్యమానమైన యానందము ననుభవించగలవాడే సహృదయుడు. కాన సుమనసస్య పదమును నిందు సంగతమే. ఇట్లు రసావిర్భావమును, రసపరిణత్యాయులు గూడ భవభూతి తన కావ్యమున నిరూపించినాడు. పై రీతిన ననుభూతమైన రసము నలౌకికము, రసోవైసః అనుసూక్తి నిర్వచించినది గూడ నిట్టి రసమునే.



# పుష్పదంతుడు-శివమహిమ్న స్తోత్రము

## శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

అజరామరమైన కీర్తికాయముతో విరాజిల్లు స్తోత్ర కావ్యకర్తలలో శ్రీ పుష్పదంతుడు ప్రథమ గణనీయుడు. అతి ప్రసిద్ధమైన శివమహిమ్నస్తోత్ర మీతనిచే రచింపబడినదనుట లోక ప్రసిద్ధము. ఈ స్తోత్రమునకు పెక్కు ముద్రిత ప్రతులు కలవు. వానిలోని శ్లోక సంఖ్య భిన్నభిన్నముగానున్నది. ఇప్పటికి సుమారు తొమ్మిదివందల సంవత్సరములకు పూర్వము (వి. శ. 1120, శా. 985, క్రీ. శ. 1063) ద్వాదశజ్యోతిర్లింగాంతర్గతమైన ఓంకారేశ్వరలింగము యొక్క మందిరము పూర్వ దక్షిణముగా నున్న మాంధాతృమంటపము యొక్క భిత్తిపై నీ మహిమ్న స్తోత్రము చెక్కబడినది. ఇందు ముప్పది శ్లోకములే కలవు. ఇది కనిష్ఠ సంఖ్య. నేను చూచిన ముద్రిత ప్రతులలోని గరిష్ఠ సంఖ్య నలుబదియేడు చివరి శ్లోకములలో వివిధ వృత్తములు వాడబడినవి. వానిలోని యొక శ్లోకమున "ఆ సమాప్తమిదం స్తోత్రం పుణ్యం గంధర్వభాషితం" అని మరొక శ్లోకమున "కుసుమ దశననామా సర్వ గంధర్వరాజః" అనియు నుండుటచే పుష్పదంతుడు గంధర్వుడని తెలియును. దానిలో శశి శేఖర దేవదేవస్యదాసః అనియు నుండుటచే నీ గంధర్వరాజు శివదాసుడని తెలియును. ఈ శ్లోకములలో పుష్పదంతుడు ప్రమథగణాంతర్భూతుడని స్పష్టముగా చెప్పబడక పోయినను కథా సరిత్సాగరమున నాతడు ప్రమథగణాంతర్భూతుడని చెప్పబడినది. పుష్పదంతుడు ప్రమథ గణమున శివునిచే చేర్చుకొనబడుటకు పుష్పదంతుడను పేరతని కేర్పడుటకు కారణముగానందు వర్ణింపబడిన యుపాఖ్యానము యొక్క సంగ్రహ మిట్లున్నది.

"గంగాతీరమందలి బహుసువర్ణకమను నగ్రహారమందు నివసించెడి గోవిందదత్తుడను బ్రాహ్మణుని కుమారుడు దేవదత్తుడు. తండ్రిచే దూషింపబడి పిదప నలుగురు సోదరులవలె నీతడవమానమును సహింపలేక యింటనుండలేక ఒంటరిగా బదరికాశ్రమమునకు వెడలిపోయెను. అచట శివుని గూర్చి ఘోరతపమొనర్చెను. శివుడు ప్రత్యక్షముకాగా తన సతిని కనుమని ప్రార్థింపుమని వేడుకొనెను. అంతశివుడు విద్యల గడించి భోగము లనుభవింపుము. అటు పిమ్మట నీకోరిక నెరవేరగలదని అనుగ్రహించి అంతర్హితుడయ్యెను. పాటలీపుత్రమున వేదకుంభుడను నుపాధ్యాయునికడ దేవదత్తుడు విద్యాభ్యాసము చేయుచుండగా యువతియైన యాతని భార్య యువకుడు సుందరుడునగు దేవదత్తుని మోహించెను. శీలవంతుడైన దేవదత్తుడు పాటలీ పుత్రమును వీడి ప్రతిష్ఠానపురమున మంత్రస్వామియను గురువు నాశ్రయించి సర్వవిద్యల సంపాదించెను. విద్యావంతుడు సుందరుడునగు దేవదత్తుని ప్రతిష్ఠానపుర మహారాజగు సుశర్మ యొక్క కూతురు శ్రీదేవి ప్రేమించెను. అతడును ఆమెను ప్రేమించెను. విస్మయుగు శ్రీదేవి దంతములతో పుష్పము నొకటి పైకి విసరెను. దేవదత్తునకా సంజ్ఞ యొక్క తాత్పర్యము బోధపడలేదు. కామార్తుడై తపించు దేవదత్తుని యార్తి కారణమును ఉపాధ్యాయ డాతని నడిగి తెలిసికొని "అదిగో పూల విరివిగా నున్న యా పుష్పదంత దేవాలయము సంకేత స్థానము" అని యా సంజ్ఞయొక్క తాత్పర్యమును శిష్యునకు వివరించిచెప్పెను. పిమ్మట దేవదత్తుడు పుష్పదంతదేవాలయమునకేగి యొంటరిగా నచటనున్న శ్రీదేవిని కౌగలించుకొనెను. ఆమె నా సంజ్ఞను నీవెట్లు గ్రహించితివని యడుగ గురువు వలన నెరిగితినని యాతడు బదులు పలికెను. అంతటామె నీవు విదగ్ధుడవుకావు నన్ను వదలుమని విదిలించుకొని కోపముతో వెడలిపోయెను. దేవదత్తుడు ప్రియ విరహతాపము భరింపలేక మరణింపనుండగా శివుడు ప్రమథగణాంతర్గతుడైన పంచశిఖుని బిలిచి దేవదత్తుని కామమును సఫలమొనర్ప నాజ్ఞాపించెను. పంచశిఖుడు దేవదత్తుని కడకువచ్చి అతనికి స్త్రీ వేషమువేసి తాను వృద్ధబ్రాహ్మణ వేషమును ధరించి సుశర్మ మహారాజు కడకేగి "మహారాజా నా కొడుకెచటికోపోయెను వానిని వెదకుటకు నేను పోవుచుంటిని ఈమెనాకోడలు ఈమెను నేను వచ్చువరకు కాపాడవలెను" అని పలికి స్త్రీ వేషమునున్న దేవదత్తుని సుశర్మ మహారాజునకప్పగించి వెడలిపోయెను. మహారాజు కన్యాంతఃపురమున సురక్షితముగ నుండుమని యాతని శ్రీదేవి యంతఃపురమున నివసింపజేసెను స్త్రీ వేషమునున్న దేవదత్తుడు గాంధర్వవిధానమున శ్రీదేవిని వివాహమాడెను. కొంతకాలమునకు శ్రీదేవి గర్భవతియయ్యెను. దేవదత్తుడు పంచశిఖుని స్మరింపగా నాతడువచ్చి దేవదత్తుని స్త్రీ వేషమును తొలగించి యాతనితో కలిసి మహారాజు కడకువచ్చి "మహారాజా, ఇదిగో నాకు కుమారుడు లభించినాడు నా కోడలినిమ్ము" అని యడిగెను. మహారాజు కన్యాంతఃపురమున నామెయుండగా నీకోడలు నెవరో రాత్రి యెత్తుకొనిపోయిరని భయమునను నుడివి క్షమింపుమని ప్రార్థించెను. పంచశిఖుడు సదయుడువలె నటించి అట్లయినచో నీకుమార్తెను నాయీ కొమరున కొసంగుమని పల్కెను. రాజట్లేచేసెను దేవదత్తుడిట్లు శ్రీదేవినిపడసెను. పంచశిఖుడు కైలాసమునకేగెను. దేవదత్తుడు చాలకాలము శ్రీదేవితో సకల రాజభోగముల ననుభవించి వార్ధకమునందామెతో వనమునకేగి శివునారాధించి తదనుగ్రహమున మనుష్య శరీరమును వదలి కైలాసమునకేగెను. అచ్చట అతని భార్య జయయను పేరను పార్వతీ దేవికి ప్రతీహారియయ్యెను. అతడు ప్రమథ గణమున చేర్చుకొనబడి శివునకు వాహనము వహించియుండెను. ప్రియురాలు దంతములతో పుష్పమును విసరుచుండుట సంజ్ఞ నెరుగక పోవుటవలన దేవదత్తుడు పుష్పదంత నామమున విఖ్యాతుడయ్యెను. ("కథాపీఠము 7వ తరంగము)

నైషధాంతమున ప్రతిష్ఠానపురమునగల పుష్పదంత దేవాలయము పేర్కొనబడుచున్నది. కాని యా దేవాలయమునకా పేరెట్లు వచ్చెనో తెలుపుటలేదు. తెల్లనిదంతముల ధవళాట్టహాసమును వింజిమ్ము కుందపుష్ప మకుళముల వలెనుండుటచే శివునకు పుష్పదంతనామము సార్థకమని చెప్పవచ్చును. స్కాందపురాణ.

చతుర్థ ఖండమైన కాశీఖండమున సిద్ధీశ్వర లింగమునకుత్తర భాగమున పుష్పదంతేశ్వర లింగముకలదని పుష్పదంతేశ్వర లింగమున కాన్నేయ భాగమున దేవర్షి గణ లింగములు కలవనియు జెప్పబడినది.

దక్షిణే తవకుండాచ్చ పుష్పదంతేశ్వరః పరః (కాశీఖండము 97 అధ్యా 246 వశ్లో)
తదగ్నిదిశి దేవర్షి గణలింగాన్యనేకశః

పుష్పదంతాద్దక్షిణతః సిద్ధీశః పరసిద్ధిదః . ( " " ,247శ్లో)

కాశీ పట్టణమున పుష్పదంతేశ్వర మందిరము నేటికిని ప్రసిద్ధముగానున్నది. స్కందపురాణ ప్రభాస ఖండమున (180 వ అధ్యాయమున తావంత్య ఖండమున 77 వ అధ్యాయమున) పుష్పదంతేశ్వర మాహాత్మ్యముకలదు.

శివ మహిమ్న స్తోత్రకర్త పుష్పదంతుడు స్థాపించుటచేత నే ఈ లింగమునకు పుష్పదంతేశ్వరనామము కలిగినట్లు చెప్పుకొనుటయు గలదు.

పుష్పదంతుడు మనుష్యజాతియందు జన్మించుటకు హేతువుగా మున్న మరొక వృత్తాంతముగూడ కథాసరిత్సాగరమునం దిట్లు గలదు.

ఒకనాడు కైలాస శిఖరమున ఏకాంతమున జగదంబ పార్వతి జగత్పితయైన పరమేశ్వరుడును కూర్చొనియుండిరి. నందీశ్వరుడు ద్వారమును రక్షించు చుండెను. ఆ సమయమున పుష్పదంతుడు లోనికేగ బోవుచుండగా నందీశ్వరుడు వాని నడ్డగించెను. పుష్పదంతుడు తిరస్కరిణీశక్తి ప్రభావమున నందీశ్వరుని కంట బడకయే లోనికేగెను. ఈ కారణమున కోపించిన పార్వతి పుష్పదంతుని మనుష్య యోనియందు జన్మించుమని శపించెను. ఆ శాపమువలన పుష్పదంతుడు కాత్యాయన నామాంతరముగల వరరుచియను మనుష్యుడుగ జనించి పాణిని సూత్రములకు వృత్తిరచించి వ్యాకరణాచార్య మునిత్రయమున నొకడుగ విఖ్యాతుడయ్యెను. స్థూల శిరుడను రాక్షసునితో చెలిమి చేసినందులకు కుబేరునిచే శపింపబడిన సుప్రతీకుడను యక్షుడు వింధ్యారణ్యమున కాణభూతియనుపేర పిశాచరూపము దరించి తిరుగుచుండగా నాతని దర్శించిన వరరుచికి తన పూర్వజ్ఞానముకలిగి ఏకాంతము పరమేశ్వరుడుపార్వతికిజెప్పుచుండగా తాను తిరస్కరిణీప్రభావమున లోనికేగి వినిన యేడుగురు విద్యాధరుల కథలను (ఏకైక లక్ష శ్లోకాత్మక పరిమితిగలవి) స్మరించి కాణభూతికి జెప్పి శాపావసానము నొంది మరల పుష్పదంతుడై ప్రమథగణమున జేరి శివానుచరుడై కైలాస మున నివసించుచున్నాడు. (ప్రథమ ద్వితీయ తరంగములు)

పై కథా సరిత్సాగర వృత్తాంతము పుష్పదంతుని గంధర్వత్వమును పేర్కొనక పోయినను ఆతని తిరస్కరిణీ శక్తి కలిమిని బోధించుచున్నది. తిరస్కరిణీ శక్తి ఆకాశగమన శక్తి గంధర్వులకు సాధారణముగా నుండునట్టివేయనుటకు పురాణ కథలలో పెక్కు నిదర్శనములున్నవి. ఇట్టి తిరస్కరిణీ శక్తిచే గర్వితుడై పై వృత్తాంతములో పేర్కొనబడిన అపరాధమువంటి మరొక అపరాధమును పుష్పదంత గంధర్వుడొనరించి శివునకు కోపము కలిగించి తన మహిమను కోలుపోయెనని పూర్వము పేర్కొన్న శ్లోకమున "సఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏ వాస్యరోషాత్" అను పాదము తెలుపుచున్నది. తాను పోగొట్టుకొన్న మహిమను స్వామి మహిమను స్తుతించుటచే సంపాదించుకొని యుండవచ్చునని" స్తవమిద మకార్షీద్దివ్య దివ్యం మహిమ్నః అను పాదము తెలుపుచున్నది.

మహిమ్న స్తోత్రమునకు శివ విష్ణుపరార్థకాటీకను రచించిన మధుసూదన సరస్వతి పై శ్లోకములలో దేనికిని వ్యాఖ్యానము వ్రాయక పోయినను పై శ్లోకమున సూచింప బడిన యైతిహ్యమును వివరించెను. తత్సంగ్రహమిది.

"పూర్వము శివభక్తుడైన యొక రాజుండెను. ఆతడు శివ పూజాపుష్పముల కొరకు పుష్పవనముల నాటించెను. పుష్పదంతుడు తిరస్కరిణీ ప్రభావమున పుష్పములను అపహరించుకొని పోవుచుండెను. భటులు చెప్పగా విషయమును తెలిసికొనిన యా రాజు పుష్పాపహార నిరోధము కొరకు తన పూల తోటలో శివ నిర్మాల్యము చల్లించెను. ఎప్పటివలె పుష్పదంతుడు పుష్పాపహారము చేయుచు ప్రమాదవశమున ఆ నిర్మాల్యమును త్రొక్కుటచే తిరస్కరిణీ శక్తియు ఆకాశ గమన శక్తియు నశింపగా తాను దొంగగా పట్టుబడకుండుటకు పుష్పాపహారాపరాధ పరిహారము కొరకు ఈ శివమహిమ్న స్తోత్రమును రచించి శివానుగ్రహమున నష్ట శక్తులను మరల పొంది వెడలి పోయెను"

మహిమ్న స్తోత్ర కర్తయగు పుష్పదంతునకు గల తిరస్కరిణీ శక్తి సంబంధము ప్రమథగణ పుష్పదంతునితో ఐక్యమును భావింప జేయుటలో సహకరించుచున్నది.

బ్రహ్మ వైవర్త పురాణమున పుష్పదంతునకు సంబంధించిన ఈ క్రింది వృత్తాంతము కను బడుచున్నది.

శంఖచూడుని వధించగోరిన శివుడు ముందుగా దేవతల రాజ్యమును దేవతలకీయవలసినదిగా శంఖచూడునికి తన భక్తుడైన పుష్పదంతుని ద్వారా రాయబారము పంపెను. శంఖచూడుడు దేవతలకు రాజ్యమును సమర్పించుటకు నిరాకరించెను. ఆ విషయమును పుష్పదంతుడు శివునకేగి విన్నవించెను. శంఖచూడుని శక్తిసామర్థ్యములను గూర్చియు పుష్పదంతుడు శివునకు తెలిపెను. (బ్ర. వై. పు. ప్రకృతి ఖండము)

లింగపురాణోత్తరార్ధమున ఇరువదియేడవ అధ్యాయమున అభిషేక వర్ణనమున ఆవరణ దేవతలలో పుష్పదంతుడు పేర్కొనబడినాడు.

మహాభారత ద్రోణ పర్వాంతర్గత నారాయణాస్త్రమోక్ష పర్వమున డెబ్బదిమూడవ అధ్యాయమున త్రిపుర దాహకథా సందర్భమున ఉణీషప్త్వాల ఫ్రుతంచ పుష్పదంతం చత్ర్యంబకం (శ్లో 71) అని పుష్పదంతుని రథావయవముగా శివుడు చేసికొన్నట్లు చెప్పబడినది. శల్యపర్వమునందు పార్షదులు ఉన్మాదశంకుకర్ణులతో బాటు పుష్పదంతుని కుమారస్వామి సేవకై నియోగింప బడినట్లున్నదని బొంబాయి పండితుడు వైద్యశ్రీ కన్హైయాలాల్‌దేవ దవ మహిమ్న స్తోత్ర పీఠికలో తెలిపినాడు.

కథాసరిత్సాగరము మహాభారతము పురాణములు పేర్కొనిన పుష్పదంతుని యైక్యముగాని భిన్నత్వముగాని నిర్ణయించుట కితరాధారములేవియు కానరావుగాని ఇవి యన్నియు పుష్పదంతుని యతి ప్రశంసితను శివభక్తత్వమును నిశ్చయించు నను టకు సందేహమేమియు లేదు.

వాక్పతిం పుష్పదంతంచ కాణ్వాం సోమమధర్వణమ్
హేమ చంద్రం సమస్కృత్యవక్ష్యే౽థోక్ష జఫక్కికామ్

ఈ అన్వయమున పరమ అను పదమునకు పరామా యస్యసః (గొప్ప లక్ష్మి యెవనికి గలదో వాడు లక్ష్మీపతి) అను వ్యుత్పత్తి చేసియున విష్ణూ! యని గాని గొప్పవాడా అనిగాని హరి పరముగ నర్థము చెప్పబడినది.

ఉపనిషత్తులు భగవంతుని బృహత్ బ్రహ్మ మహత్ భూరవ్ భూమా ఇత్యాది పదములతో వ్యవహరించినవి. భగవంతుడు మహత్తు, ఆయన యెక్కడ ప్రతిష్ఠితుడయి ఉన్నాడు అన్న ప్రశ్నకు స్వే మహిమ్ని అని సమాధానము చెప్పబడినది. తన స్వరూపమున అనుటకు బదులుగ తన మహిమయందే అని చెప్పబడినది. మహత్తు యొక్క స్వరూపము మహిమకాక మరేమి. దాని యొక్క స్తోత్రమే మహిమ్నస్తోత్రము.

భగవంతుని మహిమ సగుణము నిర్గుణము నని రెండువిధములుగ నున్నది. అనంతగుణ పూర్ణ మగుటవలన సగుణమహిమగాని ధర్మరహితమగుటవలన నిర్గుణ మహిమగాని మనోవాక్కుల కందదు. అట్టియాయుభయవిధ మహిమను వేదమే సభయముగాను తించుచుండగా నా మహిమయొక్క ధ్యానముగాని స్తుతిగాని ఎవడు చేయగలడు ? కాని ఆ మహిమ భక్తానుగ్రహార్థము (పరిమితమైన) ఆకృతి దరించినప్పుడు మాత్రము అందరి మనోవాక్కులును దానినందుకొనుటకు యత్నింపకుండ నుండవు అనుతాత్పర్యము రెండవశ్లోకమునకు జెప్పిన మధుసూదన సరస్వతి "పదే త్వర్వాచీనే పతతి నమనః కస్య న వచః" అను నాల్గవపాదములో గల గ్రంథగ్రంధిని అద్భుతముగా విప్పినాడు "అర్వాచీనే పదే" అను పదములు నూతనమైన పదమునందను అర్థమును మాత్రమే స్ఫురింపజేయును. అర్వాచీన పదము (క్రొత్త పదము)నందు అనగా సాకార రూపము అనునర్థము మధుసూదన సరస్వతి వ్యాఖ్యానముచేతనే గ్రంథిభేదనా సఫలించును.

భగవంతుని మహిమ స్తుతింప దగినదని తేలినది. ఐనను ఈ స్తుతి చేత భగవంతుడు సంతోషించునా ? సంతోషించనిచో స్తుతి వ్యర్థము కాదా ? అన్న ప్రశ్నకు సమాధానము మూడవ శ్లోకము. దీనికి మధుసూదన సరస్వతి రెండు రకములుగా తాత్పర్యమును చెప్పినాడు.

(1) పురమథనా ! పరబ్రహ్మమూర్తీ ! మధువును మించిన వేద వాక్కులను అమృతమువంటి శబ్దములను వెల్లడించిన నీకు బ్రహ్మదేవుని వాక్కులుగూడ నింపవు. కాని నీ గుణముల గానము చేయుటవలన గలుగు పుణ్యముచేత నా వాక్కును పవిత్రముచేసికొనవలెనని నిన్ను స్తుతించ గడగినానే కాని నిన్ను మెప్పించుటకు గర్వమున నీ స్తోత్రమును రచింపబూనలేను.

ఇందలి పురమథన శబ్దము త్రిపురముల సంహరించిన శివుని బోధించును. ఈ శబ్దమునకు విష్ణుపరముగా నర్థము చెప్పిన మధుసూదన సరస్వతి ప్రతిభ మిక్కిలి యాశ్చర్యమును కలిగించును.

గోకులమందు పెరుగు మథింపబడినది. పాల సముద్రము అమృతము కొఱకు మథింపబడినది. కావున గోకులమునని పాలసముద్రమునని మథపు లనబడును. మథనము పురముగాగలవాడు అనగా వైకుంఠమో గోకులమో నివాసముగాగలవాడు పురమథనుడట !

(2) ఈ శ్లోకమందలి చతుర్ముఖ బ్రహ్మను లేక బృహస్పతిని బోధించునదిగను పదములను భావపరముగ జేసి యున్న తాత్పర్యము చెప్పబడినది.

పురమథనా ! పరబ్రహ్మమూర్తీ సమస్త వేదము యొక్క సారామృతమునంతయు పూర్తిగా గ్రహించిన, హిరణ్యగర్భాదిసురలకు గురుడవైన నీకు కటుత్వ మే మాత్రమును లేని మాధుర్య పూర్ణమైన వాగ్దేవి కూడ నీకు తృప్తి కలిగింపజాలనపుడు నా అల్పమైన వాక్కును గూర్చిచెప్పనక్కర లేదు. అయినను నీ గుణముల స్తుతింపు పుణ్యముచేత నీ స్తోత్రకర్తయొక్క మమలాది దోష కలుషితమైన వాక్కును నిష్కలుషముగ చేయుదునను నీ బుద్ధి స్తోత్రము చేయుటకు నన్ను ప్రేరేపినది. కావున నేనెట్లు స్తుతించినను నీకు సంతోషమే కలుగును.

ఇట్లే మొదటి శ్లోకత్రయమును స్తోత్ర రచనా ప్రయత్న సమర్థకముగా వ్యాఖ్యానించిన మధుసూదన సరస్వతి వైదుష్యమెంత ప్రశంసనీయమో ఇట్టి వ్యాఖ్యానమున కవకాశమునీయగల రచన చేసిన పుష్పదంతుని ప్రతిభ అంతకంటెను ప్రశంసనీయము.

పుష్పదంతుడు సర్వతంత్ర స్వతంత్రుడు. వివిధ శాస్త్ర సంప్రదాయముల నెఱుగకుండినచో శివమహిమ్న స్తోత్ర మర్థముకాదు. ఆయా శాస్త్ర విషయములను గంభీరమైన ప్రౌఢమైన ధారావాహికమైన శైలిలో పుష్పదంతుడు గుమ్మరించెను. ఉదాహరణమున కొకటి

ధ్రువం కశ్చిత్సర్వం సకల పరస్త్వ ధ్రువమిదం
పరో ధ్రౌవ్యా ధ్రౌవ్యే జగతి గదతి వ్యస్త విషయే
సమస్తే౽ప్యేతస్మిన్ పురమథన తైర్విస్మిత ఇవ
స్తువన్ జిహ్రేమిత్వాం నఖలు నను ధృష్టా ముఖరతా

ఈ శ్లోకమున కార్యకారణాత్మకమయిన ఈ జగత్తు నిత్యమని అనిత్యమని నిత్యానిత్యమని నిత్యానిత్యతలు వ్యస్త విషయములని సమస్త విషయములని వివిధ శాస్త్ర వాదములు పేర్కొనబడినవి. ఈ శాస్త్రములే చెప్పలేని నిన్ను స్తుతించుటకు సిగ్గుపడకున్నాను. ఇది నా మాటాడ గలుగుట యొక్క ధార్ష్ట్యమే సుమా ! అని మహా పండితుడైన పుష్పదంతుడు తనకు స్వామిని గూర్చి చెప్పుటకు సిగ్గుపడుచున్నట్లు చెప్పుట అతని వినయ వైభవమును స్పష్టీకరించుచున్నది.

ఇట్లే ఇరువదియవ శ్లోకమున జడమైన కర్మఫలమీయజాలదని ఈశ్వరుడు లేని కర్మఫలింపనే ఫలింపదని కర్మఫలదాత ఈశ్వరుడేయని కర్మఫల నిరూపణ చేయబడినది. ఇరువది యొకటవ శ్లోకమున ప్రజ్ఞలేని దక్షుడు ఆచరించిన యజ్ఞమది పాపమై యతని వినాశమునకు హేతువయ్యెనని శివుడు నిమిత్త మాత్రుడయ్యెననియు ప్రతిపాదింపబడినది.* దక్షయజ్ఞ ధ్వంసకుడగుటచే శివుని పారమ్యమును వేదమంగీకరించదను వీరవైష్ణవవాదము నిరాకరణీయమని వ్యంజింపజేయ బడినది.

ఐదవ శ్లోకమున సృష్టి విషయమున భగవంతుని యిచ్ఛ యెట్టిది ? అది యేల కలిగినది ? ఆ యిచ్ఛయాయన కెట్టి శరీరము కలిగినది. యా శరీరియైన కర్తయే యాధారమున నిలచినాడు క్షిత్యాది భూతముల నిర్మించుట కాయనకు సాధనమేది ? యనునిట్టి సందేహములు అతర్క్య ఐశ్వర్యుడవగు నీయెడ గలుగుట మందమతులకు సహజమని ఆరవ శ్లోకమున ఈ లోకముల కవయవములు కనబడుచున్నను జన్మలేకపోవునా ? జన్మమిదిష్టాత

లేకయే జరుగునా ఈశుడు కానిచేదియుంన జగన్నిర్మాణమును చేయునా? ఈశునకు పరికరము యొక్క ఆవశ్యకతయేమి? యని పై సందేహములకు ప్రతి ప్రశ్న రూపమున సమాధానము చెప్పుటకు ప్రయత్నించియు నీ ప్రయత్నము మందమతుల కుపయోగింపజాలదనియు ప్రతిపాదింపబడినది.

ఏడవ శ్లోకమున త్రయీ, సాంఖ్యయోగ పాశుపతాది మతములు పరస్పర విరుద్ధములైన మార్గముల ప్రతిపాదించినను ఆయా మార్గములలో ప్రయాణించు వారికందరకు బహు ప్రదేశములలోని జలములకు సముద్రమువలె గమ్యమగువాడు పరమేశ్వరుడేయని ప్రతిపాదింపబడినది.

తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించో హరి రధః
పరిచ్ఛేత్తుం యాతావనల మనస్కంధవపుష
తతోభక్తి శ్రద్ధాభర గురు గృణద్భ్యాంగిరి శయత్
స్వయం తస్థేతాభ్యాం తవకి మనువృత్తిర్నఫలతి

ఈశ్వరుని యాపరమైశ్వర్యమును కొలువగలమని యహంకరించి జ్యోతిర్లింగము యొక్క ఆద్యంతములను బ్రహ్మ విష్ణువు లెఱుంగలేకపోవుటను చివరకహంకారమును వీడి వారు భక్తిలో శివుని స్తుతించుటను ప్రతిపాదించుట నీ శ్లోకమున "శక్తులు కాలేదు" అనునర్థమున "అనలమ్" అని ప్రయోగించుట తాభ్యాంతస్థే అను భావేప్రయోగము చేయుట పుష్పదంతుని శబ్దశాస్త్ర భిజ్ఞత కుదాహరణములు.

బాణాసుర రావణాసురానుగ్రహ నిగ్రహములు విషపానమన్మథ దాహముల తాండవము గంగాధరణము మొదలగు పెక్కు శివలీల స్తోత్రమున మనోహరముల గను ప్రౌఢగంభీరములను భక్తి భావ బంధురములుగను వర్ణింపబడినవి. వానిలో త్రిపుర సంహారలీల మిక్కిలి యాశ్చర్యకరము. శివునకు రథములేదు. భూమి రథమయ్యెను. దానికి చక్రములేవు. సూర్యచంద్రులు చక్రములైరి. సారథి లేడు. బ్రహ్మ సారథియయ్యెను. ధనుస్సుగాని బాణముగానిలేవు. మేరువు ధనుస్సుగా విష్ణువు బాణముగా నేర్పడిరి. ఇట్లు యుద్ధమునకు సిద్ధమై త్రియాత్ర సాగించిన శివుడు యుద్ధము చేసెనా? చేయలేదు. ఏమిచేసె? మూడవకన్ను తెరచి దానిలోని అగ్నితో వారిని కాల్చివైచెను. మూడవ కంటితో త్రిపుర దాహము చేయుదలచినవాడు భూమ్యాదులను రథాదులుగా నేలకూర్చుకొనెను? కూర్చుకొనిన వాడు యుద్ధముచేసి వారినేల చంపలేదు? ఈ ప్రశ్నలకు

రథః క్షోణీయంతా శతధృతి రగేంద్రోధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణ పాణిః శర ఇతి
దిధక్షోస్తే కోఽయం త్రిపురతృణమాడంబరవిధి
ర్విధేయైః క్రీడంత్యో నఖలు పరతంత్రాః ప్రభుధియః

సమాధానమీ శ్లోకమునందలి నాల్గవపాదము. అర్థాంతర న్యాసరూపమున చెప్పబడిన యీ సమాధానమిది. "శివునకు పరతంత్రత్వము లేదు. ఏ సాధనములు లేకనే శివుడు త్రిపురాసురుల సంహరింప సమర్థుడు. భూమ్యాదుల గర్వమణచుటకు త్రిపురాసురుల గాల్చెను. ఇది కేవలము త్రిపుర సంహార లీల కాదు. సుభక్త గర్వభంగలీల కూడ. తన భక్తులకు గర్వము కలిగినచో దానిని భంగము సేయుటయే? ఇది ప్రభువు యొక్క లీల."

"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి" అను ఉపనిషన్మంత్రార్థము జన్మాద్యస్యయతః అను బ్రహ్మసూత్రము భగవంతుని తటస్థ లక్షణమును బోధించును. సృష్టిస్థితిలయము లెవ్వనివలన గలుగునో యాతడు భగవంతుడు. భగవంతుని సృష్టించునపుడు బ్రహ్మగా పాలించునపుడు విష్ణువుగా సంహరించునపుడు రుద్రుడుగా పేర్కొనుట పురాణముల పద్ధతి. వైష్ణవాగమములు బ్రహ్మవిష్ణు రుద్ర శబ్దములకు బదులుగా అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ శబ్దములనుపయోగింపగా శైవాగమాను సారముగా పుష్పదంతుడు

బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః
ప్రబల తమసే తత్సంహారే హరాయ నమోనమః
జనసుఖ కృతే సత్త్వోద్రేకే మృడాయ నమోనమః
ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః

అను శ్లోకమున భవమృడహర శబ్దములనుపయోగించెను. త్రిగుణాతీత స్వరూపమును శివశబ్దము బోధించునని చెప్పెను.

మేఘసందేశము ననుసరించి సందేశ కావ్యముల పరంపర యేర్పడినట్లు శివమహిమ్న స్తోత్రముననుసరించి మహిమ్న స్తోత్రముల పరంపర ఏర్పడినది. దుర్వాసోమహర్షి కృతములుగా భావింపబడుచున్న పరశంభు మహిమ్న స్తోత్రము దేవీమహిమ్న స్తోత్రమును తంత్రశాస్త్ర జటిలములైనను వానిలో శివ మహిమ్న స్తోత్రానుకరణము కనబడును. దేవీమహిమ్న స్తోత్రము నందుకన్న పరశంభు మహిమ్న స్తోత్రమున ఈయనుకరణ మధికము. పుష్పదంతుడే రచించినట్లుగా స్తోత్ర గ్రంథములలో ముద్రింపబడిన గణేశ మహిమ్న స్తోత్రము శివమహిమ్నస్తోత్ర కర్తయగు పుష్పదంతునిచేత నది రచింపబడలేదని పరితలకు స్పష్టమగును. పరమహంస బ్రహ్మానందస్వామిచే రచింపబడిన విష్ణు మహిమ్న స్తోత్రము శివమహిమ్నమును శబ్దతః అర్థతః అనుసరించినను లలితముగానున్నది. గీతలు పెక్కులున్నను గీతయనగానే శ్రీకృష్ణునిచే నర్జునునకుపదేశింపబడిన గీతయే స్ఫురించినట్లు సహస్రనామ స్తోత్రమనగానే శంకర భాష్యసమలంకృతమైన (శంకరులచే గేయం గీతానామ సహస్రమ్ అని చెప్పబడినవి) విష్ణు సహస్రనామ స్తోత్రమే స్ఫురించినట్లు మహిమ్నమనగానే శివమహిమ్న స్తోత్రమే స్ఫురించును.

పుష్పదంతుడు పురాణములనే యనుసరించెనో పురాణములు పుష్పదంతునే యనుసరించెనో చెప్పుట కష్టముకాని పురాణములలోని శ్లోకములకు శివ మహిమ్న స్తోత్రములోని శ్లోకములకు పెక్కు శబ్దార్థ సంవాదములు కలవు.

ఉదాహరణమునకు "రథః క్షోణీయంతా" అను శ్లోకమునకు క్షోణీ రథోవిధిర్యంతా శరోహం మందరోధనుః రథాంగే చాపి చంద్రార్కౌ యుద్ధేయుష్మత్రైపురే (స్కంద పురాణము మాహేశ్వర కౌమారిక ఖండము 33 వ అధ్యాయము 25 వ శ్లోకము)

వియద్వ్యాపీ (మహిమ్న స్తోత్రము 17 వ శ్లోకము) అను శ్లోకములోని విశేషములు వియద్వ్యాపీసుర సరిత్ప్రవాహో విప్రుషాంజలిః బభూవయస్య శిరసి తస్మాత్సర్వమహో గతే (స్కంద పురాణము మాహేశ్వర కౌమారిక ఖండము 33 వ అధ్యాయము 23వ శ్లోకము) అను శ్లోకములోని విశేషములు వానిలోని గంగాధర మహిమలు ఒక విధముగానేయున్నవి. ఇట్లే అఖండబ్రహ్మాండ

క్షయ (మహిమ్నస్తోత్రము 14వశ్లోకము) అను శ్లోకములోని ఎత్తుగడయు అ హందే యచ్చ బ్రహ్మాండక్షయోద్యుక్తం హాలాహలమ్ కంఠే దధార శ్రీకంఠః కస్త స్మాత్పరమో భవేత్ (స్కాందపు. మా. కా. ఖండ 33వ అధ్యాయము) అను శ్లోకములోని ఎత్తుగడయు వానిలోని విషపాన వైభవమును ఒక విధముగానేయున్నవి.

అమాంగల్యం శీలం తవ భవతునా మైవమఖిలం
తథాపిస్మర్తౄణాం వరద పరమం మంగలమసి
(మ. స్తో. 25 శ్లో)

యద్యప్యమంగలానీహ సేవతే శంకరస్సదా
తథాపి మంగలం తస్య స్మరణాదేవ జాయతే
(శివపు. జ్ఞాన సంహిత 14 వ అధ్యాయము 56 వ శ్లోకము)
పై రెండు శ్లోకములలో శబ్దార్థ సంవాదము స్పష్టమే.

త్రయీం తిస్రో వృత్తీః (మ స్తో 28) శివపురాణ వాయుసంహితోత్తర భాగము 7 వ అధ్యాయము 23—31 శ్లోకములు.

నమోనేదిష్ఠాయ (మ. స్తో. 31) స్కాందపు. వైష్ణవ ఖండము 42 వ అధ్యాయము) ఇట్లెన్నని చూపవచ్చును.

కాళిదాసాది మహాకవులు పెక్కురు పుష్పదంతుననుకరించినట్లు పెక్కు నిదర్శనములు కలవు.

రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానా పథజుషాం
నృణామేకో గమ్యస్త్వ మసి పయసా మర్ణవ ఇవ (మ స్తో 7 వ శ్లో)
అను శ్లోకార్థమునకు

"బహుధాప్యాగమైర్భిన్నాః పంథాన స్సిద్ధి హేతవః"
త్వయ్యేవనిపతంత్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే
(కాళిదాసరఘువంశ దశ మసర్గము)
అను కాళిదాసుని శ్లోకము.

ఉదధావివ సర్వసింధవః సముదీర్ణాస్త్వయినాథ దృష్టయః
నచతాసు భవాన్ ప్రదృశ్యతే ప్రవివిక్తాసు సరిత్స్వివోదధిః
సిద్ధసేనదివాకరుని యీ శ్లోకమును అనుకరణములే.

మధుస్ఫీతావాచః(మ. స్తో 3 వశ్లో) అను శ్లోకములోని భావము "పవిత్ర మాత్రాతనుతే జగద్యుగే స్మృతారసక్షాలనయేవ సత్కథా కథం, నసా మద్గిర మావిలామపి స్వసే వినీమేవ పవిత్రయిష్యతి" అను భట్టహర్షుని శ్లోకములోని భావమును సదృశములైయున్నవి.

భట్టబాణుని కాదంబరీ మంగళాచరణ శ్లోకము.

రజోజుషే జన్మని సత్త్వవృత్తయే స్థితౌ ప్రజానాం ప్రళయే తమస్స్పృశే
అజాయ సర్గస్థితినాశహేతవే త్రయీమయాయ త్రిగుణాత్మనే నమః
ఇది మ.స్తోత్రమందలి "బహులరజసే" అను శ్లోకమునకు అనుకరణమే.

శంకర భగవత్పాదుల దక్షిణామూర్తి స్తోత్రమందలి
భూరంభాంస్యనిలోనలోంబర మహర్నాథో హిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవమూర్త్యష్టకమ్


వ్యాఖ్యాన సింహాసనంపై తమ శిష్యులైన భారతి తీర్థతో శృంగేరీ శ్రీ శారదా చంద్రమౌళేశ్వర పీఠాధిపతులు శ్రీమదభినవ విద్యా తీర్థ మహనీయులవారు

అను శ్లోకము మ. స్తోత్రమందలి త్వమర్కస్త్వం సోమః అను శ్లోకమునకు అనుకరణమని దక్షిణామూర్తి స్తోత్ర వ్యాఖ్యాత స్వయం ప్రకాశ స్వామి తమ్మిక వ్యాఖ్యానమున చెప్పెను.

సంస్కృత భాషలోనే గాక ఇతర భాషలందు పెక్కింటను మహిమ్న స్తోత్రమున కనువాదములు అనుకరణములు పెక్కులు వచ్చినవి. ఉదయపుర రాజవంశీయుడు పరమయోగీశ్వరుడు నిహాలి ఉతురసింహ మహారాణా రాజస్థాని భాషయందు శిఖరిణీ వృత్తములలోనే దీని ననువదించినాడు.

తెనుగున అనువాదములు పెక్కు వచ్చినవి. శివమహిమ్న స్తోత్రానువాదకులలో నేను గూడ ఒకడను. దీనిపై వ్యాఖ్యానములు గూడ పెక్కు వచ్చినవి.

క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశస్తను భృతా
మృషీణామార్త్విజ్యం శరణ దసదస్యాస్సురగణాః
క్రతుభ్రేషస్త్వత్తః క్రతుఫల విధాన వ్యసనినో
ధ్రువంకర్తుః శ్రద్ధా విధురమభిచారాయహిమఖాః (మ. స్తో. 21)

అనుశ్లోకమునకు నన్నెచోడమహాకవి యిట్లనువదించినాడు.
తనర క్రియాతి దక్షుండగు దక్షుడు తత్ర కరువల్లభుండు స
న్మునితతి ఋత్విజుల్ సురసమూహము సభ్యులు తత్ఫలంబు లిం
దినకము నిచ్చునీవడచి తట్ట మఖంబది కర్తృభక్తిమై

దనరని యజ్ఞమైన తుదిదానభిచారము కాకపోవునే.
బహుళరజసే లన్నమహిమ్న శ్లోకమును యథా వాక్కుల అన్నమయ్య

భువనోత్పత్తి విధించుచోట నభవుడై పొల్పొందగా దాని సు
స్థవళీలన్ బ్రభవించుచో హరుడవై సర్వంబు కల్పాంత భై
రవ సంక్షోభ నటించుచో హరుడవై త్రైగుణ్యశక్తిన్ దుదిన్
శివనామాంకము దాల్చుని మహిమదా జిత్రంబు సర్వేశ్వరా!

అని యనువదించినాడు. ఇందు విధించుచో నభవుడై అనుచోట (త్రైగుణ్యశక్తిన్ దుదిన్ శివనామాంకముదాల్చు అనుచోటను మూల విరోధము కనబడుచున్నది.

భట్టుమూర్తి నరస భూపాలీయమున
అసితగిరిసమంస్యాత్కజ్జలం సింధుపాత్రే
సురతరు వరశాఖా లేఖనీ పత్రముర్వీ
లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలమ్
తదపి తవ గుణానా మీశ పారం న యాతి
అను మహిమ్నస్తోత్రాంతిమ శ్లోకములలోనున్న యొక శ్లోకమునకు
ఆశ్వాసాంత పద్యములలో నరస నృపాల మౌళి పరముగ
అరయంబయోధి పాత్రమున నంజన శైలము కజ్జలంబు త
త్సురతరు శాఖ లేఖిని వసుంధర పత్రముగా నొనర్చి వా
క్సరసిజనేత్ర వ్రాయుగుణసారము పారము పొందజాలదా
నరస నృపాల మౌళి భుజనస్తవ సద్గుణ సంప్రదాయముల్.
అనువాదముగావించి చేర్చినాడు.

పై శ్లోకము యొక్క ఛాయ వేదాంతదేశికులవారి ఈ క్రింది శ్లోకమున గానవచ్చుచున్నది.

నిక్షేపమంజన తలం యది పత్రికాస్యా
తస్యార్ణవో యది మసీ భవిత్రీ
వక్తా సహస్రవదనః పురుషః స్వయం చే
ల్లిఖ్యేత రంగపతి పాదుకయోః ప్రభావః
(పాదుకా సహస్రము ప్రభావపద్ధతి 2వ శ్లో)

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున.....మహిమ్నుడు మహిమ్నస్తవంబునను అని మహిమ్నస్తవమును పేర్కొనినాడు.

సతాంపర్తృత్యాత్వ శ్రుతి సమధిగమ్యం సమధికం
ఘృణామప్యన్మార్యు స్వజన విషయ స్నేహ గుణితాం
ద్విజః కృంతన్నాదేపితరమపి రాధ్యంత్యయి విభో
మనుష్యత్వం సద్యస్త్రి దశపరిణామేన విజహౌ

మను: ప్రాదుర్భావాదనల మితమిదం జన్మని పురా
పురారే నక్వాపిక్వచిదపి భవంతం ప్రణతవాన్
నమన్ముక్తస్సంప్రత్యహమతనురగ్రేఽప్యనతిమా
న్మహేశక్షంతవ్యం తదిద మపరాధం ద్వయమపి

ఈ రెండు శ్లోకముల అర్థము భక్తి బంధురమైయున్నను పెక్కు ప్రతులలో లేకుండుటచే ప్రక్షిప్తములనబడియున్నవి. వివిధ ఫలశ్రుతులుగల చివరి శ్లోకములు ప్రక్షిప్తములైనను చాల పూర్వ కాలముననే వాని ప్రక్షేపము జరిగియుండును. వానిలో

మహేశాన్నాపరో దేవః మహిమ్నో నాపరా స్తుతిః
అఘోరాన్నాపరో మంత్రః నాస్తి తత్త్వం గురోః పరమ్

అను శ్లోకము మహేశ మహిమ్నస్తుతి ప్రాశస్త్యమును ప్రకటించుచున్నను అఘోర-విద్యాగురు ప్రశంస యధికముగానుండి పరశంభుమహిమ్న స్తోత్రమున గన్పడుటచేతను అక్కడ దాని సన్నివేశ మనుచితముగ నుండుటచేతను పుష్పదంత మహిమ్నస్తోత్రమున తర్వాతి కాలమున నెప్పుడో ప్రక్షిప్తమైనదనుటలో సందేహమక్కరలేదు. ప్రక్షిప్త శ్లోకమైనను ఈ శ్లోకము మిక్కిలి అందముగానున్నది.

తవ తత్త్వం న జానామి కీదృశోఽసి మహేశ్వర
యాదృశోఽసి మహాదేవ తాదృశాయ నమో నమః

ప్రక్షిప్తమేయైనను ఈ క్రింది శ్లోకము అపరాధక్షమాపణ పద్ధతి శివప్రీతికరముగనున్నది.

యత్కృత్యం తన్నకృతం యదకృత్యం కృత్యవత్తదాచరితమ్
ఉభయోః ప్రాయశ్చిత్తం శివ తవ నామాక్షర ద్వయోచ్చరితమ్



# శ్రీపతి పండితుడు-శ్రీకర భాష్యము

## కుమారి కె. లలితాంబ

కర్ణాటక రాజ్యంలో బసవేశ్వరుడు ప్రబోధించిన వీరశైవం ఆంధ్రలో బసవేశ్వర, ఆరాధ్య సాంప్రదాయంగ ప్రచారం పొందింది. పాల్కురికి సోమనాథుడు మల్లికార్జున పండితారాధ్య చరిత్రలో శివభక్తిని ప్రచారం చేసినవారుగ శ్రీపతి పండితుని, మల్లికార్జున పండితుని, శివలెంక మంచెన పండితులను పేర్కొన్నాడు! (1)పండిత త్రయమను పేరుతో వీరు ఆంధ్ర ప్రాంతంలో ఆరాధ్య సంప్రదాయ ప్రచారకులుగ ప్రఖ్యాతి గాంచారు. వీరిలో శ్రీపతి పండితుడు ప్రథముడని (2) సోమనాథుడు పేర్కొనడంవల్ల, వీర శైవ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ బాదరాయణ బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానమైన శ్రీకర భాష్యమనే గ్రంథం శ్రీపతి పండితుని రచనగా వెలుగులోకివచ్చినందువల్ల శ్రీపతిపండితుని ప్రాముఖ్యం పెరిగి అతని కాల నిర్ణయంపై పండితులు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు. అది అలా ఉండగ 'శ్రీకర భాష్యం'లో ప్రస్తావితాలైన విషయాన్ని దృష్టిలో పెట్టుకొని కొందరు పండితులు, చరిత్రకారులు శ్రీకర భాష్య కర్తగ తెలియవచ్చిన శ్రీపతి పండితుడు పండిత త్రయంలోని శ్రీపతి పండితుడు ఒకరు అవునా? కాదా అన్న విషయంలో కూడ భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు.

శ్రీపతి పండితుని కాలం, శ్రీకర భాష్య కర్తృత్వం పై వెలువడిన భిన్నాభిప్రాయాన్ని పరిశీలించి సముచితంగ లభించే అభిప్రాయాల ఊతంతో విషయ నిర్ణయం చేయడానికి చేసే ప్రయత్నమే యీ వ్యాసం.

### శ్రీపతి పండితుని కాలం

(1) బసవ పురాణానికి పీఠిక వ్రాస్తూ కీ. శే. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారు శ్రీపతి పండితుడు బసవేశ్వరునకు యించుమించుగ సమకాలం వాడని తెలిపారు. (3) బసవేశ్వరుని కాలం క్రీ. శ. పన్నెండవ శతాబ్దం అన్న విషయం వివాదాంశం కాదు కాబట్టి శ్రీపతి పండితుడు కూడ పన్నెండవ శతాబ్దానికి చెందినవాడని వీరభిప్రాయంగా తెలుస్తోంది.

2. పాల్కురికి సోమనాథుని రచనలు ఆధారంగ తీసుకుంటే శ్రీపతి పండితుడు పన్నెండవ శతాబ్దంలో నివసించిన వాడుగ భావించవచ్చని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారి అభిప్రాయం. (4)

3. శ్రీపతి పండితుడు పదకొండవ శతాబ్దం తుది పాదంలోనూ పన్నెండవ శతాబ్దం ఆది పాదంలోను ఉన్నవాడని నిశ్చయముగ చెప్పవచ్చని శ్రీ చాగంటి శేషయ్యగారి అభిప్రాయం. (5)

4. కళ్యాణనగరంలో వీరశైవోద్యమం అత్యుత్తమ స్థాయికి చేరుకున్న కాలంలో (అనగా క్రీ. శ. 1162—64) (6) దేశంలో పలు ప్రాంతాల నుండి బసవేశ్వరుని దర్శించడానికి వచ్చిన శివభక్తుల్ని పేర్కొంటట డాక్టరు పి. బి. దేశాయ్ ఆంధ్ర ప్రాంతంలో నుండి శ్రీపతి పండితుని పేర్కొన్నారు. (7) దీనిని బట్టి శ్రీపతి పండితుడు బసవేశ్వరుని సమకాలికుడని అనగా పన్నెండవ శతాబ్దానికి చెందినవాడనే సూచింపబడింది.

5. శ్రీకర భాష్యానికి వెయ్యి పుటలకు పైగా పరిచయ గ్రంథం వ్రాసిన శ్రీ సి. హయవదనరావుగారు శ్రీపతి పండితుడు క్రీ. శ. 1400 సం. ప్రాంతం వాడని నిర్ణయించారు. (8)

6. పండితారాధ్య చరిత్ర పీఠికలో, శ్రీపతి పండితుడు రామానుజాచార్యునికి పూర్వుడై ఉండవచ్చని, 12వ శతాబ్దానికి చెందినవాడు మాత్రము కాడని డా. చిలుకూరు నారాయణరావు గారు తెలియజేశారు. (9)

7. బెజవాడ యుద్ధమల్లుని శాసన కర్తృత్వం శ్రీపతిపండితునికి ఆపాదిస్తూ ఆ శాసన కాలం అనగా క్రీ. శ. 930 సం. శ్రీపతిపండితుని కాలమని కళాప్రపూర్ణ నిడదవోలు వెంకటరావుగారి వాదన. (10)

పై అభిప్రాయాల్ని పరిశీలిస్తే శ్రీపతి పండితుడు క్రీ. శ. పన్నెండవ శతాబ్దానికి చెందినవాడని ఎక్కువమంది అభిప్రాయపడినట్లు తెలుస్తుంది. కాని సి. హయవదనరావు, చిలుకూరు నారాయణరావు, నిడదవోలు వెంకటరావుగార్ల అభిప్రాయాలు మాత్రం అందుకు భిన్నంగా ఉన్నయి. వీరి వాదాలకు చూపు కారణాన్ని పరిశీలించడానికి ముందు శ్రీపతిపండితుని గురించి లభిస్తున్న మౌలికమయిన సమాచారాన్ని దృష్టిలోకి తీసుకోవడం అవసరం.

శ్రీపతిపండితుని ప్రస్తుతించిన గ్రంథాలలో మల్లికార్జునపండితుని శివతత్వసారం, పాల్కురికి సోమనాథుని బసవపురాణం మల్లికార్జునపండితారాధ్య చరిత్రలను వరుసగా పేర్కొనవచ్చు.

"యిలలో శివుడొక్కడే పరమ దైవమని నిరూపించడానికి శ్రీపతి పండితుడు విజయవాడలో నిప్పును చెంగున కట్టుకుని జమ్మి వృక్షానికి వ్రేలాడతీపిన ఉదంతం మల్లికార్జునుడు వర్ణించాడు! (11)

పై సమాచారం వల్ల శ్రీపతిపండితుడు శివభక్తిపరుడని భక్తివిశిష్టతను చాటడానికి అద్భుతాలు ప్రదర్శిస్తూ ఉండేవాడని విజయవాడ నివాసి అని తెలుస్తోంది. కాని ఏ శతాబ్దానికి చెందినవాడో అతడు ప్రబోధించిన లేక అనుసరించిన శైవమత స్వరూపం ఏమిటో తెలియడంలేదు.

మల్లికార్జునపండితుడు పేర్కొనడం వల్ల శ్రీపతిపండితుడు మల్లికార్జునకు సమకాలీనుడు గాని లేక పూర్వుడు అయి ఉండాలి కాని తర్వాతి వాడు మాత్రం కాదనేది స్పష్టం—

మల్లికార్జున పండితుడు బసవేశ్వరుని సమకాలీనుడే గాక యించుమించు సమ వయస్కుడని పాల్కురికి సోమనాథుని రచనల వల్ల తెలుస్తుంది. (12)

సమ వయస్కుడన్న విషయంలో కాకపోయినా పీరుభయుల సమకాలికులన్న విషయంలో మాత్రం భిన్నాభిప్రాయాలు వెలువడలేదు. బసవేశ్వరుని జీవిత కాలం షుమారుగ క్రీ. శ. 1105—1167 సం. మధ్య కాలంగ తీసుకో వచ్చని డాక్టర్ పి. బి. దేశాయి సూచించారు. (13) బసవేశ్వరుని అనంతరం కొద్దికాలానికే అనగా ఒకటి రెండు సంవత్సరాలలోనే (14) ఇహలోకయాత్ర చాలించినట్లు కన్పిస్తున్న మల్లికార్జున పండితుడు కూడ ఇంచుమించుగ అదే కాలం జీవించినట్లుగ చెప్పవచ్చు. కాబట్టి మల్లికార్జునపండితుడు పేర్కొన్న శ్రీపతిపండితుడు 12వ శతాబ్దానికి కాని లేక అంతకుముందు గాని నివసించి ఉండవచ్చును.

శ్రీపతిపండితుడు నిప్పును చెంగున కట్టుకున్న ఉదంతం అనంత పాలుని ఆస్థానంలో జరిగినదని సోమనాథుడు బసవపురాణంలో వర్ణించాడు. (15) శ్రీపతి పండితుని కాల నిర్ణయానికి ఇంతవరకు లభించిన ఆధారం యిది ఒక్కటే.

మల్లికార్జున పండితారాధ్య చరిత్రయందు శ్రీపతి పండితుని ప్రస్తావన అనేక చోట్ల కన్పిస్తుంది. కాని యీతని కాల నిర్ణయానికి ఉపయోగపడే అంశం అందులో ఒక్కటి కూడ లేదు. ఈ గ్రంథంలో లభించే సమాచారం బట్టి శివభక్తిని ప్రచారం చేసిన పండితత్రయంలో శ్రీపతి పండితుడు ప్రథముడని, మల్లికార్జునపండితుడు త్రయోదశ గణాల్లో ఒకరుగ శ్రీపతి పండితుని స్తుతించాడని, (16) శ్రీశైల పర్వతారోహణ చేయు భక్తుల శివభక్తులు గురించి పాడుకొను సందర్భంలో శ్రీపతి పండితుని కూడ స్మరిస్తూ (17) ఉండేవారనేగాక శివతత్వ సారంలో పేర్కొనబడినట్లు శ్రీపతిపండితుడు "నిప్పు చెంగున కట్టుకున్న ఉదంతం ప్రదర్శించాడని తెలియవస్తుంది (18) కాని శ్రీపతిపండితుని కాల నిర్ణయానికి ఉపకరించే అంశం ఇందులోను ఏమి లభించడంలేదు.

బసవపురాణంలో శ్రీపతి పండితుని సమకాలికుడుగ పేర్కొనబడిన అనంతపాలుడు చారిత్రక వ్యక్తి అగుట వలన శ్రీపతిపండితుని కాలం నిర్ణ యించడానికి ముఖ్యమైన ఆధారముగ తీసుకోవాల్సి ఉంటుంది. అతడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి అయిన ఆరవ విక్రమాదిత్యుని సేనాని అని తెలుస్తోంది. క్రీ. శ. 1118 సం. లో కులోత్తుంగ చోళుని మరణానంతరం అనంతపాలుని నాయకత్వంలో చాళుక్య సేనలు వేంగిపై నడిచి విజయలక్ష్మిని చేపట్టి విజయవాడ, కొండపల్లి ప్రాంతాలను కేంద్రాలుగ చేసుకుని పరిపాలించాడని, 1120—1130 సం. మధ్య కాలమునకు చెందిన అనంతపాలుని శాసన ములు అనేకం లభ్యమయినవని చరిత్రకారులు పేర్కొన్నారు. (19)

ఆంధ్రదేశంలో మధ్యయుగంలో జైనమత ప్రాబల్యం తగ్గిపోవడానికి కారణాలు పరిశీలిస్తూ డాక్టర్ బి. ఎస్. యల్. హనుమంతరావు (20) జైను లను శైవులు ముఖ్య ప్రత్యర్థులుగ తయారయ్యారని వారి మధ్య చెలరేగిన మతపరమైన వాగ్వివాదాలలో శైవులు జైనులను ఓడించి వారిని శైవులుగ మార్చటంగాని లేక వారి బసదులను ధ్వంసం చేయడం కాని చేసేవారని తెలు పుతూ శ్రీపతిపండితుడు అనంతపాలుని ఆస్థానంలో ప్రదర్శించిన అద్భుతం గురించి ప్రస్తావించారు. అంతేగాక చేబ్రోలు కొల్లూరు ప్రాంతాలలో లభిం చిన శాసనాల ప్రకారం అనంతపాలుడు శివవిష్ణు దేవాలయాలకు దానాలు చేసినట్లు కొల్లూరులోని నరేంద్ర దేవాలయం ఇతడే అనంత భోగేశ్వరాల యంగ మార్చబడిందని, కాకతీయ సేనాని 'జాయప' పేర్కొనిన చేబ్రోలు నందలి అనంత జినాలయమును అనంతపాలుడే నిర్మించి ఉండవచ్చునని అతని జైనమతాభిమానాన్ని తొలగించడానికే శ్రీపతి పండితుడు అతని ఆస్థా నంలో 'శివుడొక్కడే' పరమదైవమని' నిరూపించడానికి పూనుకొని ఉండ వచ్చునని వ్రాసారు.

అందువలన సోమనాథుడు పేర్కొన్నట్లు శ్రీపతిపండితుడు అనంత పాలుని సమకాలికుడని అంగీకరిస్తే అతడు పన్నెండవ శతాబ్దంలోని తొలి భాగంలో నివసించి ఉండవచ్చునన్న విషయం స్పష్టం.

శ్రీపతి పండితుని కాలం 12వ శతాబ్దం అని పైన పేర్కొన్న చరిత్ర కారులంతా అనంతపాలుని సమకాలీనతను అంగీకరించారని తెలుస్తుంది.

డాక్టరు పి. బి. దేశాయ్‌గారు తెలియజేసినట్లు శ్రీపతి పండితుడు బసవేశ్వరుని క్రీ. శ. 1162—1167 సం. మధ్య దర్శించి ఉన్నట్లయితే శ్రీపతిపండితుని ఉనికిని తెల్పుతున్న అనంతపాలుని పరిపాలనా కాలానికి అనగా క్రీ. శ. 1120—1130. బసవేశ్వరుని దర్శించిన కాలానికి మధ్య దాదాపు నలభయి సంవత్సరాల వ్యవధి కనిపిస్తుంది. అనంతపాలుని కాలంనాటి శ్రీపతి పండితుడు ముప్పయి నలభయి సంవత్సరాల వయస్సువాడై ఉండ వచ్చునని భావిస్తే అతడు డెబ్బయి లేక ఎనభయి సంవత్సరాల వృద్ధుడుగ బసవేశ్వరుని దర్శించి ఉండవచ్చును. అయితే బసవేశ్వరుని దర్శించడానికి దేశాయ్‌గారు ఆధార గ్రంథాన్ని పేర్కొనలేదు. బసవేశ్వరుని కాలంలో వెలువడిన కన్నడ గ్రంథాలలో ఏవైనా శ్రీపతి పండితుడు బసవేశ్వరుని దర్శించాడని పేర్కొన్నవే తెలియదు. కాని పాల్కురికి సోమనాథుడు గాని మల్లికార్జున పండితుడుగాని శ్రీపతిపండితుడు బసవేశ్వరుని దర్శించినట్లుగ పేర్కొనలేదు.

అందువల్ల శ్రీపతిపండితుడు బసవేశ్వరుని దర్శించాడని ఖచ్చితంగా చెప్పడానికి వీలులేదు. కాబట్టి బసవేశ్వరుని సమకాలీనత శ్రీపతిపండితుని కాల నిర్ణయం చేయడానికి ఉపకరించడంలేదు. శ్రీపతిపండితుని కాలనిర్ణయం చేయడానికి ప్రస్తుతానికి లభ్యమవుతున్న మౌలికమైన ఆధారం అనంతపాలుని సమకాలీనతయే అని చెప్పక తప్పదు.

కాని చిలుకూరు నారాయణరావుగారు "సోమనాథుడు అనంతపాలుని గురించి తెలిసి వ్రాయలేదని నా విశ్వాసం" అని త్రోసిపుచ్చారు. (21) పండితా రాధ్య చరిత్రలో శ్రీపతిపండితుని గురించి ప్రస్తావిస్తూ 'తొల్లి' అని పేర్కొనడంవల్ల అతడు సోమనాథునకు చాల పూర్వుడని తెలుస్తుందని, శివతత్వసారంలో శ్రీపతి పండితుడు గావించిన అద్భుతాన్ని వర్ణిస్తూ మల్లి కార్జునుడు 'అలజమ్మి' అని చెప్పడం చేత ఆ విషయం పండితారాధ్యుని కాలనికి చాల సుప్రసిద్ధమై ఉండాలని, కాబట్టి శ్రీపతి పండితుడు పన్నెండవ శతాబ్దానికి మాత్రం చెందినవాడు కాడని ప్రకటించారు.

చిలుకూరు నారాయణరావుగారి అభిప్రాయాన్ని బలపరుస్తూ

శ్రీ నిడదవోలు వేంకటరావుగారు సోమనాథునకు చరిత్రజ్ఞానం లేదని నిరూపించి శ్రీపతిపండితుడు క్రీ. శ. 930. సం. నకు చెందినవాడని చెప్పడానికి ఈ క్రింది కారణాలు చూపారు. (22)

1. సోమనాథుడు శ్రీపతి పండితున్ని పండిత త్రయంలో ప్రథముడుగ పేర్కొన్నాడు.

2. పండిత త్రయంలో ద్వితీయుడుగ పేర్కొనబడిన మల్లికార్జునపండితారాధ్యుడు శ్రీపతి పండితుని పేర్కొనడం వల్ల అతడు మల్లికార్జున పండితునకు పూర్వుడై ఉండాలి.

3. పల్లకేతుని శాసనంలో పండితారాధ్యుడను వ్యక్తి నిప్పును చెంగున కట్టుకున్న ఉదంతం పేర్కొనబడలేదని, ఆ శాసనం పదకొండవ శతాబ్దానికి చెందినదని, అందు ప్రస్తావించబడినది శ్రీపతి పండితుడే అని, పదకొండవ శతాబ్దానికి చెందిన శాసనంలో అతని ప్రస్తావన కనిపిస్తోంది కాబట్టి శ్రీపతిపండితుడు 11వ శతాబ్దానికి పూర్వుడై అనగా 10వ శతాబ్దానికి చెందినవాడై ఉండాలని లెక్కించి బెజవాడ యుద్ధమల్లుని శాసనం శ్రీపతిపండిత కృతమని చెప్పడానికి వారీ కారణాలు చూపారు.

1. శ్రీపతి పండితుడు విజయవాడకు చెందినవాడు. బెజవాడ యుద్ధమల్లుని శాసనం విజయవాడయందు లభించడం.

2. ఈ శాసనం మల్లీశ్వరదేవాలయంలో లభ్యమవడం. శ్రీపతిపండితుడు అద్భుతాన్ని ప్రదర్శించింది అక్కడనే.

3. సోమనాథుడు శ్రీపతిపండితుని కవిగా వర్ణించడం.

4. ఈ శాసనం వీరశైవానికి సంబంధించిన 'నొరగ' అను పదం కలిగి ఉండటం. శ్రీపతిపండితుడు వీరశైవాన్ని ప్రవర్తిల్లచేసిన పండితత్రయంలో ప్రథముడని పేర్కొనబడటం.

5. ఈ శాసనం మధ్యాక్కరలతో కూర్చబడినది. శివకవులు వారి మత వ్యాప్తికి ఈ ఛందస్సును వాడడం.

కానీ యీ వాదానికి అనేక ప్రతిబంధకాలున్నాయి:

1. యుద్ధమల్లుని శాసనంలో శ్రీపతి పండితుని పేరు గాని అతడు చేసిన అద్భుతం కాని సూచనప్రాయంగానైనా కన్పించడంలేదు.

2. ఈ శాసనకాలం నాటికి ఆంధ్రదేశంలోగాని కర్ణాటకంలోగాని 'వీరశైవం' ఉన్నట్లు కన్పించదు.

3. శ్రీపతిపండితుడు వీరశైవుడని సోమనాథుడు పేర్కొనలేదు. 'శివతత్వ సారం' 'మల్లికార్జునపండితారాధ్య చరిత్ర'ల యందు లభించు సమాచారం వల్ల శ్రీపతి పండితుడు గొప్ప శివభక్తుడని తెలుస్తుందే గాని వీరశైవుడని చెప్పడానికి ఉపకరించే విషయాలు లేవు.

వీరశైవుడుగ అభివర్ణితుడైన మల్లికార్జునుని పేరుతో శ్రీపతి పండిత, శివలెంక మంచెన పేర్లను జోడించి సోమనాథుడు చెప్పడంవల్ల ఈ ముగ్గురు ఆంధ్రలో వీరశైవాన్ని ఆరాధ్యసాంప్రదాయంగ ప్రచారంచేశారనే అభిప్రాయం ప్రబలినట్లు కన్పిస్తుంది. కానీ సోమనాథుడు 'వీరశైవం' అన్న పదాన్ని ఆ మత సిద్ధాంతాలను దృష్టిలో పెట్టుకోకుండానే శివుని పట్ల ఏకాగ్రమయిన మనస్సు కలిగి, వీర గుణాలను ప్రదర్శించడమే 'వీరశైవ'ం అని వర్ణించిన సందర్భాలు కొన్ని యీతని గ్రంథాల్లో కన్పిస్తున్నాయి. 'శివతత్వసారం' (23)లో 'హరిని' వీరశైవుడని వర్ణించడానికి "తన నేత్ర కమలాలు శివునకు అర్పించడం అని శంకరుని చేత '[illegible]' పొందడం అని, శ్రీ సాంబు అనెడి పుత్రుణ్ని పొందడం అని పేర్కొన్నాడేగాని 'వీరశైవ' లక్షణాలయిన లింగధారణగాని

యిష్ట లింగ పూజగాని జంగమ పూజగాని షట్ స్థల సిద్ధాంతం గాని 'హరి' అనుసరించినందువల్ల 'వీర శైవుడ'ని సోమనాథుడు పేర్కొనలేదు. కాబట్టి యీ సందర్భంలో విష్ణువు ప్రదర్శించిన వీర గుణాల వల్లనే 'వీర శైవుడ'ని వర్ణితుడైనాడనేది సుస్పష్టం. అలాగే శ్రీపతి పండితుడు యితడో శివుడే పరమదైవమని నిరూపించడానికి వీరోచితంగ నిప్పును చెంగున కట్టుకునే వీరకృత్యం చేశాడు కాబట్టి, అట్టి కార్యాలు కూడ 'వీరశైవ'మే అని అంగీకరిస్తే తప్ప శ్రీపతి పండితుడు వీరశైవుడని చెప్పడానికి వీలులేదు.

4. యుద్ధమల్లుడు వీరశైవుడు కాడు. ఇతడు వేయించిన బెజవాడ శాసనం వీరశైవానికి సంబంధించినదీ గాదు. ఈ శాసనంలో ప్రస్తావితమైన విషయాలను బట్టి అతడు విజయవాడ యందు కుమారస్వామికి ఆలయాన్ని దానికి అనుబంధంగా ఒక శైవ మఠాన్ని నిర్మించాడని, అందు శైవేతరులెవరూ బస చేయరాదని శాసించాడని శైవేతరులు అందు చేర కుండ జాగ్రత్త తీసుకొనేవారికి అశ్వమేధయాగం చేసినంత పుణ్యఫలం కలుగుతుందని అలా చేయకపోతే శివలింగాన్ని ధ్వంసం చేసినంత పాపం కలుగుతుందని తెలుస్తోంది. (24)

శివుని యిష్ట లింగ రూపంలో తప్ప అన్య దైవారాధన గాని యజ్ఞ యాగాదులను కాని 'వీరశైవం' ఏమాత్రం అంగీకరించదు.

పాల్కురికి సోమనాథుడు శ్రీపతిపండితుని కవిగా పేర్కొన్నంత మాత్రాన యుద్ధమల్లుని శాసనం విజయవాడ యందు లభించినందువల్ల శ్రీపతి పండితునకు సంబంధించిన విషయాలేవి లేకపోయినా, యుద్ధమల్లుని శాసన కర్తృత్వం శ్రీపతి పండితునకు ఆపాదించడం సమంజసంగా తోచదు.

పల్లకేతుని శాసనంలో కాలం సూచించబడలేదు. ఆ శాసనం పదకొండవ శతాబ్దానికి చెందినదని చెప్పడానికి ఆధారాలు ఏమిలేవని డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు తెలిపారు. (25)

ఈ శాసనం పదునొకండవ శతాబ్దానికి చెందినదేనని అంగీకరించినా అందులో ప్రస్తావితమైన 'అద్భుత కృత్యం' పదవ శతాబ్దంలోనే జరిగి ఉండవచ్చని చెప్పడానికి కారణం కన్పించదు.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్ర యందు 'తొల్లి'

శ్రీపతి పండితుడు అని పేర్కొన్నాడని మల్లికార్జునపండితుడు శివతత్వ సారంలో శ్రీపతిపండితుని గురించి చెప్పుతూ 'అజమ్మి' అని వ్రాసిన అందువలన మల్లికార్జునపండితునకు అతడు పూర్వుడై ఉండాలి అనడం సబబుకాదు. మల్లికార్జునుని దర్శించడానికి వచ్చిన వెలిదేవసోమనాథుడు, పోర్తండ సూరసానమ్మ మొదలగు జంగములు మల్లికార్జుని జంగ భక్తికి అబ్బురపడి అతనిని బసవేశ్వరునితో పోల్చుతూ "ఆనాడు బసవేశ్వరుడు— ఈనాడు మల్లికార్జునపండితుడు అని చెప్పుకొన్నగ సోమనాథుడు వర్ణించాడు. (26) 'ఆనాడు బసవడు' అని చెప్పినప్పుడు మల్లికార్జునుడు బసవేశ్వరుడు పూర్వుడన్నది స్పష్టం. కాని బసవేశ్వర మల్లికార్జునులు సమకాలికులే గాక సమ వయస్కులు కూడ అయి ఉండవచ్చునని సోమనాథుని వర్ణనలు సూచిస్తున్నాయి.

నిడదవోలు వేంకటరావుగారి వాదనను ఖండించిన నేలటూరి వెంకటరమణయ్యగారు మధ్యక్కరలు శైవకవుల సొత్తు మాత్రమే అని చెప్పడానికి వీలులేదని వైష్ణవ కవులు కూడ యీ ఛందస్సు వాడారని చెప్పారు. అంతే గాక 'గొరగ' అనే పదం వీరశైవ సంబంధి గాదని 'గొరగలు' వీరశైవం పుట్టడానికి ముందే శాసనాల్లో పేర్కొనబడ్డారని కూడ వీరు సూచించారు. (27)

'గొరగ' శబ్ద ప్రయోగం 'క్రీడాభిరామం' (28) లో కనిపిస్తుంది. మైలారభటుని గురించి ప్రస్తావించు సందర్భంలో గొరగ ఉపయోగించబడింది. 'గొరగ' అనగా శైవ భిక్షువు అని 'మైలార' అను క్షుద్ర దేవతకు గొంతెత్తి మొరపెట్టు మతనువాడని తెలుగు నిఘంటువు (29) నందు పేర్కొనబడింది. దేవాలయాల్లో పనిపాటలు చేసే శూద్ర పరివారకుడు 'గొరగ' అని కూడ తెలియవస్తుంది.

గొరగలనగా ఒక తెగ శైవ భిక్షువులని, వీరు కురుబా జాతికి చెందినవారని పశ్చిమాంధ్ర ప్రాంతంలో యిప్పటికీ వీరు గొరవయ్యలుగా కన్పిస్తారని డాక్టరు తూమాటి దొణప్పగారు (30) తెలిపారు. ఈ వివరాలను బట్టి చూస్తే 'గొరగ' అనే పదం వీరశైవానికి సంబంధించినది కాదని తెలుస్తుంది కదా!

కాబట్టి శ్రీపతి పండితుడు కీ. శ. 930 సం. ప్రాంతంలో ఉన్నవాడని చెప్పడానికి ప్రబలకారణమైన యుద్ధమల్లుని శాసనం. కాని ఆశాసనం శ్రీపతి పండితుని 'రచన' అని నిరూపించడానికి వెంకటరావుగారు చూపిన కారణాల్లో ఒకటి కూడ సమంజసమైన సాక్ష్యంగ ఉపకరించడంలేదు.

సోమనాథుడు అవంతపాలుని గురించి తెలిపి వ్రాయలేదని చెబుతూ అతని చారిత్రక పరిజ్ఞానాన్ని పూర్తిగ శంకించడం కూడ సమర్థనీయంకాదు. బసవేశ్వరుడు బిజ్జలుని కొలువులో బండారువుగ (31) ఉన్నాడని, మల్లికార్జున పండితుని సమకాలికునిగ పేర్కొన్న 'వెలనాటిచోడుడు (32) చరిత్రకు అందిన సత్యాలేగాని అభూత కల్పనలు కావు గదా!

శ్రీ పి. హయవదనరావు (33) గారు శ్రీపతి పండితుడు క్రీ. శ. 1400 సంవత్సర ప్రాంతంవాడని నిర్ణయించడానికి కారణం 'శ్రీకర భాష్యం' ద్వైత మత సిద్ధాంతాన్ని సమర్థించిందని, ద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన మధ్వాచార్యులు (ఆనంద తీర్థులు) క్రీ. శ. 1300—1400 మధ్య నివసించినట్లు తెలుస్తున్నది కాబట్టి 'శ్రీకరభాష్యం' మధ్వాచార్యుల తరువాత వెలువడి ఉండవచ్చునని భావించారు.

కాని వీరి వాదానికి 'శ్రీకరభాష్య' గ్రంథపీఠికలో గ్రంథకర్తకు ప్రతిపాదించిన విషయాలు ప్రబలమైన ప్రతిబంధకాలుగ నిలుస్తున్నాయి. ఇందులో పేర్కొనబడిన శ్రీపతి పండితుడు విజయవాడ నివాసి. శివభక్తిని చాటడానికి నిప్పుల చెంగులు వట్టినవాడు. ఇతడు మల్లికార్జున పండితుడు పేర్కొనిన శ్రీపతి పండితుడేగాని మరి యొకడుకాడు. కాబట్టి గ్రంథకర్త అయిన శ్రీపతి పండితుడు పన్నెండవ శతాబ్దానికి తర్వాత వాడుకాడని చెప్పడానికి 'శివతత్వసారం'లో ఇతని ప్రస్తావన ఉండడమే. కాబట్టి శ్రీపతి పండితుడు 1400 సం. ప్రాంతంలో ఉన్నవాడనే హయవదనరావుగారి అభిప్రాయం ఆమోదయోగ్యంకాదు. ఈ విషయంలో వీరి అభిప్రాయాలను నిశితంగా విమర్శిస్తూ శ్రీ పిడుకూరు నారాయణరావుగారు (34) 'మధ్వాద్వైతం' అని హయవదనరావుగారు పేర్కొన్నప్పటు 'మధ్వ' అన్నపదం వ్రాతప్రతిలో లేదని శ్రీపతి పండితుని కాలం క్రీ. శ. 1400 సం అని చెప్పడానికి సాధకంగా ఉంటుందని ఆ గ్రంథపరిష్కర్తలే ఆ పదాన్ని చేర్చి ఉంటారని, ద్వైతమత ఖండన ఆ గ్రంథంలో లేకపోలేదు 'ద్వైతం' అనేది పరస్పరవిజ్ఞానం అని, ఆనంద తీర్థుడు (లేక మధ్వాచార్యుడు) ద్వైత మత ప్రతిష్ఠాపకుడు మాత్రమే అని ఒకచోట, శ్రీకర భాష్యంలో అద్వైత సిద్ధాంత విమర్శయే విస్తృతంగ ఉన్నదని ఇతర సిద్ధాంతాల విమర్శ ఉన్నా ఆ సిద్ధాంతాలు రామానుజానంద తీర్థులు ప్రతిపాదించినవే అని చెప్పడానికి వీలులేదని మరొకచోట పేర్కొన్నారు. కాబట్టి వీరి సిద్ధాంతం ప్రకారం శ్రీపతి పండితుడు రామానుజునకు పూర్వుడనగా 12 వ శ. పూర్వుడై ఉండాలన్నదే.

కాని యీ వాదం నిరభ్యంతరంగ అంగీకరించడానికి వీలుకాదు. విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతాలు రామానుజ, మధ్వాచార్యులకు ముందే సూచన ప్రాయంగ ఉన్నప్పటికీ ఆ సిద్ధాంతాలను ప్రచారంలోకి తీసుకువచ్చింది వారేకదా! శంకరాచార్యునికి పూర్వమే 'అద్వైత' భావన ఉన్నప్పటికి ఆ సిద్ధాంతాన్ని బహుళ ప్రచారంలోకి తెచ్చిన శంకరుని పేరుతోనే 'అద్వైతం'' జోడించబడింది అదే విధంగ రామానుజుని పేరుతో 'విశిష్టాద్వైతం' మధ్వాచార్యుని పేరుతో 'ద్వైత' సిద్ధాంతము తెలియవస్తున్నది. శంకరాచార్యుని పేరు ఎత్తకపోయినప్పటికి మల్లికార్జున పండితుడు అద్వైతాన్ని తీవ్రంగా విమర్శించారు. (35) అందుకు కారణం మల్లికార్జునుని కాలానికి ఆ సిద్ధాంతం బహుళ ప్రచారం పొందడమే. ఏ సిద్ధాంతం అయినా పూర్తిగ రూపురేఖలు దిద్దుకొని అస్తిత్వస్థితిలో వున్నప్పటికంటే బాగా ప్రచారంలోకి వచ్చినప్పుడేకదా నిర్దిష్టమైన విమర్శలు జరుగుటపడడానికి అవకాశం ఉంటుంది. కాబట్టి శ్రీకర భాష్యంలో ఖండించబడిన యీ విమర్శలు 12 వ శతాబ్దానికి పూర్వమే అనగా ఆయా సిద్ధాంతాలు ప్రచారంలోకి రాకపూర్వమే, చేయబడినవని నిర్ణయించడం సబబుగ అనిపించదు.

వివాదగ్రస్తమైన ఈ సిద్ధాంతాల విమర్శను పక్కనపెట్టి, ఈ గ్రంథంలో ప్రస్తావితమైన వీరశైవమునకు సంబంధించిన విషయాలను ... కి అన

కున్నా 'శ్రీకర భాష్యం' 12 వ శతాబ్దానికి గాక ఆ తర్వాత కాలంలోనే వ్రాయబడి ఉండవచ్చుననిపిస్తుంది.

'వీర శైవ' పదనిర్వచనాన్ని ఆమత సిద్ధాంతాన్ని విపులంగా చర్చించి 'సిద్ధాంత శిఖామణి' పేరు, అందులో ప్రస్తావితాలైన విషయాలు శ్రీ కరభాష్యంలో పలు తావులలో ఉదహరించబడినవి. (36) కాబట్టి శ్రీ కరభాష్యం సిద్ధాంత శిఖామణి తరువాతనే రచింపబడిన గ్రంథం అని అనడంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు. అయితే సిద్ధాంత శిఖామణి రచనాకాలాన్నిగూర్చి పండితులలో ఏకాభిప్రాయం లేదు.

వీరశైవం బసవేశ్వరాద్యుపజ్ఞమేకాని అంతకు పూర్వంలేదు అని అభిప్రాయ పడిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సిద్ధాంత శిఖామణి బసవేశ్వరుని కాలం నాటికిగాని ఆ తరువాతగాని రచించబడి ఉండవచ్చునని చెప్పారు. (37) వీరి అభిప్రాయాంతో ఏకీభవించని శ్రీ బండారుతమ్మయ్యగారు సిద్ధాంత శిఖామణి క్రీ. శ. 960. సం. ప్రాంతం రచించబడి యుండవచ్చని పేర్కొన్నారు. (38) వాని అలా భావించడానికివారు చూపిన కారణాలు చారిత్రాంశాలుగ అంగీకరించుటకు వీలులేదు.

'సిద్ధాంతశిఖామణి'లో తెలుపబడిన విషయాలను పరిశీలిస్తే అది బసవేశ్వరునికి పూర్వం రచించబడిన గ్రంథం అని అనిపించదు. 'వీరశైవా'నికిముఖ్యమైన 'షట్స్థల సిద్ధాంత' ప్రసక్తి బసవేశ్వరునిపూర్వం ఉన్న గ్రంథాల్లో ఎక్కడ కన్పించడంలేదు. సిద్ధాంత శిఖామణి 'ఆ సిద్ధాంతాన్ని' అతి స్పష్టంగ పేర్కొన్నది కాబట్టి సిద్ధాంత శిఖామణి బసవేశ్వరునికి పూర్వం ఉన్న గ్రంథం అని అనడం చెల్లదు.

అంతేగాక ఈ గ్రంథం "తపరమ జాతిధర్మముల ననుసరించి ఆచార నిష్ఠులగు వీరశైవులు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు తమకు సజాతీయులైన వారియింద్లయందే భుజింపవలెనని ఏ నాడును ఇతరుల యిండ్ల భుజింపరాదు"ని స్పష్టముగ నిర్దేశిస్తుంది. (39) ఈ హెచ్చరికను గమనించినచో శివ భక్తి గలిగి దీక్షపొందిన వారందరు ఈశ్వరకుంజరే (39ఎ) అని బోధించి అనాదినుండి ఎంతో పటిష్ఠంగా సమకూర్చుకున్న కులవ్యవస్థను రూపు మాపడానికి బసవేశ్వరుడు ఉద్దేశించిన సాంఘిక విప్లవాన్ని సున్నితంగా ప్రతిఘటించడమే ఈ గ్రంథ లక్ష్యంగా కనిపిస్తుంది.

వీరశైవం బసవేశ్వరునికి పూర్వమే ఉన్నదన్న అభిప్రాయం గల డాక్టరు నంటల్‌గారు (40) కూడ సిద్ధాంత శిఖామణి బసవేశ్వరునికి పూర్వమేరచించ బడిన గ్రంథమని అంగీకరించినట్లు కన్పించదు. బసవేశ్వరునికి పూర్వమున్న వీరశైవాఙ్మయాన్ని గురించి ప్రస్తావిస్తూ బసవేశ్వరునికి పూర్వమున్న వీరశైవ సంస్కృత సారస్వతం స్వల్పమైనదని, నిర్దిష్టంగ చెప్పడానికి వీలుపడదని ప్రస్తుతం లభ్యమౌతూ ఉన్న సంస్కృత వాఙ్మయం అంతా బసవేశ్వరుని కాలానికి గాని ఆ తరువాతగాని ఉద్భవించి ఉండవచ్చని సూచించారు. సిద్ధాంత శిఖామణి బసవేశ్వరుని ముందే వ్రాయబడిన గ్రంథమని అభిప్రాయపడి ఉన్నట్లైతే ఆ విషయాన్ని చె ఉండేవారేకదా !

కొల్లిపాకయందలి సోమేశ్వరలింగం నుండి ఉద్భవించిన రేవణారాధ్యుడు వీరశైవాన్ని ప్రబోధించాడని సిద్ధాంతశిఖామణి తెలుపుతుంది. (41) కొల్లిపాక శివలింగంనుండి ఉద్భవించిన రేవణసిద్ధ పంచాచార్యులలో ఒకరని స్వయంభువాగమం పేర్కొంటున్నది. (42) అతి ప్రాచీనకాలంలోనే పంచాచార్యులు వీరశైవాన్ని ప్రబోధించారన్నవాదాన్ని అతివిపులంగ చర్చించి విమర్శించిన శ్రీ ఎం. ఆర్. "సాకరె" (43) అభిప్రాయం ప్రకారం పంచాచార్యులు ప్రాచీనులు, కల్పితవ్యక్తులుగాని కారని వారిలో కొందరు బసవేశ్వరునికి సమకాలికులు, మరికొందరు తర్వాతవారని వ్రాసారు. సిద్ధాంతశిఖామణియందు, పేర్కొనబడిన (పంచాచార్యులలో ఒకరైన) రేవణసిద్ధ బసవేశ్వరునికంటె పెద్దవాడైన సమకాలికుడని 'హరిహరుడు' రచించిన 'రేవణసిద్ధరగళె' యందు రేవణసిద్ధ వీరశైవుడని వర్ణింపబడలేదని అతడు శైవుడనే తెలియవస్తుందని వ్రాశారు. ఈసమాచారాన్నిబట్టి చూచినా సిద్ధాంత శిఖామణి బసవేశ్వరుని తర్వాత వ్రాయబడిన గ్రంథమనేవాదాన్ని బలపరచవలసి వస్తుంది.

సిద్ధాంత శిఖామణిని పేర్కొన్న 'శ్రీకరభాష' గ్రంథకర్త రేవణసిద్ధ మరుళసిద్ధ, ఏకోరామసిద్ధలను పేర్కొన్నాడు. ఆగమాలు పేర్కొన్న పంచాచార్యులలో ఈ మూడు పేర్లు కన్పిస్తవి. కాబట్టి శ్రీకరభాష్య రచనా కాలానికి పంచాచార్యుల సిద్ధాంతం రూపొందినట్లుగ కన్పించదు. ఈ గ్రంథంలో పేర్కొన బడిన ముగ్గురు వ్యక్తులను వీరశైవ ప్రబోధకులుగ కూడ గ్రంథకర్త పేర్కొనలేదు.

బసవేశ్వరునికి పూర్వమే పంచాచార్యులు వీరశైవాన్ని ప్రబోధించారన్న వాదం బసవేశ్వరుని కాలానికి గాని పాల్కురికి సోమనాథుని కాలానికి గాని చోటు చేసుకున్నట్లు కన్పించదు. వీరశైవాన్ని ప్రబోధించడానికి శివుడే నందీశ్వరుని, బసవేశ్వరుని రూపంలో భూలోకానికి పంపించాడని సోమనాథుడు వర్ణించాడు. (44) పంచాచార్యుల గురించి యితని గ్రంథాల్లో ఎక్కడా ప్రస్తావించలేదు. సకల వేదాగమశాస్త్ర పారంగతుడైన పాల్కురికి సోమనాథుని కాలానికి అట్టి సిద్ధాంతం ఒకటి ఉన్నట్లయితే అతని దృష్టిలోకి తప్పక వచ్చి వుండేదే.

పంచాచార్యుల వాదం గురించి ముచ్చటిస్తూ డాక్టరు పి. బి. దేశాయ్ గారు, (45) క్రీ. శ. 1369 లో రచించబడిన కన్నడ బసవ పురాణంలోగాని 1450 లో వెలువడిన శివతత్వ చింతామణిలో గాని పంచాచార్యుల ప్రశక్తి లేదని కాబట్టి ఈ వాదం విజయనగర పరిపాలనా కాలం ఉత్తర భాగంలో అనగా షుమారు 16 వ శతాబ్దంలో ప్రబలి ఉంటుందని తెల్పారు.

ఈ సమాచారాన్ని బట్టి చూస్తే సిద్ధాంత శిఖామణి పేర్కొన్న రేవణాచార్య, శ్రీకరభాష్యంలో పేర్కొనబడిన రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ సిద్ధలు క్రమంగా పండితారాధ్య విశ్వారాధ్య పేర్లను కలుపుకొని విజయనగర పరిపాలనా కాలానికి అనగా 16 వ శతాబ్దానికి పంచాచార్యుల సిద్ధాంతంగా రూపు దిద్దుకున్నట్లు కన్పిస్తుంది. కాబట్టి శ్రీకరభాష్యం 'సిద్ధాంతశిఖామణి' తర్వాతను 16 వ శతాబ్దానికి పూర్వం, వ్రాయబడిన గ్రంథం అయి వుండవచ్చు. ఈ సందర్భంలో శ్రీకరభాష్యం క్రీ. శ. 1400. సం. ప్రాంతంలో రచింపబడివుండ వచ్చునన్న హయవదనరావుగారి వాదం ఆమోదయోగ్యమనే అనిపిస్తుంది.

## గ్రంథ కర్తృత్వము

క్రీ. శ. పన్నెండవ శతాబ్దానికి చెందిన వాడని తెలియవచ్చిన శ్రీపతి పండితుడు ఆ తర్వాత కాలంలో రచించబడిన గ్రంథానికి కర్త కాడనే విషయం స్పష్టమవుతుంది. పండిత త్రయంలో శ్రీపతి పండితుడు 'శ్రీకరభాష్య' కర్త కాడని వేటూరు ప్రభాకర శాస్త్రి గారు లోగడ ప్రకటించి వున్నారు. (46) డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారూ (47) అట్టి అభిప్రాయాన్నే ప్రకటించారు. ఈ గ్రంథం పేరులో సూచింపబడిన 'శ్రీకర' అనునది గ్రంథకర్త పేరు అయివుండవచ్చని లేక 16 వ శతాబ్దానికి చెందిన ఒక శాసనంలో పేర్కొనబడిన 'శ్రీ పత్యాచార్యుడు' శ్రీకరభాష్య గ్రంథకర్త అయి ఉండవచ్చని, పండిత త్రయములోని శ్రీపతి పండితుడు మాత్రం కాదని సూచించారు.

శ్రీకర భాష్యం శ్రీపతి పండితుని రచనయే అని తాము విశ్వసిస్తున్నట్లు చిలుకూరు నారాయణరావుగారు (48) ప్రకటించారు.

బండారు తమ్మయ్యగారు మొట్టమొదట శ్రీపతి పండితుడే శ్రీకరభాష్య కర్త అన్న అభిప్రాయంతో ప్రభాకర శాస్త్రిగారి అభిప్రాయాన్ని తీవ్రంగా విమర్శించారు. (49) కానీ ఆ తరువాత తమ మిత్రుడైన టి. హెచ్. సదాశివయ్యగారు శ్రీకరభాష్యం శ్రీపతి పండితుని రచన కాదన్న విషయం గురించి సేకరించి అందజేసిన సమాచారాన్ని ఈ క్రింది మాటల్లో తెలియజేశారు. (50)

"శ్రీకరభాష్యం వాస్తవంగా శ్రీపతి పండితారాధ్యుడు రచించినది కాదని బసవేశ్వర పంచాచార్య పార్టీలు కర్ణాటక దేశమున ప్రబలముగ రేగిన రోజులలో శ్రీపతి పండిత కాశీనాథశాస్త్రిగారు సికింద్రాబాదునందు సమర్థుడగు ఒక్క బ్రాహ్మణ పండితునిచే వ్రాయించి శ్రీపతి పండితారాధ్య కృతముగా కల్పించిన గ్రంథమని ఆ విషయమును ఆ పండితుని కుటుంబం వారినుండి వాగ్మూలమును తీసుకున్నామని నా మిత్రులు టి. హెచ్. సదాశివయ్యగారు అనేక పర్యాయములు ముచ్చటించారని శ్రీకరభాష్య కర్తృత్వం యింకనూ వివాదగ్రస్తముగనే ఉన్నదని' వ్రాశారు.

ఈ విషయంలో సత్యాసత్యాలు ఎలా ఉన్నా శ్రీకరభాష్యం క్రీ. శ. పన్నెండవ శతాబ్దానికి తర్వాత వ్రాయబడిన గ్రంథమని శ్రీపతి పండితుడు 12 వ శతాబ్దానికి చెందినవాడని, శ్రీకరభాష్యం యితని రచన గాదని, శ్రీపతి పండితుడు బోధించిన శైవం వీరశైవమని నిరూపించడానికి మల్లికార్జున పండితుని, సోమనాథుని రచనలు ఉపకరించుట లేదని చెప్పవచ్చు. శ్రీకరభాష్య గ్రంథకర్త అయిన శ్రీపతి పండితుడు విశాఖార వీరశైవ యతిపేదాగమాలయందు, ద్వైతాద్వైత సిద్ధాంతములందు పరిపూర్ణమైన జ్ఞానముకలవాడు, శివలింగమునందు అచంచలమైన విశ్వాసము కలవాడును, శిష్యులకు శివతత్వములోని ఇష్టలింగ, భావలింగ, ప్రాణలింగ భావములను గురించి కూలంకషముగ వివరించి వారిని ప్రమాదాసపరచగలిగి సామర్థ్యము కలవాడని తెలుస్తుంది. (51) కాని పండిత త్రయంలోని శ్రీపతిపండితునికి యీ పదజాలం వర్తింపచేయటానికి ఉపకరింప ఏ శాసనాలు 'శివతత్వ సారం'లోగాని, మల్లికార్జున పండితారాధ్య చరిత్రలో గాని కల్పించుట లేదు. అందువలన శ్రీ కరభాష్య కర్తృత్వం శ్రీపతి పండితునికి ఆపాదించుట తగదని తెలుస్తుంది.

## అధోజ్ఞాపికలు:

1. దీక్షా ప్రకరణము—పు.7
2. హరభక్తి యుత్పత్తి కాధిపతి నా బరగె దా దొల్లి శ్రీపతిపండితయ్య Ibid.
3. పుట. 79 వీరి అభిప్రాయాలను గురించి ప్రస్తావించిన శ్రీ బండారు తమ్మయ్యగారు శ్రీపతి పండితుడు బసవేశ్వరునకు యించుమించుగ ఒక శతాబ్ది పూర్వుడని ప్రభాకర శాస్త్రిగారు బసవపురాణ పీఠికలో 63— 74 పుటలలో వ్రాసినట్లుగ "ఆచార్య పండితుడు 154 పుట. వ్యాసావళి. ద్వితీయ భాగం" నందు తెలిపారు. అది సరికాదు.
4. శ్రీపతి పండితుడు. పుట. 4. వాఙ్మయ వ్యాసమంజరి.
5. ఆంధ్ర కవి తరంగిణి. పు. 21.
6. శ్రీపతిపండితుడు 1162—67 సం. లలో బసవేశ్వరుని దర్శించినట్లుగా దేశాయ్‌గారు పేర్కొనలేదు. కాని వీరశైవోద్యమము ఉచ్ఛస్థితికి చేరుకున్న కాలంలో అని వ్రాశారు. పు. 190. **Basaveswara and his times.**
7. **Ibid.** పుట. 191.
8. **Srikarabhashya Vol. I. Introduction.** వీరి నిర్ణయాన్ని టి. ఎం. పి. మహాదేవన్ గారు కూడ అంగీకరించినట్లుగా కన్పిస్తుంది. **Saivism P. 556 Bharatiya Vidya bhavan's History and Culture of the Indian People. Vol. VI**
9. **Introduction P. 31.**
10. (1) శ్రీపతిపండితుడు **Lives of Telugu Poets. P.P.68-82**
    (2) శివతత్వ సారపీఠిక. పు. 63 (కృష్ణాపత్రికా కార్యాలయము)
    (3) 'శివజ్యోతి'. గ్రంథ సమీక్ష. భారతి— జులై '74.
11. verse నెం. 406. శివతత్వసారము.
12. బసవేశ్వరుడు, మల్లికార్జున పండితుడు యించుమించు ఒకే కాలంలో జన్మించినట్లు దీక్షా ప్రకరణము. 25 పుటలోను— బసవేశ్వరుని అనంతరం కొద్ది కాలానికే మరణించినట్లు పర్వత ప్రకరణము. పు 45 అందును సూచింపబడినది.
13. **Ibid PP.** 298—299.
14. (1) బసవేశ్వరుడు లింగైక్యము చెందినది సుమారుగ 1167—68 సం.లలో అని పండితారాధ్యుడు ఆ తరువాత కొద్దికాలానికే మృతి చెంది ఉంటారని (సోమనాథుడెప్పటివాడు ? పరిశోధన ఆగస్టు—నవంబరు 1955) శ్రీ బండారు తమ్మయ్యగారు, నిడదవోలు వెంకటరావుగార్ల అభిప్రాయం. **P. 18, Intro.** శివతత్వసారము.
    (2) బసవేశ్వరుడు, మల్లికార్జున పండితుడును క్రీ. శ. 1184 వరకు జీవించి ఆ తరువాతనే లింగైక్యము చెంది ఉందురని డా. నేలటూరి వెంకట రమణయ్యగారు ప్రకటించారు. "పాలకురికి సోమనాథు డెప్పటివాడు ?" ప్రత్యేక గ్రంథము. వావిళ్ల వారిముద్రణ.

(3) శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణగారు వెంకటరమణయ్యగారి అభిప్రాయాన్ని అనుసరించినట్లున్నారు. పండితారాధ్య చరిత్ర—కొన్ని సంశయములు. భారతి – July '74.

15. సప్తమాశ్వాసము P. 210. Edited by చి. ప్రభాకరశాస్త్రి

16. మహిమ ప్రకరణము P. 86.

17. ఆంధ్రదేశపు పరుస—పర్వత ప్రకరణము. P. 375.

18. పురాతన ప్రకరణము. P. 407—408.

18 (ఎ) వేటూరి ప్రభాకరశాస్త్రి Introduction to 'Basava Puranam'

19. డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య—శ్రీపతి పండితుడు Ibid.

20. Religion in Andhra, P. 187—188.

21. Ibid. P. 32.

22. 'శ్రీపతి పండితుడు' Ibid.

23. హరి వీరశైవు డన్నందుకు మరియు గర్భాధానఖండనమే ప్రథమ సాక్షి
హరి వీరశైవుడన్నందుకు దననేత్ర కమలమొసంగిన క్రమము సాక్షి
హరివీరశైవుడన్నందుకు శంకరుచేత బొందిన శివనీతిసాక్షి
హరి వీరశైవుడన్నందుకు శ్రీసాంబుడనేడి పుత్రునిబడసినదే సాక్షి
Verse 87.

24. బెజవాడ యుద్ధమల్లునిశాసనము E. I. Vol. XV, P. 150–159.

25. Ibid.

26. దీక్షా ప్రకరణము. 256
"జంగమప్రాణి నాసద్భక్తిబరగె భంగిగా సంగన బసవన్న నాడు
వసుధజంగమ పారవశ్యసద్భక్తి యసలార నీకు లోకారాధ్య నేడు"

27. Ibid.

28. క్రీడాభిరామము. P. 27 వావిళ్లవారి ప్రచురణ.

29. సూర్యరాయాంధ్ర నిఘంటువు.

30. తెలుగు శాఖా ఆచార్యులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం వారినుండి ముఖాముఖి తెలుసుకున్న విషయం.

31. ద్వితీయాశ్వాసము. బసవపురాణము.

32. పాదప్రకరణము. శ్రీ మల్లికార్జున పండితారాధ్య చరిత్ర.

33. Ibid.

34. Idid. pp. 30—31.

35. అద్వైత ఖండన Verses 31—66 శివతత్వసారము.

36. "ఇత్యాది పారాశరస్మృతి సిద్ధాంత శిఖామణ్యాదాలింగాంగి....." P. 26

37. Ibid.

38. వ్యాసావళి. ద్వితీయభాగము. P. 177

39. తొమ్మిదవ పరిచ్ఛేదము 29

39 (ఎ) The English translation of all the verses of Basavanna. By L. M. A. Menezes,
S. M. Angad.

40. P. No. 2. A hand book of Virasaivism.

41. అథ త్రిలింగ విషయే కుల్యపాకాభిదేస్థరే సోమేశ్వర మహాలింగాత ప్రాదురాసీత సరేణుకః...1. చతుర్థపరిచ్ఛేదం, మరియు పంచమ పరిచ్ఛేదము.

42. M. R. Sakhare. History and Philosophy of Lingayat religion being an introduction to Lingadharana Chandrika.

43. Ibid.

44. ప్రథమాశ్వాసము. బసవపురాణం.

45. Ibid. P, 330.

46. Ibid.

47. Ibid.

48. Ibid. P. 31.

49. వ్యాసావళి. ద్వితీయ భాగం P. 153—154.

50. ఆంధ్రభాషా సారస్వత పరిషత్ పత్రిక Vol. 52, Part I, P. 9

51. Introduction to Srikara Bhashya.


C. Hayavadana Rao.



# కలగూరగంప



## శ్రీ నిడదవోలు వారికి సమాధానం : మనవి

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ పక్షాన ప్రచురితమైన

'ఆంధ్ర మహాభారతము—సంశోధిత ముద్రణము'ను గూర్చి శ్రీ నిడదవోలు వేంకటరావుగారు సమీక్షాత్మకంగా 'భారతి'లో చాలా వ్యాసాలు రాసారు. వాటిలో 'సంశోధిత మహాభారతము—అనుశాసనికపర్వము' అన్న వ్యాసం (భారతి. మార్చి, ఏప్రిల్ 74) ఒకటి. అయితే, మొత్తం ఈ వ్యాసాలగూర్చి నేనేమీ రాయదలచుకోలేదు. ప్రస్తుత వ్యాసం మొత్తాన్ని గూర్చి కూడా ప్రస్తావించ బోవటంలేదు. అనుశాసనిక పర్వానికి పీఠికాప్రాయంగా ఆ భారత సంపాదకులు చేర్చిన వ్యాసాల్లో ఛందోవిషయికంగా ఉన్న నా వ్యాసాన్ని తమ వ్యాసభాగం (ఏప్రిల్ 74. భారతి)లో శ్రీ నిడదవోలువారు పరమఘాటుగా విమర్శించారు. ఆ విమర్శలోని అనౌచిత్యాన్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తాను.

శ్రీ నిడదవోలువారు పరిశోధన రంగంలో ఏండ్లుగా పనిచేస్తున్న 'పరిశోధన పరమేశ్వరులు' ఆమధ్య ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారివల్ల 'కళా ప్రపూర్ణ'లయినారు. అస్మదాదులకు గౌరవనీయులు. కాని వారి విమర్శరీతి పైవాటికి ఏ విధంగానూ ఉచితంగా ఉండటంలేదు. అందుకని వారిపై నిండు గౌరవంతోనే ఇది రాయవలసివస్తున్నది.

మొట్టమొదట వారికి స్పష్టం చేయవలసిన అంశం ఒకటిఉంది. అనుశాసనిక పర్వానికి పీఠికాప్రాయంగా ప్రచురితమయిన వ్యాసాల్లో నా వ్యాస శీర్షిక 'కవిత్రయ భారతము—ఛంద: ప్రయోగము' అని. అయితే 'ఛంద: ప్రయోగము'నకు బదులు 'ఛంద: ప్రయోజనము' అని పరిశోధన పరమే శ్వరులు పఠించారు. దీనితోనే వారి విమర్శ తప్పుదారిపట్టింది. కనీసం వ్యాస శీర్షికనుకూడా సరిగా చదువక, ఆ వ్యాసాన్ని విమర్శించేటంత దుస్సాహసం నాకు లేదని మనవి.

సరే, శీర్షిక విషయం అట్లా ఉండగా, నా వ్యాసంలోని అయిదు అంశా లను వారు 'విమర్శిం'చి, 'నా ఛందశ్శాస్త్ర పరిజ్ఞాన మింకను బాల్యదశ దాట లేదని.....ఇట్టివారు మహాభారతము—ఛంద:ప్రయోజనము అనువ్యాసము వ్రాయుట కెట్లుద్యమించిరో దురూహ్యము' అని అతిగా ఆశ్చర్యపడిపోయినారు. (ఈ స్థితిలో నా వ్యాస శీర్షికకు మరొక అవతారం వచ్చింది) అయితే, నా పరి జ్ఞానం ఏ దశలో ఉన్నదో నాకు తెలుసు. నన్నెరుగనితనం నాకెప్పుడూలేదు. అదీగాక సహృదయులకు నా పరిజ్ఞానదశ తెలుసు. తెలియంది ఒక్క కళా ప్రపూర్ణులకనేమో. అందుకనేవారు విమర్శించిన అయిదంశాలను గూర్చి క్రమంగా ఉచిత రీతిలో రాస్తాను.

1. 'ఈనాటికిని మార్గ—దేశి విభాగమొక వివాదాంశముగనే యున్నది. స్థూలముగా చెప్పుకున్నచో . . ఛందస్సుకు సంబంధించినంత వరకు మార్గ చ్ఛందస్సులనగా సంస్కృతమునకు సంబంధించినవని, దేశిచ్ఛందస్సులనగా దేశీయ (ప్రాంతీయ) మైన భాష, తెలుగు ఛందస్సులని చెప్పికొనవచ్చును' అని నా వ్యాసంలో రాసాను. దీనిపై కళాప్రపూర్ణుల ఆక్షేపణ ఏమిటంటే:— 'తెలుగు ఛందో లక్షణ గ్రంథములలో దేనియందు మార్గ—దేశి ఛంద స్సుల ప్రస్తావమున్నది?' అని. ఈ ఆక్షేపణలోని ఔచిత్యం ఏమిటో అర్థం కావటంలేదు. నేను రాసింది ఛందో లక్షణ గ్రంథాలను గూర్చిన సమీక్షా వ్యాసం కాదు. కవిత్రయంవారి ఛంద: ప్రయోగాన్ని గూర్చిన వ్యాసం అది. అందులో ప్రాస్తావికంగా నా అభిప్రాయం ప్రస్తావించాను. ఈ ప్రస్తావనకు, ఆ అం శం 'ఛందో లక్షణ గ్రంథములలో' ఉండవలసిన అవసరం ఏమిటి? పరిశో ధన పరమేశ్వరులు తాము ఛందో విషయికంగా రాసిన వేరు వేరు వ్యాసాల్లో ప్రస్తావించిన అంశాలన్నీ 'ఛందో లక్షణ గ్రంథములలో' ప్రస్తావించబడ్డ వేనా? వారు తమ వ్యాసాల్ని మరొకసారి చదువుకోవటం అవసరం.

ఇక, చంపకోత్పలమాలా పద్యాలు రెండు సంస్కృతీయ వృత్తాలని నా వ్యాసంలో రాసాను. కావని వారి నిష్కర్ష. కారణం, ఆ రెండూ సంస్కృ తంలో ఉపయుక్తం కాకపోవటం. ఈ అంశం నా వ్యాసంలో రాయనే రాసాను. '. . . అయితే ఈ రెంటికి సంస్కృతమున ప్రయోగము దాదా పుగా లేదనవచ్చును. ఎనిమిది తొమ్మిది శతాబ్దములకు చెందిన రాజశేఖరాదులు కొందరు చంపకోత్పల మాలలను సంస్కృతమున ప్రయోగించిరనగా, దానికి, వారికి ముందే కన్నడమున ఈ పద్యముల ప్రయోగపు విరివి యొక్క ప్రభావము కారణము కావచ్చును. . .' (పు. 29) అని నా వ్యాసంలో ఉంది 'సంస్కృతమున రెండపూర్వ వృత్తములు' అన్న శ్రీ ఊయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారి వ్యాసమూ, నిడదవోలు వారు తమ వ్యాసంలో ఉదాహ రించిన 'అరినృపవాజివీరణ . . .' అన్న గుణక విజయాదిత్యుని శాసన పద్యమూ నాకు తెలియనివేమీ కావు. వాటిని గూర్చి నా 'తెలుగు ఛందో వికాసము' (పు. 39, 58)లో చూడవచ్చు. అసలు, ప్రస్తుతాంశం ఏమిటంటే, ఈ రెండు వృత్తాలూ సంస్కృతీయాలా, కావా అన్నది. సంస్కృతంలో వాటికి ప్రయోగంలేదు కాబట్టి కావని కళాప్రపూర్ణుల వాదు. కాని, సరికాదు. ఎందుకంటే, 26 ఛందాలూ, ఒక్కొక్క ఛందంలో ఇన్నిన్ని ఈయీ రకమైన వృత్తాలూ, వాటిలో కొన్నింటికి ఉదాహరణలూ . . . మొదలయిన అంశాలను సంస్కృత ఛందో లాక్షణికులు వివరించారు. ఆ విధమయిన పద్ధతిలో నిష్పన్నమైనవన్నీ సంస్కృతీయాలే. సంస్కృత ఛందో లాక్షణికులు లక్షణం చెప్పిన వృత్తాలన్నీ, ఒక్కటి కూడా వదలకుండా సంస్కృత కవుల రచనల్లో ఉపయుక్తం కాలేదు. ఈ సందర్భంలో ప్రసిద్ధ పరిశోధకులు శ్రీ వెల్చేరు రాసిన ఈ వాక్యాలు గమనించదగినవి ఉంటుంది.

I have analysed matrically the Maha Kavyas of about 23 Mahakavis from Aswaghosha(2nd Century A. D.) to Shivasharmin (16th Century A. D). From this anolysis it has been found out that out of 600 varnavrittas only about 100 seem to have been actuaally used by the poets and even out of this 100, hardly more than 25 were employed with any frequency, e. g. for the composition of a canto in a poem, while the rest were used only for a change or ornamentation...' (Introduction to 'Jayadanam' pp.56)

అని ఆయన రాసారు. కాగా, ఆరువందల వృత్తాల్లో, అయిదు వందల వృత్తాలకు ప్రయోగమే లేదని స్పష్టం. మరి ఈ అయిదు వందలు కూడా సంస్కృతచ్ఛందో లాక్షణికులు లక్షణం చెప్పినదే. మరి వీటికి సంస్కృత సాహిత్యంలో ప్రయోగం లేదు కాబట్టి, ఈ అయిదు వందల వృత్తాలూ సంస్కృతీయాలు కానవటం కుదురుతుందా? అందువల్ల, వాటికి సంస్కృతంలో ప్రయోగం ఉన్నదా, లేదా అన్నది ప్రధానం కాదు. ఆ పద్ధతిలో నే అవి నిష్పన్నమయినవా, కాదా అన్నది ముఖ్యం. ఈ దృష్ట్యా, చంపకోత్పలమాలలు సంస్కృతీయాలే. గమనించవలసిన మరొక అంశం ఏమిటంటే— శశివదన, సరసి, సలిలనిధి అన్న పేర్లలో, 'చంపక మాల' సంస్కృత ఛ్ఛందో గ్రంథాల్లో చెప్పబడింది. (చూ. శ్రీ రావూరి దొర సామి శర్మగారి తెలుగు భాషలో ఛందోరీతులు' పు. 70) కన్నడంలో ఛందో విమ ర్శకులు కూడా చంపకోత్పలమాలలను సంస్కృతీయాలుగానే నిర్ణయించారు. (చూ. శ్రీ డి. ఎస్. కర్కి గారి' కన్నడ ఛందోవికాస. పు. 105) అందువల్ల, చంపకోత్పలమాలా వృత్తాలు సంస్కృత రచనల్లో ప్రయుక్తాలయినా, కాకున్నా సంస్కృతీయాలే. 'వృత్త' మన్న పదం సంస్కృతీయాల విషయంలోనే ఉప యుక్తమవుతున్నది. ఈ రెండూ 'వృత్తా'లే మరి. విన్నకోట పెద్దన, అప్పకవి 'ఉత్సాహ'మన్న దేశీయ పద్యాన్ని వృత్తమనటం 'అనాలోచిత'మని శ్రీ రావూరి వారన్నారు. (చూ. తె. భా. ఛం. రీ. పు. 153) మరి ఈ అంశాలన్నీ కళాప్రపూ ర్ణులు గమనించాలె—.

2. . . . శార్దూల విక్రీడిత, స్రగ్ధరా, మహాస్రగ్ధరలకు సంస్కృతమున విరివిగా ప్రయోగమున్నది. మత్తేభ విక్రీడితమునకు చాలా తక్కువ. . ' అని నా వ్యాసంలో ఉంది. ఈ అంశాన్ని కళాప్రపూర్ణులిట్లా విమర్శించారు. . . 'అసలు సంస్కృతమున మత్తేభ విక్రీడితమునకు ప్రయోగమున్నదా? లేదు. అది చంపకోత్పలములవలె— సంస్కృతీయము కాదు' అని అంతటితో ఆగకుండా క్రీ. శ. 634 నాటి రెండవ పులకేశి అయిహోలు శాసనంలోని, సంస్కృత భాషలో ఉన్న మత్తేభ విక్రీడితాన్ని ఉదాహరించి '. . . దీనిననుసరించి కన్నడ కవులు — తొలుత — కన్నడచ్ఛందస్సులో పద్యమునకు నియతమైన 'ప్రాస'ను పాటించి మత్తేభ వృత్తము వ్యాప్తికి దెచ్చిరి. మత్తేభవృత్తము సంస్కృతము కాదని సారాంశము' తేల్చిరాసారు. ఈ రాత చిత్రంగా ఉంది. కన్నడంలోకన్న ముందే సంస్కృతంలో ప్రయుక్తమైన మత్తేభవిక్రీడితాన్ని వారే ఉదాహరిం చారు. మళ్లీ సంస్కృత భాషలో దీనికి ప్రయోగం లేదని, ఇది సంస్కృతీయం కాదని పారం తేల్చుతున్నారు. ఉదాహృత పద్యకర్త 'రవికీర్తి' దాక్షిణాత్యకవి. అయితే ఏమైంది ? దాక్షిణాత్యకవి సంస్కృతంలో ఆవృత్తాన్ని ప్రయోగిస్తే అది సంస్కృతీయం కాకుండా పోతుందా? సంస్కృతం ఔత్తరాహుల గుత్త సొమ్మేమీ కాదు. ఇదిటా ఉండగా, ఆ 'రవికీర్తి' మత్తేభాన్ని అటు కన్నడంలో కానీ, ఇటు తెలుగులో కానీ చూచి రాయలేదు గదా! ఆ వృత్త రచన సంస్కృతంలో జరిగినాకనే, కన్నడంలోకి వచ్చిందని కళాప్రపూర్ణులే అంటున్నారు. మరొకటి కన్నడ ఛందో విమర్శకులు ఈ మత్తేభ వృత్తాన్ని కూడా సంస్కృతీయంగానే నిర్ణయించారు. (చూ. క. ఛం. వి. పు. 105) అసలు స్థితి ఇట్లా వుండగా పరి శోధన పరమేశ్వరులు స్వవచన వ్యాఘాతంగా ఎట్లా రాసారో మరి. అది వారికి అలవాటుగా ఉన్నట్లుంది. ఇంతకూ మత్తేభవిక్రీడితం సంస్కృతీయ మన్నది 'సారాంశము'.

3. ద్విత్వమకార— బిందు పూర్వక బకారాలకు ప్రాస చెల్లుబడివి గూర్చి నేను రాసిందానిపై కళాప్రపూర్ణులు అనవసరంగా చాలా రాసారు. నన్నయ గారి 'ఇమ్ముగ సర్వలోక జనులెవ్వనియేని. . . ' (ఆది. 1—77) అన్న పద్యంలో ఈ విధమయిన ప్రాస చెల్లిందని లాక్షణికులు చాలా మంది అంటున్న మాట నిజమే. ఈ సందర్భంలో నేను పరిష్కరించగా సాహిత్య అకాడమీ వారు ప్రచు రించిన 'లక్షణసార సంగ్రహం'లో నుంచీ, అప్పకవీయంలోనుంచీ కళాప్రపూ ర్ణులు పద్యాలుదాహరించటం అనవసరం. అయితే, పై పద్యంలో 'ఇమ్ముగ' అన్న పదమే ప్రయుక్తమైందని నిర్ధారణ అయినప్పుడే— ఆ ప్రాస ఉపయుక్త మైందనవలసి ఉంటుంది. చాలామంది లాక్షణికులు అట్లాగే అనుకొని, ఆ ప్రాసను చెప్పారు. కాని, 'ఇమ్ముగ'కు బదులు 'ఇంబుగ' అని ప్రయుక్తమై వుంటే, అక్కడ ప్రాస విశేషం ఏమీ ఉండదు. కూచిమంచి తిమ్మకవి అభిప్రా యంతో నేను ఏకీభవించనంత మాత్రాన, ఆయన గ్రంథాన్ని పరిష్కరిస్తూ, ఆయన పద్యాన్ని మార్చే కూటనీతి అస్మదాదులు ప్రయోగించే దుస్సాహసం చేయరు. అందుకనే ఆ గ్రంథానికి నేను రాసిన 'సమీక్షణము'లో ఈ అంశాన్ని గూర్చి విపులంగా చర్చించాను. (చూ. పు. 43—48) పై నన్నయగారి పద్యంలో 'ఇంబుగ' అని ప్రయుక్తమయిందని నా అభిప్రాయం. అందుకే 'ఇంబుగ' అని ఉండటంలోని సామంజస్యాన్ని వివరించాను. వివరిస్తూ— ఇదిగాక, ద్విత్వమకార మునకు బిందు పూర్వక బకారమునకు ధ్వని సామ్యము లేదు. ఇది లేని ప్రాస నన్నయగారు ఉపయోగించలేదు. ' అని రాసాను. అయితే 'బిందు పూర్వక బకారము ' నకు బదులు '—మకారమునకు' అని నా వ్యాసంలో ముద్రారాక్ష సుడు మార్చాడు. కాని, సందర్భమూ, ప్రసక్తీ అంతా బిందు పూర్వక బకారానికి సంబంధించింది. అందువల్ల ఏ మాత్రం సామాన్య పరిజ్ఞానంతో చూచినా, అది అచ్చు తప్పు అని స్పష్టమవుతుంది. మరి పరిశోధన పరమేశ్వరులు కెందుకు అర్థం కాలేదో తెలియదు. మొత్తం మీద అచ్చు తప్పును పట్టుకొని దాదాపుగా అర పేజీని కళాప్రపూర్ణులు వ్యర్థమైన రాతతో నింపి వదిలి పెట్టారు. అందువల్ల ఆ అర పేజీలోని ఆరోపణలకు సమాధానం అనవసరం.

4. 'ద్యూతక్రీడక్కు కొండొక నేర్చున్...' అన్న తిక్కనగారి ప్రయో గాన్ని గూర్చి రాస్తూ, నేర్తున్, నేర్చున్ అనే వాటిలో కూచిమంచి తిమ్మన రేఫ లోపాన్నిచెప్పాడన్నాను. అయితే తిమ్మనకన్న ముందే అప్పకవి ఈరేఫలోపాన్ని చెప్పాడని, 'అప్పకవీయమునైన పరిశీలింపక' నేనిట్లా రాసానని కళాప్రపూర్ణుల ఆక్షేపణ. కాని తిమ్మన గ్రంథానికి నేను రాసిన 'సమీక్షణము'లో — తిమ్మన అప్పకవి ననుసరించి నేర్తు, నేర్చులలోని రేఫ 'ఒకొకచో (అనగా ప్రాసములందని) లోపించు నన్నాడు' (పు. 52) అని రాసాను. మరి నేను అప్పకవీయాన్ని పరిశీలింప

లేదో, లేక పరిశోధన పరమేశ్వరులే నా 'సమీక్షణము'ను సరిగా పరిశీలించలేదో సహృదయులకే తెలియాలె మరి.

ఇంకా, ఈ ప్రయోగాన్ని గూర్చి రాస్తూ:— 'ఈ ప్రయోగమునకు ప్రమాణ మలభ్యము. మరి ఇట్టి ప్రాస ప్రయోగము కూడ అన్యత్ర లేదు' అని నా వ్యాసంలో ఉంది. దీనిపై— 'అన్యత్ర ప్రయోగములున్నవో లేవో పరిశీలింపకుండ ఇట్టి వ్రాత వ్రాయుట ఎంత మాత్రము సరిగాదు.' అని కళాప్రపూర్ణులు ఖండితంగా చెప్పారు. అయితే, నా రాసిన వాక్యాలను వెనుక ముందులుగా చదువక పోవటం వల్లనేమో మరి, వారిట్లా రాసారు. నేను రాసిందిది:— '. . . కూచిమంచి తిమ్మకవి 'నేర్చు్న్, నేర్చున్' అను వాటికి రేఫ లోపము చెప్పి నెఱున్, నేచున్ అను రూపాంతరములు సాధించినాడు. ఈ సాధింపు తిక్కనగారి లక్షింపునకే ఏమో మరి. ఎందుకనగా, నేర్చు, నేర్చులకు బదులు నేఱు, నేచు అను రూపాంతరములు వారి రచనలయందు అన్యత్ర కన్పించవు. అందువలన ఈ ప్రయోగమునకు ప్రమాణమలభ్యము. మరి ఇట్టి ప్రాస ప్రయోగమ్ము గూడ అన్యత్ర లేదు. రూపాంతరములున్నవన్నచో పేచీయే లేదు. లేనిచో నొక ప్రాస విశేషముగా భావించవలెను.' పై రాతలో 'అన్యత్ర' అంటే తిక్కనగారి రచనలలోనే అని తప్ప ఇతరుల రచనలలో అని కాదు. 'వారి రచనలయందు' అని స్పష్టంగా ఉంది. అందువల్ల వాక్యాలను వెనుక ముందులు సరిగా చదివి అవగాహన చేసికోకుండా 'పరిశీలింపకుండ' కళాప్రపూర్ణులు 'ఇట్టి వ్రాత వ్రాయుట ఎంతమాత్రము సరికాదు'. వారు ఇతరుల ప్రయోగాలు చూపటం సందర్భానికి అనుకూలమూ కాదు.

5. దండకాన్ని గూర్చి— 'దండకమొక చిత్రమయినది. పాదవిభజన లేదు కాబట్టి ఇది అటు పద్య విభాగమునకు చేరదు. మరి గణముల ప్రయోగ ముండుట గాన ఇటు వచన విభాగమున చేరదు.' అని నా వ్యాసంలో ఉంది. దీనికి కళాప్రపూర్ణులు '. . . దండకము వచన విభాగమున చేరదని ఛందశ్శాస్త్రము చదువు ప్రతి ప్రాథమిక విద్యార్థికిని తెలియును. వ్యాస కర్తలకు తెలియదు. దీనినిబట్టి వ్యాస కర్తల ఛందశ్శాస్త్ర పరిజ్ఞాన మింకను బాల్యదశ దాటలేదని గ్రహింపవచ్చును. . .' ఇత్యాదిగా తమ గ్రహణ పటుత్వమును వెల్లడించారు. నేను వారికన్నా చాలా చిన్న వాడిని కావటాన వారు నా దశ నేమన్నా ఫరవాలేదు. వారి దశను గూర్చి నేనేమన్నా బావుండదు. అయితే ఒక విషయం దండకం వచన విభాగంలో చేరదని నేనే రాసాను గదా! మరి 'వ్యాసకర్తలకుతెలియ' దనటం తెలియనితనం కాదా! ఇదిట్లా ఉండగా దండకం వచన విభాగంలోచేరదని 'ఛందశ్శాస్త్రము చదువు ప్రతి ప్రాథమిక విద్యార్థికిని' తెలియవచ్చు గాని, ఎందుకు చేరదో, దానికి కారణం ఏమిటో వారికి తెలియదు. అది విషయాన్ని గూర్చి ఆలోచించే వారికే తెలుస్తుంది. లాక్షణికులు దండకాలను 'మాలికా వృత్తా'ల్లో చేర్చారు. పాద బద్ధంగా రచింపబడ్డ దండకాలు కూడా ఒకటి రెండు లేకపోలేదు. 'తెలుగున దండకము లేక పాదముగానే తరుచుగ గానవచ్చు. కొందరు రెండ పాదాలుగా, నాలుగు పాదాలుగా వ్రాసిరి. అని శ్రీ రావూరివారు రాసారు గూడా. (తె. ఛా. ఛం. రీ. పు. 141) ఈవిషయం కళాప్రపూర్ణులకే మో గాని, నాకు తెలుసు. దండకాలు ఏక పాదంగా వుండటమే ప్రచురం. అంటే, పరమార్థత: పాదవిభజన పాటింపబడటం లేదన్న మాట. పద్యానికి పాద విభజన ఉండాలె. అది లేనిది గద్యం. అది 'తెనుగు కృతులలో వచన మనగ దీపించు' నన్నాడు అనంతుడు (అనం. ఛం. 2—2) పైగా దండక లక్షణంలో అనంతుడు పాద విభజన చెప్పలేదు. గణాల విషయమే చెప్పాడు. (చిత్రకవి పెద్దన వంటి వారు పాదవిభజనను ప్రస్తావించారు.) లాక్షణికులు దండకాన్ని మాలికా వృత్తాల్లో కలిపి చెప్పినా, మాలికా వృత్తాలయిన లయ గ్రాహిత్యాదుల వలె పాదవిభజన పూర్వకంగా వీరు దండకాన్ని ప్రదర్శించారా ? కళాప్రపూర్ణులు అంతటి లభిమానంతో ఉదాహరించిన అప్పకవి అయినా ఈ విధంగా చెప్పాడా? మరి ఇవేమీ చూడకుండా కళాప్రపూర్ణులు ఇట్లా అనాలోచితంగా రాయటం వారి 'స్థాయి'కి తగందేమో వారే ఆలోచించాలె. మరొకటేమిటంటే, లాక్షణికులు వారికి తోచినవి ఒకొక పద్ధతిలో వారు చెప్పారు. వాటిని గూర్చి మన అభిప్రాయము మనం చెప్పవచ్చు. లాక్షణికులు చెప్పిందాన్ని మించి మనం ఏమీ ఆలోచింపనక్కరలేదని పరిశోధన పరమేశ్వరులు కూడా అనుకుంటారా. అంటారా? వారి కొక్క నమస్కారం. అంతే.

పై విధంగా అయిదంశాలను విమర్శించి, 'ఇంకను విమర్శింపవలసిన విషయములున్నను విస్తర భీతిచే విరమించుచున్నాను' అన్నారు కళాప్రపూర్ణులు. వారికి ఏ భీతి లేకున్నా, కనీసం విస్తర భీతి అయినా ఉన్నందుకు సంతోషం. ఇంతా రాసి, . . .'సంశోధిత మహా భారతమువంటి యుద్గ్రంథమున నీ సంపుటమున— పై వ్యాసముండుట వలన — నీ ముద్రణోన్నత స్థాయిత్వమునకు భంగము కలుగుచున్నది.' అని తీర్పు చెప్పారు. కళాప్రపూర్ణులు. సంశోధిత మహాభారతానికుండ వలసిన స్థాయికి, నా వ్యాస స్థాయికి భంగం కలిగించో లేదో సహృదయులు అర్థం చేసుకోగలరు. కాని కళాప్రపూర్ణులు తమ అనుచిత విమర్శ ద్వారా తమ స్థాయి'కి ఎందుకు భంగం కలిగించుకున్నారో మాత్రం అర్థం చేసుకోవటం కష్టసాధ్యం.

చివరకొకటి. నేను పరిష్కరింగా, సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన కూచిమంచి తిమ్మన గ్రంథాన్ని గూర్చి ప్రస్తావించి 'ఈ గ్రంథమునకు లక్షణ సార సంగ్రహమను పేరు తో ప్రకటించుట సరికాదు.' (వాక్య రచనను సహృదయులు గమనించాలె.) అంటూ 'అకాడమీ ప్రచురణ మూలమున నా గ్రంథము' యొక్క విశిష్టమంతయు విస్మృతమైనది. దీనిని గూర్చి ప్రత్యేకముగా వ్రాయుచున్నాను' (అథోజ్ఞాపిక. 25) లని పరిశోధనపరమేశ్వరులు నన్ను హెచ్చరించారు. చాలా సంతోషం. వారు రాయవలసిందే. పొరపాట్లు ఉంటే నేను అంగీకరించవలసిందే. ఆ గ్రంథ'సమీక్షణములో' చివరికిట్లా రాసాను—'. . . విషయ చర్చలో అభిప్రాయ భేదములున్నచోట కొగాడుటలు కూడా తప్పవు. గమనించవలసినది విషయ ప్రతిపాదనలోని సామంజస్యము'. భిన్నాభిప్రాయచర్చలో వ్యక్తుల ప్రసక్తి కన్న విషయమునకే ప్రాధాన్యము. విషయ నిర్ణయమున పొరపులు దొరలినచో సహృదయుల సూచనలు శిరోధార్యములని సవినయముగా మనవి చేసుకొనుచున్నాను.' కళాప్రపూర్ణులతో గూడా అంతే. అయితే 'మరీ చౌకబారుగాకాక, హుందాగా, విమర్శించండి. అవసరమైతే' అని ప్రత్యేకంగా వారికి నా మనవి.

- శ్రీ సంపత్కుమార

# అనేకార్థద్యోతకం 'మాట'కు మాట

ఇటీవలనే శ్రీయుతులు ద్వా.నా. శాస్త్రిగారు భారతి—నవంబరు 1974

కలగూరగంపలో వ్రాసినవ్యాసము చదువుట జరిగినది. బాగుగనున్నది. అదిచదివిన పిమ్మట నాకు, తోచిన 'మాట' నుడికారపు ఇంపుసొంపులను తెలుపదలచాను. తెనుగున ధాతువులకు పడు, పెట్టు, వేయు, చేయు, కొను అను క్రియారూపములు చేర్చినపుడు పెక్కు విధములైన అర్థబేధములు స్ఫురించుచున్నవి. ఒకటే ధాతువునకు వివిధప్రాంతములో విభిన్నమైన అర్థభేదములును గోచరించుచున్నవి. మాండలికభేదముచే వ్యవహారమందు విచిత్రమైన శబ్దములు, రూపాంతరములు, అర్థములు కల్గుచున్నవి. అవ్యయములు, విశేషణములు చేర్చినప్పుడుకూడ అర్థము ఏారి లందమైనవిగా, జాతీయములుగా, దేశ్యములుగా రూపొందుచున్న శబ్దములు ఆసాధువులని త్రోసిపుచ్చుటకన్నా వాటికిని తాంబూలమిచ్చి సాధుసత్కారము చేయుట భాషకు శ్రేయస్కరమని నా భావన. ప్రజల నాలికలందు నాని నాని విశేష ప్రచార మంది యటనట కవి ప్రయోగములకు కూడా స్థానము చేసి కొన్న ఈ క్రింది మాట నుడికారము నిఘంటుకారులును మేలైనవిగా తీసికొని భాషా విస్తృతికి తోడ్పడ ప్రార్థన.

ఊకదంపుమాటలు—సారములేని మాటలు, పొల్లుమాటలు
ఊరమాటలు—ఊరింపు మాటలు
ఊరట మాటలు—చవులూరించు మాటలు
కల్లబొల్లిమాటలు—మాయదారి మాటలు
కొరకొర మాటలు— కోపవచనములు
చాటకుల మాటలు—క్షణచపల వచనములు
పైపై మాటలు—కపట వచనములు
పెడసరపు మాటలు—అహంభావం సూచించు కటువైన మాటలు
పూసగొండిమాటలు—నూటిపోటీ మాటలను కొంటున్నాను.
మంత్రాలమాటలు—బీజాక్షరాలు (2) మోసకారి మాటలు
మాయమాటలు—అబద్ధ వచనాలు
ముద్దు మాటలు—ప్రీతిగొల్పు (బాలకుల) మాటలు
ముళ్ళమాటలు—తంపులుపెట్టుమాటలు (2) వక్రమైనపలుకులు
వంతుమాటలు—పోటీపడేమాటలు, వాదోపవాదములు.
ఉత్తుత్తిమాటలు—నిస్సారమైన మాటలు
నాలిక మడత మాటలు—అవసరంకొద్దీ ప్రతినిమిషానికి మార్చేమాటలు
నిండాగర్భం మాటలు—కిట్టని మాటలు
'చీమంత మాట—స్వల్పమైన మాట
చీమంత మాటైన చెవిలో నీకు బోధించు
కొమిలి నీ కెన్నాళ్లకు గురుతాయెగా" అని ఒక ప్రయోగం.
చెప్పుడు మాటలు—కిట్టక చెప్పునట్టి మాటలు
నయగారి మాటలు—'నయగారి మాటలు నటన చూపులను
ప్రియము నయముల చెల్లించి పొంచి'

(అష్ట మహిషీ కల్యాణము—3352)

నానుడి మాట— జగమెరిగిన సత్యము, అనువపుడు వ్యవహరించుమాట

సన్నని మాటలు—నమ్మించుటకైన మెత్తని మాటలు.
ఎత్తిపొడుపుమాటలు—ఎదుటివారి మాటలనే ఆసరాగా తీసుకొని
ఆ మాటలతోనే సమాధానం చెప్పే సందర్భంలో
ఉపయోగించెడు మాటలు.
పుల్ల విరుపు మాటలు—పెడసరపు బలుకులు, కటువుగా నుండెడి
మాటలు

మాట—ఏదైన పనిబడి పిలుచునప్పటి పలుకుబడి
మాట అమ్మె మ్మెతాకు— బాధ కల్గించు
మాట కడుగుదాటు— మాట మీరు, మాటతప్పు
మాటకారి—మాటకారి నీటుకాడు—మాట నేర్పున్నవాడు
మాటకు—మాట వరుసకు (మాటకు నంటివా లేక నిజమా ?)
మాటకు మాటగా— మాటమీద మాటగా, ప్రసంగవశాత్తూ
మాట కురుచచేయు—మాటకించపరుచు(ఒక మూల మేలుచేసెదనని
తెలుపుచున్నను నా మాటను కురుచ
చేసినతడు)

మాటకెక్కు—ప్రసిద్ధికెక్కు
మాట కెదురులేదు—ఆ ఊళ్లో ఆయన మాట కెదురు, లేదు.
ఆయన 'మాటంటే' మహరాజు కూడా నిలబడతాడన్న మాట.
మాట చెల్లు—పలుకుబడి ఉండు, మాట ఆదరము కల్గు.
(పదిమందిలోను నా మాట చెల్లుబడిఅయ్యింది)

మాటగడుచు—మాట మీరు
మాట గుత్తుకదగులు— మాట మిగిలిపోవు
మాట గైకొను—మాటవిను
మాట చెడు— మాటపోవు
మాట చెల్లించు— మాట ప్రకారము నడచు
మాట చేసికొను—మంచమాట చేసికొను, వివాహము నిశ్చయము
చేసికొను
మాట తీసికొను—వాగ్దానభంగము చేయు (2) మాట సహాయము
స్వీకరించుకొను
మాట తీసివేయు—తిరస్కరించు
మాట తెచ్చుకొను— లేనిపోని మాటలు పడు
మాట నిల్కడ— సత్యవ్రతము
మాట పట్టింపు—మాట పట్టుదల
మాట పట్టిచ్చు—(1) ఎదుటివాని మాట తప్పుపట్టించు
(2) మాట సహకారము నిచ్చు

మాట పడిపోవు—నోటమాట రాకపోవు
మాటపడు—ఒకరిచే నిందింపబడు
మాటపుట్టు—చెడ్డపేరువచ్చు
మాట బీరాపోదు— మాట తీసిపోదు
మాట పొందు— మాటనేర్పు (పొందిక)
మాటపోటు—మాట దెబ్బతిను

మాటమాట—వివాదంబోలార్చుటకు నీకు లోలోన నేమేని,
పొడిపుచ్చుడుగదా మాటుమాట ! (భీమ 2.88)
మాటమాత్రాన—ఒక్క క్షణములో (ఉదయాద్రి వేగసత్యవ్రతి
సాధించె విసుకొంక మాట మాత్రాన హరించె
పారిజాతాపహరణము 1.23)

మాట మోపు—నింద భరించు
మాటలు గడవ నాడనేర్చుతివె "నీవు రాజవు 'మాటల నిన్నుం
గడవనాడ నేర్చుతునె? విప్లవముపధరింపు?" నిన్ను మాట
లతో నెగ్గగలనా యను అర్థము చెప్పికొనవచ్చును.
మాటలలో కడుపునిండు—శుష్కప్రియాంతో కడుపునిండునా?
(నీ మాటలతోనె కడుపునిండెనురే ! ఇక చేర లెందులకు ?)
మాటలతో మూటలు—చేని పంటలు కొయ్యలు చెప్పవానిచెయ్యిలు
మానవమానవి చింతయు మాటలతో మూటలు" !! అని పరమ
యోగి విలాసంలో ప్రయోగింపబడి ఉంది.

మాటలపచ్చళ్లు—రుచికరమైన మాటలు
మాటలపుట్ట—వదరుబోతు—మాటలమారి'
మాటల ఓటపెట్ట— లేయని మాటలు
మాటల వర్షము కురిపించు—నిరాఘాటముగా ప్రసంగించు
మాటలు కరువగు—మాటలు దాచుకొను
మాటలు కోటలుదాటు—మాటలు బంగ్లామీదపోవు (మాటడాబు)
మాటలు నూరిపోయు మాటలు చెప్పి హృదయమున కెక్కించు
మాటలు ముదురు—చిలికి చిలికిగాలివాన అయినట్లు మాటమాట
పెరిగి—తగాదాకు తలపడు.
మాటలులేవు—చాల కాలం నుండి వారిద్దరికి మాటలులేవు—
స్నేహము లేదను స్ఫురణ కల్గుతుంది

మాటపీడు పోటులు—తడబాటు మాటలు
మాటమాటకి—సారె సారెకు
మాట్లాడిపెట్టు—వ్యవహారము కుదిర్చిపెట్టు
మారుమాట పలుకు— ఎదిరించి పలుకు, అబద్ధము పలుకు

ఇందులో కొన్ని పూర్వకవుల ప్రయోగ వచనాలున్నవియు గలవు. జానపదుల పదవాఙ్మయములందు దొర్కినవియు గలవు. పైన అవ్యయములు, విశేషణములు, క్రియలు జతచేసిన 'మాటలు' వాటి అర్థవ్యవహారములు కొంత తోచిన మేరకు ఇచ్చియుంటిని. పండితులు, విమర్శకులు, భాషవేత్తలు ఇందలి పొల్లును చెరిగి సారము గ్రహింపప్రార్థన. మాట నుడికారము—జాతీయములు, సామెతలు రూపమునను చక్కని అర్థభావములు కల్గించి కావ్యాదులును సౌందర్యము కల్గించుచున్నది. ఉపన్యాసకులకు, పిచ్చాపాటీవేసికొనేవాళ్లకు ఈ సామెతలు పుష్టి నిస్తున్నాయి.మచ్చుకకుకొన్ని —మాటకు మా యింటికి కూటికి మీ యింటికి, మాటకు పడిచస్తాంగాని మాటకు మొగం చూసుకొంటామా, మాటకు మాట తెగులు. నీటికి పాచి తెగులు, మాటగొప్ప చెప్ప మాటలుచాలవు, మాటగొప్ప మానిక పిచ్చ, మాటచుట్టమేగాని కూటచుట్టం మాత్రంకాదు, మాట చూడనిదే మన సివ్వకూడదు, మాటల పసేగాని చేతల పసలేదు, మాటలలో పడి మగణ్ణి మరచి నట్లు, మాటలు తల్లిమాటలు పెట్టు, సవతితల్లి పెట్టు, మాటలు నేర్చి నమ్మ ఏడ్చిననూ ఒకసాంపే, మాటే లేకుంటే చాటేసేను, మాట్లాడితే ముత్తెలు కాట్లాడితే కణుదురీగలు" ఇట్లాంటివెన్నో ఉన్నాయి.

- 'సు శ్రీ'

# ఉత్తర హరివంశము - పాఠపరిష్కరణము

1974 జూన్ భారతిలోని "ఉత్తర హరివంశము పాఠపరిష్కారము" అను శీర్షికతో వెలువడిన వ్యాసమును విమర్శించుచు శ్రీమతి డా. పి. యశోదా రెడ్డి 1974 సెప్టెంబరు నెల భారతిలో ఒక కలగూరగంప వ్యాసమును ప్రచురించినారు. అందలి యప్రస్తుతాంశమున విడిచి మిగిలిన వానికే సమాధానము వ్రాయుచున్నాడను.

## 1. పాపులర్ ఎడిషన్

1970 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించినది పాపులర్ ఎడిషనా? అట్టిపేదైన వేరొకటున్నదేమో నేనెరుగను. నా వ్యాసమున పేర్కొనినది శ్రీమతి పి. యశోదారెడ్డి సంపాదకత్వమున వెలువడినది. అకాడమీ సభ్యులు మిత్రులునగు శ్రీ సింగరాజు సచ్చిదానందము గారినుండి లభించినది. దానిలో పాపులర్ ఎడిషన్ అను పేరెచటను గానరాదు. తొలి పలుకులందు గాని దానిలో పాపులర్ఎడిషన్ అనుపేరెచటను గానరాదు. ఒకవేళ అకాడమీవారికార్యాలయంలో నున్నవేమో? లేని దానినిచూపి ఒకటికిరెండుసార్లు 'పాపులర్ఎడిషన్' అని వ్రాసికొని సంపాదకురాలుగ తమకు గల బాధ్యతనుండి తప్పించుకొనలేరు గదా. పాపులర్ ఎడిషన్ అనగా నిర్లక్ష్యముగ యథేచ్ఛగ నచ్చువేసి దేశముపై పారవేయదగిన గ్రంథమనియేకాబోలు వారి తలంపు. శ్రీ వీరేశలింగము గారు ప్రచురించినదాదిగ నేటిదనుక వెలువడిన యే యుత్తరహరివంశపు ప్రతియందును ఇన్నిసందల తప్పులు కానరావె. తప్పులు లేని పద్యములొక కొన్ని యున్నవనుటయు సరయ మియెయగును. ఈ పాపులర్ఎడిషను (అది పాపులర్ ఎడిషను కాదు అయినా శ్రీమతి రెడ్డిగారు ఇపుడద్దానికట్లు నామకరణము చేసినారు గాన) అకాడమీ వారహా రకన పంచి పెట్టుచున్నారు. పేరెవరును పెట్టని వెల రూపాయల 5. పీఠికను వారూరకనె వ్రాసిన వ్రాసిరేమో. నాల్గు సంవత్సరముల తరువాత సవరణ చూపుట తప్పా? అయినచో వారు శతాబ్దముల నాటి సోముని రచనమును గూర్చి స్మరించుట కయినను నేటి వారికి వీలు పడదే. వ్రాసిన దానిని సమర్థించుటకును ప్రత్యయము కల్గను గద యని సమకాలిక రచనలు, సంవాది రచనములనుద్ధరించుట సంప్రదాయము. వారును విషయ వివేచనమునకై ఎందరినో పేర్కొనిరి. ఎందరి రచనలనో ఉద్ధరించి చూపిరి. ఎందరినో విమర్శించి [illegible] సంతయు (50 పేజీలు) వీనితోనే నిండించిన శ్రీ యశోదారెడ్డిగారు [illegible] రచనమును, నానార్థ రత్న కోశమును పేర్కొనుట [illegible] దురూహ్యములగు విషయములట్లే యుండనిందు.

## 2. బాహు - ప్రాణో

నాగాయుత బల ప్రాణో
భీమో భీమ పరాక్రమః
అసకృద్బల దేవేన
బాహు యుద్ధే పరాజితః

· విష్ణుపర్వ 2. అధ్యా 62 శ్లో.7

'దీనిని పూర్వ గాథతో సమన్వయింపగలరా' అని ప్రశ్నించియు, తక్కిన పాదము ... 'సారములా' అనియు వారి యజ్ఞతను ప్రకటించుకొనిరి. పై శ్లోకమునందె వారి సందేహమునకు సమాధానము గలదు. దానికి ముందు వెనుకలనున్న శ్లోకములతో తక్కిన కథాభాగములు సూచితములు. విస్తరభీతిచే శ్లోకములు యథాతథముగ ప్రదర్శింపలేదు. కథాభాగములను సూచించు శ్లోక భాగములు చూపించెదను.

(1) జరాసంధం గదాయుద్ధే జితవాన్. . . శ్లో.5
(2) అసకృన్నం దేవేన బాహు యుద్ధే పరాజితః. .శ్లో. 7
(3) ప్రలంబం ముష్టి నైవ యుజ్ఞఘాన హలాయుధః శ్లో.17
(4) ... కంతు మహావీర్యం చిక్షేప ...మూర్ధని. శ్లో. 18
(5) ప్రక్షేప్తా మైన్ద ద్వివిదాయాం నగరం ... రవన్యవ. శ్లో.12.

ఇంకను విశదముగ గావలయునన్న మూల హరివంశములో విష్ణుపర్వము నందలి 13, 14, 36, 46, అధ్యాయములు' గ్రంథాతరములును చూడవలెను. పై విధముగ చూడకుండుటచే అసలు మూల హరివంశమును శ్రీమతి యశోదారెడ్డిగారు చూడనే లేదనుట స్పష్టము.

ఇంక సమానార్థకములను బలప్రాణములను మూలకారుడెట్లు ప్రయోగించును? అని వారి శంక. సమా నార్థకములని వారన్న సందురుగాక. భిన్నార్థకములు గూడ. అబాల గోపాల మనుదినమును స్మరించు శ్లోకమిది.

## "రఘు కులాన్వయ రత్నదీపం"

ఇందలి కుల— అన్వయముల వంటివే పై బలప్రాణములు. "దానవవైరి పై పడమి లావుంజేవయుం జూప" (ఉత్తర హరి. ఆ. 4. పద్యం. 901 అన్న చోటనున్న 'లావుంజేవయు' వంటిదె ఆ బలప్రాణములు. పఠితాంశము సోమన పరభాగమేగాని సంస్కృత భారత భాగమునందలి 'బలప్రాణ'ములను గూర్చికాదే. అట్టిచో శ్రీమతి యశోదరెడ్డి గారు దానిని ప్రస్తావించుట సమర్థింపగోరుట సమర్థనీయమ్ము కాదు. ఎర్రన రచనాభాగము నుద్ధరించి చూపుట ఉచితము కాదా?

సోమన భీముడు— నాగాయుత ప్రాణుడు. ఎర్రన భీముడు— పదివేలే సింగు లంత లావు గలాడు.

అనువాద సామ్య మచ్చు కొట్టినట్లుండుటచే నుద్ధరించి చూపితిని. వారాయుదాహరణమును యత్నేన్నా దేనికైన నుపయోగించు కొనవచ్చును. నాగాయుతబాహు, లనుచో ... ద్రావిడ ప్రాణాయామము రీతిగ జెప్ప కొనవలెను. సరసార్థ ప్రతిపాదనము గాదు. పైగ 'నాగాయుత ప్రాణు' అనియె అముద్రిత ...లన్నిని. (ఆంధ్ర సాహిత్య పరిషత్తు. పేవరు మానుస్క్రిప్టు నెం. 12.)

## 3. మురపాళములు

మూలాను సారముగ సవరించితినని చెప్పుటయే గాక పూర్వపు సంస్కర్తల భ్రమ ప్రమాదములను వెలువరించినట్లు వ్రాసి, వారి నపహసించి విమర్శకులచే సెబాసనిపించుకొన్న ముఖ్య ఘట్టమిది. యథార్థ విషయములు కొన్ని.

(1) ఆంధ్ర సాహిత్య పరిషత్తు వ్రాత ప్రతిలో (నెం. 12) 'మురుపాశము' అనియె యున్నది.

(2) 1913 నాటి వావిళ్ల ప్రతియందును 'మురుపాశము' అనియె యున్నది.

పై ప్రతిలోని 'మురుపాశము' అను చూచియె 'పాశము'లను 'పాశము'గ తమ గ్రంథమున 'నా సంస్మరించిన పాఠమని' ప్రకటించి పాఠకులను పండితులను తుదకు విమర్శకులను సయితము భ్రమింపజేసి సెబాసనిపించుకొని శ్రీమతి యశోదారెడ్డిగారు ఇది నే జూడనే లేదని యనజాలరు. వారు పరిశీలించిన వానిలో నీ వావిళ్ళ ప్రతి యున్నదని వారే వ్రాసియున్నారు. సత్య మందరయు కందుబాటుగనుండక పోవుటచే నిపుడును దానినె సమర్థించు కొనుట నేమేమియో వ్రాసె తమ ఆక్కసు తీర్చుకొనిరి. వారి కంఠమునకు వారె పాశము తగిలించుకొనిరి.

## సవరణ - అర్థాన్వయము

పూర్వపు సంస్కర్తలగు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు "మురుపాశములు" అని పూర్వార్థమునందును 'వానిలోని పిశాచము...' అని యుత్తరార్ధమునం దుండుటచే అర్థాన్వయములు పొసగక పోవుటచే మురుడు రాక్షసస్వామి గాన వాని పాశములలో పిశాచములుండి యుండుటచే నెట్టి విప్రతిపత్తియు లేదు గదయని పలు ముద్రితాముద్రిత ప్రతులలో, 'పాశము' అని యుండుటచే అర్థాన్వయములలో నెట్టి చిక్కును లేదని తలంచియె పై పాశములను పూర్వ ముద్రణ పాఠమును (1913 వావిళ్ల) తరువాత తరువాత మార్చి మూలపాద మగు పాశములు పాఠాంతరముగ జూపి పాశములు ప్రధాన పాఠముగ జూపిరి. (1937. వావిళ్ల) కాన శ్రీ శాస్త్రిగారొనర్చినది పాఠ నిర్ణయము. పాఠ పరిష్కరణము గాదు. ఉన్న పాఠములలో ఉచితమగు తోచు దానిని మూల పాఠముగ జూపుట పాఠ నిర్ణయము. ఉన్నదాని నేకారణము జూపియో మార్చి వేయుట సంస్కరణము. ఇది తెలియకనే బహుముఖ ప్రజ్ఞాశాలురగు శ్రీ శాస్త్రిగారి సంస్కరణము భ్రమప్రమాద జనితమనుటకన్న అక్షర సామ్యమునె పాఠములను మార్చిరని వారినను టకన్న నజ్ఞత వేరే యుండును. వారి రచనములలో తప్పులు లేవనను 'ప్రమాదో ధీమతామపి. కాని యిట కాదు.

"కత్తి వాతులతో నూరుగావి తిరిగి
యాడు మురుపాశముల గాంచె నారుదేల'. అనియె సోమన రచించియుండును. ఆ పాఠమె వ్రాత ప్రతులందుండగ నది లేఖకప్రమాదముగా భావించి యంతకన్న నెక్కుడర్థవంతముగా దోచునదియు అక్షరములందంతగా భేదము లేనిది యునగు మురపాళములని పాఠము సంస్కరింపబడినది. కాని మూల హరివంశమును జదివిన తరువాత నీ సందర్భమునందు ఉత్తర హరివంశమునందు

మునకు సంస్కృతమె ప్రదాన కారణమై యుందురా కారణాంతరము లివి.

1) మురపాశములను గూర్చి శ్రీ నారాయణ నీలకంఠ పండితుండు భారత భావదీపికలో 'మౌరవాన్ మురువిహితాన్ శస్త్ర వచలి సూక్ష్మాన్ దృఢ తరావయవ సంయోగం పాశానిక వ ప్రవిశ్యప్రేత్య మర్మాని చ్ఛేత్తృ' అని చెప్పుట (వి. ప. అధ్యా 63. శ్లో. 46)

2) పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి ఉత్తరహరివంశ వ్యాఖ్యానములో (కాగితపు వ్రాత ప్రతి— ఆం' సాహిత్య పరిషత్తు) 'కత్తుల౦ బోలిన పాశములను ఆయుధ విశేషము' అని వ్రాసి యుండుట.

3) నాచన సోమనయె మురుని యుద్ధ వర్ణనమున దీనిని చెప్పి యుండుట. "యక్ష గుహ్యకుల్ విరిద ఖడ్గ పాశముల వ్రేసిరి"
(ఉ. హరి ఆ. 1. పద్య 40.)

అవి పాశాయుధములె 'పాశ' పేరు కొందరున్నారు. వారి పాశముల కన్న మురుపాశముల విభిన్నమ్మనవి. ఈ విషయము నీలకంఠుని వ్యాఖ్యనుండి క్షురాస్త్రములని పూర్వులు చెప్పుట వలన, ఖడ్గ పాశములని, కత్తివాతులపాశములని సోముడు వ్రాయుట వలన మనము గుర్తింపగలము. కావుననే మూడవ పాదమున పాశము' లుండ వలయునంటిని. తప్పెహో విజ్ఞులు తెలుపగోరెదను. పాఠము మార్చికొందును.

4) యతి పోషణకై శ్రీ యశోదారెడ్డిగారి ప్రతిభకు మెచ్చి వేనున్న సెబాసనెదను. "ఛ్రుట రేఖ ప్రమాదమున దొరలిన పొరపాటుచే నీయతి భంగము కల్పింపబడినదిగ తలచుట లెస్స" అని వారే పీఠికలో తెలిపి యున్నారు. కానరి సంస్కరణము సంస్కరణము కాదని బహు కాల ముగ ప్రచారమందు పాఠమే అని తెలిపి తలంచెదొ బహుజనపల్లి వారిని బేర్కొంటిని. వారు తమ లక్షణ గ్రంథమున 'వైరీశ్వరున్—ఘన' అను పాఠమును గాక 'వైరినుర్దన చక్రాయుధ' పాఠమె ఉదహరించి ఉన్నారు. శ్రీ యశోదారెడ్డిగ దానిని కని వినియుండలేదనుట సువిదితమయ్యె.

పఠన ఖే వచనములందు పలుమారా పొరపు పెరుక కల్గి ఉండుటచే సీతాపునయ్యదట్లే పూర్వపు ప్రతుల యందుండి, ముద్రణములందది నలిగి నలిసోధిలమయి, భ్రంశమై ఘనరూపముసంది ఉండునని నేనట్లనుట కింకొక్కారణము ఆ మహాకవి రచనమునందు యతి స్థానమునే 'ద్ధ' ప్రయోగముండి యుండుట. "మ ద్ధన భుజ శక్తికిం దరము గాదు దలం'
(ఉ. హరి ఆ. 4. పద్య 31)

4వ యాశ్వాసమున ద్ధ యతిని నిర్వహింపగలిగినవాడు ఆరవ యాశ్వాసము వచ్చునప్పటి కసమర్థుడయ్యెనెహా? యతి భ్రంశ మహా దోషమునుండి సోమనను కాపాడితిమని మన మనుకొనుటకన్న నేనాడో ఆ దోషమును గుర్తించి సంస్కరించిన సీతారామాచార్యులకు కనీస మా గౌరవమును ఇచ్చుటర్హమనియె ఆయాచార్యులు గారిని వారి లక్షణ గ్రంథమును స్మరించితిని. శ్రీమతి యశోదారెడ్డిగారది యోర్వరైరి.

శబ్ద రత్నాకరారుని కడ నొక యముద్రిత ఉత్తర హరివంశ ప్రతి ఉన్నదని వీరేశలింగముగారు తమ ఉత్తర హరివంశపు పీఠికలో పేర్కొనిరి కద. లందా పాఠమె ఉండియుండెనేమొ కూడ.

లభించెడి సాధన సంపత్తితోనె పాఠ పరిష్కరణాదులు జరుగుచుండును. ఇందువేరెట్టి మర్యాదలైన యున్నవియేమొ నేనెరుగును.

ఈ పిశాచ పీడా నివృత్తికగు నీరచనము సాగించుటకు ఏనాడో చూచిన జ్ఞాపకముతో నడిగిన వేంటనే తమకడ గల ముద్రితాముద్రిత గ్రంథముల నొసంగి సహాయపడిన గవర్నమెంటు మ్యూజియం రిసర్చి సెంటరు క్యూరెటరు శ్రీ యస్. దాశరథి, బి. ఏ. గారికిని, సహకరించిన ఆయాఫీసు వారికి కృతజ్ఞుడను—

- శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు.

## కొబ్బరి చెట్టు — టెంకాయ చెట్టు

భారతి—డిశంబరు 74— శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి గ్రంథవిమర్శలు "రేపటి వసంతము"' శ్రీ ఎల్లోరా రచన —54, 55 పుటలు— ఇందులో ఒకటి రెండు మాటలు గూర్చి నా అభిప్రాయం ప్రచురించ గోరు తున్నాను :

ఈ మధ్య నవీన కవితలలో వాడుకపడుతున్న కొన్ని కొత్త పదబంధాల విషయంలో రెడ్డిగారికి సారస్యం గ్రహించే మన, సానుభూతి లేవనుకొందాం. కానికనీసం ఏళ్ళ తరబడిగా వాడుకపడివున్న మాటలుగూర్చి గూడా తన యిష్టం వచ్చినట్లు ఆక్షేపించ వలసిందేనా?

కొబ్బరి చెట్టును టెంకాయచెట్టు అనడం ఉచితం అట. అంటే కొబ్బరి చెట్టు అనడం —వ్యవహరించటం, వ్రాయడం—అనుచితమన్నమాట ! ఎందుకంటే తాటిచెట్టును ముంజచెట్టు అని అంటున్నామా?అని ప్రశ్నిస్తూ శబ్దపు చిత్య చర్చ చేస్తున్నారు. తాటిచెట్టును ముంజచెట్టు అని అనకపోతే, టెంకాయ చెట్టును కొబ్బరిచెట్టు అని అనగూడదని నియమమెట్లా?ఒకదానికొకటి పోలిక పెట్టిఅన్నీ అట్లనే —ఒకేమాదిరి —ఉండాలనుకోవడం ఎక్కడి పద్ధతి ? ఈత

చెట్టు అంటామేగాని తెంగాయచెట్టు అని అనము: కాబట్టి టెంకాయచెట్టు అ... అనరాదా?—టెంకచెట్టు అనవచ్చునంటారేమో?—రెడ్డిగారు సెలవియ్యాలి!

గోదావరి ప్రాంతంలో కొబ్బరికాయ, కొబ్బరిచెట్టు అనే అంటారు. టెంకాయచెట్టు వాళ్ళకి వాడుక తక్కువ. వ్యవహారజ్ఞుడికి రెండూ సముచితాలే

మామిడి, మావి —ఏది ఉచితమంటారు? ముట్టె, టెంక —ఏది సరైన మాట? గింజ, పిక్క—ఏది తగినది? పాడి, పాడుము, గుండ —ఏది వాడవలసింది? ఎవరు చెప్తారు? ఎక్కడున్నది అపువిద్యానోదెల్యాల చర్చకు తావు? నిర్ణయాలకు ఏమిటి ఆధారం? వ్యవహార బహుళాలైన ప్రాంతీయాలు విడిచి రెడ్డిగారెత్తను చెప్పమని మనవి చేస్తున్నాను.

తాటిచెట్టును ముంజచెట్టు అని అంటారో లేదో తెలియదు —నేను గూడ వినలేదు —కాని, "ముంజకాయ" అనే వాడుక నెల్లూరు ప్రాంతపు పల్లెల్లో ఉన్నది.

కొబ్బరి నీడలు అంటే కొబ్బరిచెట్టు నీడలు అని కాబోలు అని వివరించి, మామిడి నీడలన్నట్లు అవి అతుకవు అంటూ విమర్శించారు రెడ్డిగారు!

మామిడి నీడలు మాత్రం అతుకుతుందని—ఆయన యిచ్చిపెద్దారు తప్ప —ఎవరంగీకరించారు? కొబ్బరినీడలు అతుకుతుందా? టెంకాయచెట్టునీడలు అతుకుతుందా? కొబ్బరినీడలు అనడం కాక కొబ్బరిచెట్టు నీడలు అనే అనవలసి వస్తే, కొబ్బరిచమురు అనాలనా? కొబ్బరికాయచమురు అనాలనా? కొబ్బరిచెట్టు కాయచమురు అనవద్దా? కొబ్బరిచిప్ప, కొబ్బరిపీచు, కొబ్బరిమట్ట, కొబ్బరినూనె, కొబ్బరిపాలు అన్నట్లే కొబ్బరి నీడలు వాడుకలో ఉన్నప్పుడు ఒకరి ఆక్షేపణకు ఆస్కారం లేదు. కాదంటే అది అజ్ఞానం అవుతుంది. కొబ్బరి, కొబ్బెర —రెండు రూపాలూ ఉన్నవి. అట్లనే గొబ్బెర, గొబ్బిరి —అనే వాడుకలూ ఉన్నవి.

టెంకాయ అంటే 'టెంకయే కాయ'అయినది అని అభిప్రాయం. అట్లని వంగచెట్టు మాదిరి టెంకచెట్టు అనవలెనన్నది నియమం కాదు. (కాని తేంజెట్టు నిఘంటువుల్లో కనబడుతుంది.)

తెంకాయ్, తెంగాయ్, తేంగాయ్ అని తమిళంలోను, తెంగినకాయ అని కన్నడంలోను, టెంకాయ అని తెలుగులోను—దాని రూపాంతరమే టెంకాయ అని —ఉన్నట్లు నిఘంటువులు చెప్తున్నవి. దక్షిణ దేశపుకాయ కాబట్టి 'తెన్ (దక్షిణ దిక్కు)కాయ'అని వ్యుత్పత్తి కూడా కొందరు చెప్తారు.

అసలు ఇంతకీ కొబ్బరి నీడలు అంటే కొబ్బరిచెట్ల నీడలు అని కాక మరింకేమైనా అర్థాలు వచ్చే ప్రమాదం ఉన్నదా, రెడ్డిగారు చెప్పలేదు! కొబ్బరి నీడలు కనబడేది పంచారులోనేకాదు, కోనసీమలో కూడా.

అట్లనే, పురిటిరొప్పులా? కాన్పునొప్పులా? అన్న చర్చ కూడా అనవసరం. రెండు వాడుకలో ఉన్నమాటలే. మనకు తెలిసిందే, మనం విన్నదే ఉచితం అనుకోవడం అజ్ఞత.

కవిత్వంలో—అందునా, ఆధునిక కవితల్లో—శబ్దచర్చలకు ఎంతమాత్రం ప్రాముఖ్యముండాలనో, ఆ చర్చలు చేసేవాళ్ళు ఏపాటి విజ్ఞులుగా ఉండాలో, ఆయా చర్చలవల్ల కొంతతెలుసుకునే అవకాశం ఏర్పడుతున్నది. శేషజాలకు పోక న్యాయంగా తెలియజెయ్యవలసినవి ఉంటే వివరించగలరని కోరుతున్నాను.

ఈ సందర్భంగా మరొక ముఖ్యవిషయంగూడా ప్రస్తావనకు వస్తున్నది. 'ఛందస్సు' వ్యాకరణ సూత్రాలు కవిత్వంకాదని, భావస్పందములోనే ఉత్తమకవితాగానం చేస్తా'నని కవి ప్రతిజ్ఞ. కేవలం వీటిని కవిత్వమన్న వారెవరు?—అని రెడ్డిగారు ప్రశ్నిస్తున్నారు.

కేవలం వీటినే కవిత్వమనేవాళ్ళు ఉన్నారు! వాళ్ళెవరెవ్వరారు, జ్ఞానపీఠ అవార్డు పొందిన విశ్వనాథ అంటున్నారు. ఇంకా వారికి అట్లనే —పద్యం వ్రాస్తే కమే కావ్యమని, పద్యరచయితే కవి అని—ఉంది. "......మరి కవిత్వము ఛందో వేద్యము......"అన్న మాటలను ఎల్లోరా వ్యతిరేకత ప్రతిపాదించే నిమిత్తం అన్నమాటలవి. ఎవరో కొందరు ఛందో వ్యాకరణాలంకారాలే కవిత్వమన్న భ్రాంతిలో ఉన్నారుకాబట్టే ఎల్లోరా పైమాటలన్నారని గ్రహించాలితప్ప, కవిప్రతిజ్ఞను వ్యాఖ్యానించాల్సిన పని లేదు.

ఆంధ్రనామసంగ్రహం కవిత్వమని వ్రాసి నారాయణగాడ అని వుండదే!— అన్నారు రెడ్డిగారు. "అని వుండదే!" అంటే? ఉన్నదా, లేదా —పుస్తకం చూస్తే తెలుస్తుంది గద!

ప్రాస—అనుప్రాసలు తెలుగుభాషకు ప్రాణాలు, దాని రమ్యతకు ఆకరాలు— అంటారు రెడ్డిగారు. ఛందోబద్ధమైనది కవిత్వమే నన్న ధోరణికిది సన్నిహితమైన మాటకాదా? ప్రాసానుప్రాసలు తెలుగు భాషకేనా ఉన్నవి? ఇతర భాషలకు లేవా? కాని యివి ప్రాణాలు మాత్రం కావు. ఇవిలేకపోతే తెలుగుభాష చచ్చిపోదు, లేక వీటితోనే బ్రతికి ఉండదు!

— శ్రీ బండి నాగరాజా

* * * *

# 'కవి విభాగకర్త' యెవరు ?

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే ప్రచురింపబడిన సారస్వత వ్యాసములు — రెండవ సంపుటమునందు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'అప్పకవి కవితా సిద్ధాంతము'లను విమర్శించిరి.

ఆ వ్యాసమున (115 వ పుట యందు) (ఈ) అను విభాగమున ఈ విధముగా వ్రాసినారు. "ఇతనిది (అప్పకవి) ముఖ్య కార్యములలో నొకటి కవులను విభజించుట. నే నెరిగినంతవరకు ఇతడే యీ విభాగమునకాదికర్తయని యూహించెదను'' అని.

అప్పకవి ఏడు విభాగము లిట్లున్నది.

1. వివేకి : 'గుణవర్ణశబ్దార్థగుణదోష నికరంబుల బరికించి' కబ్బము గూర్చువాడు.
2. వాచకుడు : అనుప్రాసనియమము వదలక కవిత్వమల్లువాడు.
3. రేచకుడు : కావ్యమంతయు 'మృదుమధురోక్తిం బ్రవర్తి'ంచువాడు.
4. అర్థార్థి : మితపదములలో నతివిపులార్థము నిమిడించువాడు.
5. శిల్పార్థి : యమకములనాశ్రయించువాడు.
6. భూషణార్థి : అలంకారనిరతుడు
7. మార్గానుగాముడు: సకలపదములలో పూర్వకవుల పూర్వ రసము ప్రతిపాదించువాడు.

పై విధముగా సప్తవిధకవుల లక్షణములను వివరించినాడు అప్పకవి.

అప్పకవి 17వ శతాబ్దమువాడు. 14వ శతాబ్దివాడగు విన్నకోట పెద్దన తన 'కావ్యాలంకార చూడామణి'లో లక్షణ గ్రంథమున సప్తవిధకవుల లక్షణములనిట్లు చెప్పియున్నాడు.

"వాచకుండు రేచకుండును
భూషణార్థియు మార్గానుసారియు
సు వివేకియు నన సప్తవిధము
కవులు నామము రీతికావ్యములను''— అని

తరువాతి పద్యమునందు వానికి లక్షణములం జెప్పియున్నాడు.

అప్పకవికి పూర్వమందున్న విన్నకోట పెద్దన సప్తవిధకవుల లక్షణములను గూర్చి తెలిపియుండగా మరల అప్పకవి తన అప్పకవీయమున తెలుపుట అనవసరము. పునరుక్తియగును. దీనినిబట్టి చూడ లక్ష్యమును బట్టి లక్షణమును నిర్ణయించువాడును, లక్షణమునుబట్టి లక్ష్యమును నియమించువాడునుగాక, లక్షణములనెరిగిగాని లక్షణములు గూర్చువాడప్పకవి యని తెలియు చున్నది. పూర్వలాక్షణికులు తెలిపిన దానినే ఈతడు (అప్పకవి) తెల్పుటచే ఈతని లక్షణానుసరణము స్పష్టముగా గోచరించు చున్నది.

కావున కవి విభాగమున కాదికర్త యితడు కాడని సవినయముగా విన్నవించుచున్నాను.

— శ్రీ ఎమ్. లక్ష్మీనరసింహమూర్తి



# గ్రంథ విమర్శలు

## ఋగ్వేద ఆర్యులు

(రచన : శ్రీ రాహుల్ సాంకృత్యాయన్. అనువాదము : మిక్కిలినేని సుబ్బారావుగారు. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్‌హవుస్, ఏలూరురోడ్డు, విజయవాడ—2. వెల : రు. 12లు. డెమ్మి 255.)

ప్రాచీన భారతీయ సామాజిక ఆర్థిక సాంస్కృతిక జీవన విధానమును ఋగ్వేద వాఙ్మయము ఆధారముగా సహేతుకమయిన విచారణము మీద పరిశీలించి ప్రపంచించిన ఆధునిక వేద విద్వాంసులలో ప్రథమ గణనీయుడు శ్రీ రాహుల్ సాంకృత్యాయన్. ఆయన రచించిన ఈ మహనీయ పరిశోధన గ్రంథమును తెనుగున కనువదించిన శ్రీ మిక్కిలినేని సుబ్బారావుగారును, ప్రచురించిన విశాలాంధ్ర ప్రకాశకులును గొప్ప పనిచేసినారని చెప్పవలయును.

భారతదేశమున ఆర్యులు మొదట నిలిచిన సప్తసింధు ప్రదేశ నిరూపణము చేసి, ఆర్య జనపదములను, అందలి గణ రాజ్య విశేషములను చెప్పుటతో మొదటి భాగమైనది. రావీనది ప్రాంత నివాసులయిన భరతుల వల్లనే మనదేశమునకు భారతదేశమన్న పేరు వచ్చినది. అప్పుడు పంచజనములు అనగా గణములు ప్రసిద్ధములుగా నుండినవి. మహాభారతమున ప్రసిద్ధులుగ నున్న యదు తుర్వసు వంశము లా పంచజనములలోనివే. రెండవ భాగమున ఆర్యుల యొక్క సాంఘిక ఆర్థిక జీవిత విశేషములు సూచింపబడినవి.

మూడవ భాగమంతయు రాజకీయము. ఋగ్వేదమును బట్టి ఋషుల సంఖ్య రెండు మూడు వందల దాక ఉన్నను ఆర్య గణములకు పురోహితులుగా నుండి రాజకీయములను నడిపించిన భృగు— అత్రి— భరద్వాజ — వసిష్ఠ— విశ్వామిత్ర — మొదలయినవారి చేతలను మరియు నితరులయిన ఋషుల ప్రవృత్తి విశేషములను ఒక అధ్యాయము పూర్తిగా వివరించుచున్నది. ఆ పిమ్మట ఆదిమ ఆర్యరాజులుగా మనువు — పురూరవుడు — పేర్కొనబడినారు. ఆ కాలమున జరిగిన పెద్ద యుద్ధాలు రెండని — ఒకటి శంబర యుద్ధము. దివోదాసు శంబరుని వోడించుట. రెండవది సుదాసుడు పదిమంది రాజుల నెదుర్కొని చేసిన దాశరాజ్ఞ యుద్ధము. ఈ యుద్ధములు ముగిసిన పిదప రాచరికము స్థిరపడిన విధమంతయు నొక అధ్యాయమున వివరింపబడినది.

ఆర్యజనముల విద్య — ఆరోగ్యము — రోగములు — చికిత్సలు — మరియు వారి వస్త్రధారణము — భూషణములు — క్రీడా విశేషములు ముఖ్యముగా నృత్యము సంగీతము పానము ఇవన్నియు సప్రమాణముగా నాల్గవదైన సాంస్కృతిక విభాగములో నిరూపింపబడినవి. ఉత్తరార్థమున ఋగ్వేద దేవతల విషయము చెప్పబడినది. భరద్వాజుడు, వసిష్ఠుడు మొదలయిన ఋషులు పేర్కొన్న దేవతలను స్తోత్రములను బట్టి ప్రధాన దేవతానుసారముగా కొన్నింటిని గురించిన విశేషములు వ్రాయబడినవి. అగ్ని — అర్యమ — జలము — అన్నము — ఇంద్రుడు — ఇంద్ర ప్రతులయిన [illegible] — క్రవజాపతి — పురుషుడు — ప్రజాపతి— రుద్రుడు — వరుణుడు — వరస్వతి — సవిత — ఈ మొదలయిన దేవతలు — తదర్చనా విశేషములు — అన్నియు చక్కగా నిరూపితములయినవి. మరియు ఆర్యుల జ్ఞానవిజ్ఞాన విషయ వివేకముకూడ వ్యవసాయము — వాస్తు — కాలము — నక్షత్రములు — తూకములు — కొలతలు — అను శీర్షికల క్రింద చూపబడినది. ఉపసంహార ప్రకరణములలో ఆర్యమహిళలను గురించియు, అప్పటి భాషా వాఙ్మయము లను ఆర్యమహిళలను గురించియు, అప్పటి భాషావాఙ్మయములను గురించియు కూడ సంగ్రహముగా చెప్పబడినది.

ఈ గ్రంథమునందు భవుగోళిక— సాంఘిక ఆర్థిక — రాజకీయ విభాగములును నాలుగును ఋగ్వేదకాలపు ఆర్యజనముల జీవితములను ప్రాణవంతములుగా చేసి చూపుచున్నవి. ముఖ్యముగా రాజకీయ సాంస్కృతిక విభాగములయందలి రచనా విశేషము పాఠకుల మనస్సులకు వేగమును కల్పించి ఆ కాలమునకు లాగికొని ఆ దివోదాసు సుదాసుల మధ్యకు పాఠకులు ప్రవేశించుటకు యోగ్యముగా నాయా ప్రకరణములు వ్రాయబడినవి.

శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ రచనలను అందిపుచ్చుకొని పోవుట యే కర్తవ్యముగాని అభిప్రాయములను చెప్పుటకాదు. ఇంత గొప్ప గ్రంథము తెలుగులోనికి వచ్చినందుకు కృతజ్ఞతా బుద్ధితో ప్రతి తెలుగువాడును దీనిని శ్రద్ధగా నధ్యయనము చేసి తీరవలయును.

## శ్రీచక్ర విలసనము

(రచన: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు. ప్రచురణ : త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం—1 మదరాసు—1. సైజు : క్రవు. 224 పుటలు. వెల: రు. 7—50.)

ఈ గ్రంథమునకిది ద్వితీయముద్రణము. ఇది శాక్తేయ తంత్ర రహస్య సర్వస్వమనదగిన గ్రంథము. పరబ్రహ్మ పదార్థమును పరాశక్తిముఖముగా పొందుటకు అనువయిన ఉపాసనా విధానమును శ్రీ విద్యయందురు. విద్యయనగా అదొక్కటే యని అర్థము. శ్రీవిద్యకంతటికి సంకేత రూపమున ఉపాస్యము అయిన యంత్రమునకు శ్రీ చక్రము అని పేరు. తంత్రములయందనేక విధములుగా ప్రతీకలు చెప్పబడినను శ్రీ చక్రమే యంత్ర రాజము. అదే మహాచక్రము. శివశక్త్యాత్మకమైన పరబ్రహ్మమును పొందుటకు అదే సరి అయిన స్థానము. తాదృశమైన శ్రీ చక్రము యొక్క స్వరూప స్వభావములను తంత్ర శాస్త్ర ప్రమాణ వాక్యములచేత నిరూపించుచు ఉపాస

కుంకు శ్రీ చక్ర విజ్ఞానము కరతలామలకముగునట్లుగా శ్రీ రామలింగేశ్వర రావుగారు ఈ గ్రంథమును రచించినారు. పరాభట్టారికాదేవి యొక్క అనుగ్రహ ఫలమును తామనుభవించిన దానిని శ్రీ రామలింగేశ్వరరావుగారు పదిమందియు తెలిసికొని అనుభవింపవలయునని ఈ గ్రంథమును వెల యించిరి. ఇన్ని రహస్య విషయాలతోను, ఇంత విశేష వివరణములతోను, తెలుగులో ఉన్న శ్రీ విద్యావిషయక గ్రంథమిది యొక్కటియే అని చెప్ప వలయును. ఇది సాధకులకు ఉపాసింపదగిన గ్రంథము.

## కా ల డి

(రచన : శ్రీ గుళ్లపల్లి లక్ష్మీ నరసింహము, ప్రతులకు : రచయిత, తిరుమూర్తినగర్, మద్రాసు—34. సైజు: క్రవున్ 24. పుటలు అమూల్యము.)

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు జన్మించిన 'కాలడి' క్షేత్ర వైభవమును సంగ్రహించుచున్న చిన్న గ్రంథమిది. కేరళ రాష్ట్రమునందున్న ఈ కాలడిలో ఇప్పటికి అరువది సంవత్సరములు క్రితము శ్రీ శృంగేరీ జగద్గురువులు పునరుద్ధారణ చేసి అక్కడ దేవాలయ నిర్మాణమును గూడ గావించిరి. తమిళ మళయాళ దేశ భాషలయందు విశేషముగా నున్న విషయ ములు గ్రహించి శ్రీ లక్ష్మీనరసింహముగారు తెలుగు ప్రజలకా విషయ ములు తెలియవలయునని ఈ కృతిని వెలయించిరి. శ్రీ శంకరుల జీవిత విశే షములు జన్మస్థల వైభవ విశేషములు సంగ్రహముగా నున్న గ్రంథమిది.

## అర్ధనారీశ్వరుడు

(రచన : శ్రీ గరిమెళ్ల వీరరాఘవులు. ప్రతులకు : రచయిత, 7—3—15, రామారావుపేట, కాకినాడ. సైజు : క్రవున్. 41 పుటలు. వెల : రెండు రూపాయలు.)

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు రచించిన "అర్ధ నారీశ్వర స్తోత్రము" నకు వ్యాఖ్యానముగా ఈ గ్రంథము వ్రాయబడినది. శ్రీ వీర రాఘవులుగారు అర్ధనారీశ్వర తత్త్వ రహస్యములను ముందు ఉపోద్ఘాత ప్రాయముగా చెప్పి, శాక్తేయము నందు జ్ఞాన భక్తి యోగ సాధనకే ఈ అర్ధనారీశ్వర ప్రతీక యని నిరూపించిరి. ఇదే ఉపాస్యమని చెప్పినదెంతయు సమంజసముగా నున్నది. శ్రీ వీరరాఘవులుగారు చేసిన స్తోత్ర శ్లోకముల అర్థ వివరణము సాధకుల కెంతయు ఉపయోగముగా నున్నది.

## జాషువ కవిత్వ తత్వం

(సంపాదకుడు : శ్రీ అప్పుమల్లి పూర్ణచంద్రరావు. ప్రచురణ: అభ్యు దయ వేదిక, ప్రజాశక్తి నగరం, విజయవాడ—10. వెల : ఎనిమిది రూపాయలు డెమ్మి. 266 పుటలు.)

స్వచ్ఛాభినివేశ భాషాభిమానము చేత తెనుగు కవిత్వమునకు సేవ గూర్చిన ఆధునికాంధ్ర కవులలో శ్రీ గుఱ్ఱం జాషువాగారి పేరు చెప్పదగిన మొదటి వరుసలో నొకటి. ఆధునిక కవిత్వమున కొకానొక లక్షణమైన ఖండకావ్య రచన కాయన చేసిన దోహదము చాల దొడ్డది. మరియు నాయన కీర్తి ఫిరదౌసి, గబ్బిలము— ముంతాజమహలు అను కావ్య త్రయమిపై వ్యాపించి ఉన్నది. ఆయన కృతులింకను చాలా ఉన్నవి.

శ్రీ జాషువాగారి కావ్య వాఙ్మయమును సంస్కరణ వాదము— మాన వతావాదము — జాతీయతా వాదము — హేతువాదము — ఆస్తికతావాదము— సౌందర్యవాదము — ఈ మొదలుగా గలిగిన అనేక దృక్పథములనుండి నిశి తముగా దర్శించిన ఆరువదిమంది తమ తమ అభిప్రాయ విశేషములను సోదాహరణముగా నిరూపించుచు వ్రాసిన ఉన్న చిన్న వ్యాసముల నీ విధ ముగా సంపాదించి ప్రచురించిన అభ్యుదయ వేదిక కార్యనిర్వాహకులు నిజ ముగా నభినందనీయులు. ఆధునిక కవులందరను గూర్చియును ఇట్టి జిజ్ఞాస బయలుదేరుటకీ గ్రంథము దోహదము చేయవలయును. అది ఈ కృతికి పర్యవసాన రూపమైన ఫలము.

అన్ని వ్యాసములును శ్రీ జాషువాగారి ప్రతిభా వ్యుత్పత్తులకు నివాళ లెత్తుచున్నవి. శ్రీ కల్లూరి బసవేశ్వరరావుగారు మానవతాధర్మమే కవిగారి తాత్త్విక దృక్పథమని చక్కగా నిరూపించినారు. సరదా కవిత్వమును కాక సంస్కరణ భావస్ఫూర్తి గల కవితనే శ్రీ జాషువాగారు రచించినారని శ్రీమతి హేమలతా లవణంగారు చెప్పగలిగినంత చెప్పినారు. ఆస్తికతా దృక్పథము జాషువాగారి కృతులయందు విశ్వమానవతా వాదముగా నెట్లు క్రమ పరిణతి నందినదియు శ్రీ బి. రామకృష్ణగారు నిరూపణము చేయగలిగినారు. సాం ఘిక విప్లవ సాధనకు జాషువాగారి- కవిత దోహదకారిగా నున్న వైనమును శ్రీ యలమించిలి చంద్రశేఖర్ విపులీకరించారు. శ్రీ అమరేంద్రగారు జాషువా కవిత్వతత్వమంతయు సత్య సౌందర్యములను అపూర్వముగా సమ్మేళనము చేయుటగా నున్నదని బహుముఖములనుండి నిరూపించినారు. ఆధునిక కవు లలో ఇంత కవితా శక్తి గల కవి లేడన్న వాక్యమునకు నిదర్శనముగా శ్రీ పొట్ల పల్లి సీతారామరావుగారు వ్రాసిన వ్యాసము గణనీయముగా నున్నది. ప్రజా సామాన్యములోని తెలుగు భాషలో సిద్ధములైన నుడికారములు జాషువా గారి కవితలో ప్రాణ తొత్తులుగా నుండుటను శ్రీ పోలూరి ఆంజనేయ ప్రసాదుగారు చెప్పినారు. ఈ కోవకు చెందిన మరొక చక్కని వ్యాసము శ్రీ మేడవరం వెంకటనారాయణశర్మ గారిది.

నేతాజీ కావ్యమున చిత్రింపబడిన భవిష్యద్భారతమును ప్రశంసించుచు శ్రీ హరి ఆదిశేషువుగారు వ్రాసిన వ్యాసము తరువాత చెప్పదగినది శ్రీ లక్ష్మణ రెడ్డి గారిది. శ్రీలింగం మాలకొండయ్యగారు గబ్బిలమును ఆది మానవతను చిలుకరించు మహాకావ్యమని కొనియాడినారు. ఫిరదౌసి కావ్యమును పరి శీలించిన శ్రీ సంపత్కుమార గారి వ్యాసము, కరుణరస కావ్యముగా ముంతాజ మహలును పరిచయము చేయుచున్న శ్రీ దివాకర్ల వేంకటావధానిగారి వ్యాసము, కపాల కాందిశీకుల సంవాద రూపముగా కల్పింపబడిన, హిందూ బహుర్ధ ధర్మ తత్వములను మీమాంసచేయు కాందిశీకుడు కావ్యమును శ్రీ గొల్లపూడి ప్రకాశరావుగారు సవివరముగా నిరూపణలు చేసినారు. క్రీస్తు చరిత్రను రచించుటలో శ్రీ జాషువా మనస్సు ఎంతగా బైబిలును అనుసరించి పని

చేసినదియు సూచించుచు. అందుకు హేతువులను కూడా శ్రీ పి. సాల్మన్ రాజుగారు తమ వ్యాసమున స్పష్టీకరించినారు.

ఈ విధముగా శ్రీ జాషువాగారి మొత్తము కావ్య సృష్టిని జిజ్ఞాసతో అధ్యయనము చేసియు, ప్రత్యేకముగా ఆయన ప్రసిద్ధికి హేతువులయిన కావ్యములను విడివిడిగా దర్శించియు రచయితలందరును తమ తమ వ్యాసములను చక్కగానే రచించినారని చెప్పవలయును. ఆధునిక కావ్య పాఠకులకీ వ్యాస సంకలము నిజముగా పెన్నిధి వంటిది.

"క్షేమేంద్ర"

## బాలవ్యాకరణ సంజ్ఞా చంద్రిక

(రచయిత్రి. శ్రీమతి గూడపాటి—కృష్ణకుమారి, క్రవున 120 పుటలు నవభారతి ప్రచురణ. వెల రూ. 4. ప్రతులకు— నవభారతి, లంక వీధి, విజయనగరం—2)

తెలుగులో వ్యాకరణ గ్రంథాలు చాలా ఉన్నా, బాల వ్యాకరణానికి ఉన్న ప్రఖ్యాతి గాని, ప్రచారం గాని మరొక గ్రంథానికి లేదు. ఆంధ్ర వ్యాకరణంలో ప్రవేశం సంపాదించగోరేవారు తొలుత దీనినే చదువవలసి యున్నది. దీనిని సమగ్రంగా అవగాహన చేసుకున్న మీదటనే ఇతర వ్యాకరణ గ్రంథాలలోని విషయాలను సులభంగా గ్రహించడానికి సాధ్యపడుతుంది.

చిన్నయసూరి సంస్కృతంలో చక్కని పాండిత్యం సంపాదించి, ఆంధ్రంలో గట్టి కృషి చేసి గొప్ప పండితుడని ప్రఖ్యాతి పొందినాడు. తొలుత తెలుగు వ్యాకరణాన్ని సూత్రప్రాయంగా సంస్కృతంలో రచించి పిదప దానిని అనుసరించే బాల వ్యాకరణాన్ని రచించాడు. అలా రచించినపుడు సంస్కృత వ్యాకరణంలో ప్రసిద్ధాలైన పారిభాషిక పదాలను కూడా తీసుకున్నాడు. అది తప్పనిసరి. సంస్కృతాంధ్ర వ్యాకరణాలకు సన్నిహిత సంబంధం ఉండడమే దీనికి కారణం. సంస్కృత వ్యాకరణ పారిభాషికాలతోపాటు ఆంధ్ర శబ్దచింతామణిలో చెప్పబడిన సంజ్ఞలు కూడా గ్రహించబడినవి.

బాలవ్యాకరణంలో కొన్ని సంజ్ఞలకు మాత్రమే సంగ్రహ రూపమైన వివరణ ఉన్నది. కొన్నిటికి లేదు. ఆంధ్ర వ్యాకరణంలో వాడబడిన సంజ్ఞలన్నిటికీ విపులమైన వివరణ ఉన్నప్పుడే అవి వ్యాకరణ జిజ్ఞాసువులకు సులభంగా బోధపడతాయి. ప్రత్యేకంగా ఆ వ్యాకరణ సంజ్ఞలను వివరించే గ్రంథం తెలుగులో ఇంతవరకూ వెలువడినట్లు కానరాదు. అది పెద్ద లోపమే! ఈ లోపాన్ని గ్రహించి రచయిత్రి పెక్కు గ్రంథాలను పరిశీలించి వ్యాకరణ జిజ్ఞాసువులకు ఉపయుక్తమయిన యీ గ్రంథాన్ని రచించారు.

ఏతద్గ్రంథ రచనలో శ్రీమతి కృష్ణకుమారి పరిశ్రమ ప్రశంసనీయమైనది. సంజ్ఞలను వివరించే ప్రతి విషయమున్నూ సప్రమాణంగాచూపబడినది. పాతంజల మహాభాష్యం మొదలుకొని పెక్కు ప్రమాణ వ్యాకరణ గ్రంథాలనుండి ప్రమాణాలు ఉదాహరింపబడినవి. ఇది 'బాలవ్యాకరణసంజ్ఞా చంద్రిక'యే అయినా 'ఆంధ్ర వ్యాకరణ సంజ్ఞా చంద్రికగా' ఉన్నది. దీనిని బాగుగా చదివి అవగాహన చేసుకున్నవారు బాల, ప్రౌఢాది వ్యాకరణాలను సులభంగా అర్థం చేసుకోగలరు.

రచయిత్రి గ్రంథ ముద్రణలో దొరలిన తప్పులును, శ్రద్ధగా గమనించి, సవరించి తప్పొప్పుల పట్టికను చేర్చారు. మొదట దానిని అనుసరించి పుస్తకం దిద్దుకుని చదువుకోవడం అవసరం

ఇది దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు, పేరి సూర్యనారాయణశాస్త్రిగారు, తూమాటి దోణప్పగారు, కొండవీటి వేంకట కవిగార వంటి ప్రసిద్ధ విద్వాంసుల ప్రశంసలను అందుకొన్నది.

ఆంధ్ర వ్యాకరణ జిజ్ఞాసువులందరూ దీన్ని ఆదరింపగలరని ఆశిస్తున్నాను.

- "అంగిరస"

## ఎదురు తిరుగు

రచన: దొండపాటి రామారావు. వెల : 6 రూపాయలు. ప్రతులకు— రావ్‌సన్ పబ్లిషర్సు, చిత్తూరు. (ఆం. ప్ర.)

ఈనాడు వస్తున్న వర్తమాన రచయితల రచనలు చూస్తే నిత్య జీవిత అనుభవాలకూ, సాంప్రదాయిక ఆలోచనా ధోరణులకూ మధ్య, ఆ అనుభవాలు చూపించే మార్గానికీ అపరిపక్వ సిద్ధాంత అనువర్తనోత్సాహానికీ మధ్యగల తీవ్ర సంఘర్షణ కనిపిస్తుంది. దానిని నిరూపించడానికి నాలుగు సీతికలూ, పరిచయాలతో కూడిన చిన్ని కవిత సంకలనం చాలు

ఈనాడు సామాజిక సంబంధాలలో, సామాజిక విలువలలో వచ్చిన శైథిల్యం ప్రజా జీవితాన్ని మరింత క్రుంగదీస్తూంది ఆ ఘట్టం చూసే ఈ యువకవి "అవినీతికి ఈ కాలం అందలాలు తెచ్చింది" అని విసుగు పోతున్నాడు. 'పంటలన్నీ వేల టన్నుల్లో పండాయి. పట్టెడన్నము లేక వస్తులుంటున్నారు" అని చికాకు కనబరుస్తున్నారు.

---

ఈ దుస్థితికి వెనుక శ్రమజీవులైన అధిక సంఖ్యాకుల వేదనా, శ్రమ భోగులైన కొద్దిమంది లాలసత్వం సంఘంలో కవి చూశారు. శ్రమ జీవి యైన కూలి ''వాడు లేనిదె లేడు ధనికుడు''. అయినా ''నాడు నేడొక తీరు వాడు''. వాని స్థితిలో ఎదుగు బొదుగు లేదంటారు. ''దినము గడిచిన పండుగ''— అతనికి. ఈ చాకిరి పాలు త్రాగి, సిరినాగు కోర విప్పె,'' ''వసంతాలు వచ్చి పోయె. సృష్టి అంతా చిగురించె. నా బ్రతుకే చిగురించక నానాటికి మోడుబారె'' ఏమిటిదనే జిజ్ఞాస వానికి కలిగింది. దానితో ప్రశ్న కూడా వస్తుంది. వచ్చింది. ''మర్యాదలు మీ తాతలు యిచ్చిన ఆస్తులా? చాకిరి మా బ్రతుకుల కొచ్చిన లాటరీ''యా అంటాడు.

ఈ స్థితికి కారణమేమనే ప్రశ్న కవికి కలిగింది. ''రెక్కలుండి ఎగరలేడు. హక్కులుండి పొందలేడు. కారణమేమండీ!''— అని ప్రశ్నిస్తారు.

ఇక్కడే తాత్విక పరిశీలన అవసరం. ఈ నిత్యజీవితానుభవాల్ని సమన్వయం చేయడం ఎల్లాగ?

''కృత్రిమాలు లేవండి. కృత్రిమాలు లేకుంటే కలియుగాన నిలవరండి''. అదే ఈ అవ్యవస్థకు కారణమని ఒక అభిప్రాయానికి వచ్చేరు కవి. నిజాయితీ కూడదంటారు.

''మంచి మనిషి అయినవాడు మనిషి కాదురా. మనిషిలోన మంచి ఉంటే నిజము కాదురా. మంచికీ మనిషికీ పొత్తు లేదురా. ఆ పొత్తు కుదిరె మనిషుంటే బ్రతుకే లేదురా''. అంటూ సామాజిక సంబంధాలతో సినికల్ దృక్పథం కనబరుస్తున్నారు.

ఎందుచేత ఈ స్థితి వచ్చింది? ''పార్టీల నమ్మి జనం వోటులందించారు. ప్రజల నమ్మి వారు అధికారులయ్యారు . . . పిచ్చి కేకలు నమ్మి ''పాలిటిక్స్''ని ఎంచి అల్లరిమూకలకు ఎల్ల సత్కారమ్ము! . . . పూదీప మిది యని ముద్దిడగబోయాము. మీసాలు కాలాయి మూతి మాడింది''— అని ప్రస్తుత రాజకీయ స్థితికి విసుగుదల, దానిపై అవిశ్వాసము కనబరుస్తున్నారు.

దీనికి పరిష్కారం తాత్వికంగా ''మా రాతలు మంచివి కావలె, ఈ రాక్షసి మూకను మారరా?'' అని ఒక చోట ''హద్దు మీరినవాడు ముద్దు నెరుగకపోడు. బుద్ధి చెప్పి వాని బ్రతుకు దిద్దమ్మా!'' అని, ఒకరితో ''అవినీతిని అణచివేయ పోరాటం. దుర్మార్గుల మార్చుటకే విప్లవం''— అవసరమని మరో చోట అంటాడు. కవి.

సంఘంలో నేడున్న దుష్ట పరిస్థితికి ''ఒక్కటే విరుగుడు— అది ఎదురు తిరగడం'' అంటున్న ఈ రచయిత ఎదురు తిరగడం ఎవరి మీద? ఏం సాధించటంకోసం?— అనే ప్రశ్నలకు ఇచ్చిన సమాధానం ఇది.

''ఒకడి కంటె తక్కువవాడింకొకడున్నాడని సంతసించకండి. ఒకడికంటె ఇంకొకడెందుకెక్కువని మాత్రం అడగండి'' అని ఉద్బోధిస్తూ, ''శ్రమ జీవిని గౌరవించని ఏ దేశం బాగుపడదని'' శపిస్తూ, ''ఈ దేశపు సమైక్యతను, సౌభాగ్యాన్ని నాశనం చేయు కుతంత్రం పతనం చేయాలని ఎదురు తిరగండి'' అని ఆవేశిస్తున్నారు.

అంటే సామాజిక పరిణామాలు చూసి కవి బాధపడుతున్నాడు. కారణాలు ఆలోచిస్తున్నాడు. సాంప్రదాయిక విజ్ఞానం నుదుటి రాతలనూ, కర్మలనూ చూపుతోంది.

దేశంలోని పరిణామాలు ఎన్ని కలమీద అవిశ్వాసం కలిగిస్తున్నాయి. ఎదురు తిరగడానికి కవ్విస్తున్నాయి.

అయితే ఈ ఎదురు తిరగడం ఏం సాధించడం కొసం అంటే సమాధానం చెప్పడానికి స్పష్టమూ, శాస్త్రీయమూ అయిన సామాజిక పరిణామ చరిత్ర గతి జ్ఞానం కావాలి. నేటి అనేకమంది యువ కవులకు లాగే ఈ కవికీ ఆ విషయంలో జ్ఞాతాజ్ఞాతంగా నున్న అస్పష్టపుశ్రుత జ్ఞానమే ఆధారం. ఫలితంగా— 'దుర్మార్గుల మార్చుటకే విప్లవం'. ''ఎదిరించితేగాని విధిని దాటగలేవు''— అంటూనే ''బుద్ధి చెప్పి బ్రతుకు దిద్దమ''నడం తటస్థించింది.

విప్లవం, ఎదురు తిరగడం— అనే భావాలకు ఒక స్పష్టమైన ఆకృతి కవి హృదయంలో లేదు. అవి ప్రస్తుతం యువ కవిలోకంలో ప్రచలితంగా ఉన్న రెండు పదాలు మాత్రమే. అందుచేతనే పరిచయం చేస్తూ ఒక మిత్రులు ''హతమార్చుటకే విప్లవం'' అననందుకు సంతోషించినా, ఎదురు తిరగవలసిందేనని ధృవీకరిస్తూ మరో మిత్రులు సాయుధ పోరాటం కావాలనే దృక్పథాన్ని కవి అంగీకరించరని నొచ్చుకున్నా ప్రయోజనం ఏమాత్రం లేదు.

మార్చడం, హతమార్చడం, ఎదురు తిరగడం, సాయుధ విప్లవం వంటి పదాలు తాత్విక వివేచన దేశంలో ఉన్న కొన్ని ప్రత్యేక పరిస్థితుల అవగాహనకు సంబంధించినవి. కుంతికి గర్భం ఇవ్వగలవాడివి ధనికులకు దయ నివ్వలేవా అని సూర్యునికి వేసిన ప్రశ్న, దుష్టత్వం— శిష్టత్వం పగలు— రాత్రివంటివనే ఉపమానం రచయితకు గల ఆ అవగాహన వివేచన ఎటువంటిదో తెలుపుతున్నాయి. పదాలు చూసి మిత్రులు పొగలాగేరంతే.

రచయితగాని, పరిచయకర్తలు గాని ఒక్కమారు కూడా ఉచ్చరించకపోయినా, వీరందరి మనస్సులలో మెదులుతున్నదీ, ఏదో ఒక రూపంలో బయటపడుతున్నదీ ఒక అంశం ఉంది. ప్రస్తుత సమాజం మారి నూతన సమాజం ఏర్పడే క్రమంతో హింస (Violence) పాత్ర ఏమిటనేదే ఆ అంశం. ఆ సమస్యమీద కూడా మార్క్సిజం ఏమంటూంది అనేదే అందరి ఆలోచనల వెనకా ఉంది. దానిని చెప్పడం అనవసరం.

నూతన సమాజావతరణలో హింస మంత్రసానిలా వ్యవహరిస్తుందనేది మార్క్సిజం చెప్తూంది. ఏమీ సందేహంలేదు. కాని, హింస అనడంతో వ్యక్తి సంహారంగాని, యుద్ధం అని గాని దాని ఉద్దేశ్యంకాదు. ఏతద్భిన్నంగా సామాజిక హింస, సామాజిక విప్లవమూ సుద్దేశించి మార్క్సిజం చెప్తూంది. సామాజిక (సోషలిస్టు) విప్లవం యొక్క ప్రధాన లక్ష్యం హింస, దవుర్జన్యం కాదు. సమాజాభివృద్ధిని నిరాటంకంగా, నిరామయంగా సాగించడం మాత్రమే. సామాజిక విప్లవారంభ దశలో పోరాటంలో హింసాయుత రూపాలూ, పద్ధతులూ ఉండచ్చు. ''విప్లవాత్మక హింసలేకుండా కార్మిక వర్గం విజయం పొంది ఉండేదికాదు. నిర్దిష్టములయిన కొన్ని అభివృద్ధి దశలలో, నిర్దిష్ట

పుట్ట, మంటల మయం. ప్రొద్దునే మంచం దిగింది మొదలుకొని మళ్లీ మంచం ఎక్కేవరకూ అడుగడుగునా సంఘర్షణ క్షణం క్షణం గండాలే. అలాంటి సామాన్య మానవుల బ్రతుకుల్లో జరిగే అతిసామాన్య సంఘటనలనుండి అసాధారణ కథల్ని పండించిన కథకచక్రవర్తి శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు" అన్నారు శ్రీమతి బీనాదేవి. ఎంతయిందీ ఏకీభవిస్తారా ఈ అభిప్రాయంతో. కథ ఇలా ఉండాలి అని నిర్వచనం చెప్పటం ఒకవంతు. ఆ నిర్వచనాని కనుగుణంగా కథ వ్రాయగలగడం మరొకెత్తు. సామాన్యుల దైనందిన జీవిత సమస్యలనుంచి శ్రీ కుటుంబరావుగారికంటే మంచి కథలను పండించిన రచయిత బీనాదులేనే లేరనగలమా ? అంతమాత్రాన తెలుగు కథారచనా పరిణామంలో శ్రీ కుటుంబరావు ప్రాముఖ్యాన్ని కించపరచడం యీ విమర్శకు ఉద్దేశంకాదు. ఒక సార్వత్రిక నిర్వచనం ఇచ్చి, ఆ నిర్వచనానికి ఉదాహరణ చెప్పేప్పుడు ముఖస్తుతి, వ్యక్తి ప్రశంస అస్కారమివ్వతగదు. అది అటు ఆలంకారికుల పద్ధతికాదు ఇటు పాశ్చాత్యుల పద్ధతికాదు..

"సమాజం సజీవంగా ఉంటే ఎటువంటి కథల్ని సమర్పించినా ఫరవా లేదు కాని, మన సమాజం రోగగ్రస్తమైంది" అన్నారు శ్రీమతి బీనాదేవి. ఎక్కడి నుంచి వచ్చింది ఈ రోగం ? ఎవరు కారకులు ఈ రోగానికి ? రోగం వచ్చిందని చెప్పేవారు మాత్రం సమాజంలోనివారు కారా ? మరివారు మాత్రం యీ రోగాన్ని పోగొట్టే కథల్ని ఏ విధంగా సమర్పించగలుగుతారు.నిజమే. సమాజం రోగగ్రస్తమైంది కనుకనే ఎవరేమి వ్రాసినా సహిస్తున్నది. మొదట జరగవలసిన పని శ్రీమతి బీనాదేవిగారు చెబుతున్న వ్యాధినుంచి రచయితలు బయటపడడం.

"కథల తీగ తీలాగితే

సాహిత్యపు డొంకంతా కదుల్తుంది" అనే చరణంతో ప్రారంభించారు 'తెలుగుకథ—సామాజిక స్పృహ' అనే వ్యాసాన్ని శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ. "రాసిందంతా సాహిత్యం కానట్లే స్పృహతో రాసిందంతా సామాజిక స్పృహతో రాసినట్లుకాదు. మరి సామాజిక స్పృహ అంటే ఏమిటి ?" అని ప్రశ్నించి సమాధానంగానే—ఎవరి ప్రయోజనాలకోసం రాస్తున్నాడు అనేది రచయితలకు ఈనాడు అగ్నిపరీక్ష. విస్మరణవాద సాహిత్య పాదరక్షకులకు శిక్ష" అన్నారు ఒక పెద్ద పేరాలో. అంతేకాదు. "వ్యవస్థ స్వరూపాన్ని, స్వభావాన్ని అర్థం చేసుకోనకుండా చేసే రచనలు ఆత్మాశ్రయాలూ అయోమయాలూఅయిపోతాయి" అని కూడా అన్నారు. వ్యవస్థను అర్థం చేసుకుని రాయాలనేదే ఆశయం. అయితే వ్యవస్థ అర్థం కావడం అనేది ఆయా రచయితల సంస్కారాన్ని బట్టీ, చదివిన చదువును బట్టీ, మసులుకునే సమాజాన్ని బట్టీ ఉంటుంది. "ఇదుగో—వ్యవస్థను అర్థంచేసుకోనడమంటే ఇది" అని ఎవరూ శాసించలేరు నిర్వచించలేరు. ఒకవేళ ఆవిధంగా ఎవరయినా శాసించినా, ఆ శాసనానుగుణంగా తయారయ్యే సాహిత్యంలో వైవిధ్యానికి ఆస్కారం ఉండదు. రచనలు చేసే వారందరికీ కాకపోయినా కొంతమందికయినా సామాజిక స్పృహ అంతో ఇంతో ఉంటుంది. అయితే అది ఉండవలసినంతగా ఉండదేమో అది వేరే సంగతి. సెక్సు సాహిత్యంచేసే రచయితకు సామాజిక స్పృహ ఏ కొంచెమైనా లేదనగలమా? మానవుని సహజగుణాలలో ఒకటయిన సెక్సును సొమ్ము చేస్తూనా కొట్టి వెయ్యడం సామాజిక స్పృహ లక్షణం ఎప్పటికైనా ? అయితే ఆ సెక్సును ఎట్లా వ్రాశాడూ ? ప్రయోజనం, లక్ష్యంవంటి వాటికి ప్రాముఖ్యం ఎంత ఇచ్చాడూ ? సెక్సుకోసమే సెక్సు అనే దృష్టితో వ్రాశాడా అనేవి ఆలోచించవలసిన అంశాలు. ఒక్క సెక్సేకాదు. మరే ఇతి వృత్తాన్ని తీసుకున్నప్పటికీ దాన్ని ఏ విధంగా పాఠకులకు అందజేశాడనేది ప్రధానం. శ్రీ శర్మగారి వ్యాసంలో చాలా ఉన్నయ్ చర్చించదగిన అంశాలు. ముగింపులోవారు సెలవిచ్చి"నట్లు "నిప్పుల మంటల్లోనుంచి కత్తుల వంతెనల మీదనుంచి జాతిని నడిపించుకొని ముందుకు తీసుకుపోగల కొత్త గళాలు కొత్త కలాలనుంచే రావాలి." అయితే ఈ నిప్పుల మంటలు, కత్తుల వంతెనలవంటి వాటితో నిమిత్తం లేకుండానే పరిణామ ప్రవాహంలోనుంచి వస్తున్నయ్ కొత్త గళాలు—కొత్త కలాలు వస్తున్నయ్.

శ్రీ మధురాంతకం రాజారాం వ్రాసిన వ్యాసంలో సమదృష్టి వ్యక్తమవుతుంది. 'పాత్రచిత్రణ' అనే అంశం గురించే చర్చించారు" గడుసుమొగుళ్లూ చాదస్తపు పెళ్లాలూ, పక్కజిత్తుల కనకయ్యలు, నిరుద్యోగులు, బాల వితంతువులు, కోతిపట్టు పార్వతీశాలు, బ్రతుకు భయం సీతప్పయి, తిక్కశంకరయ్యలు, డిటెక్టివ్ కేయాసులు. 'క్రైసిసు'లాంటి రచయిత్రులు— ఇలా కొడవటిగంటి పాత్రలతో ఒక 'ప్రొసెషను' గనుక ఏర్పాటుచేస్తే అందులో అనంతమైన వైవిధ్యం కానవస్తుంది" అన్నారు. అయితే ఇది ఎటువంటి వైవిధ్యం ? పాత్రం రూపంలో వైవిధ్యమా ? వాటిని నడిపించిన తీరులో వైవిధ్యమా ? శ్రీ మునిపల్లెరాజు 1954 మార్చి భారతిలో వ్రాసిన అరణ్యంతో 'మానవయంత్రం'నుంచి చెప్పదంటనకు పొయ్యేరు జనులార మీరు....', అనే చరణంతో యీ వ్యాసాన్ని ముగించడం సమంజసంగా ఉన్నది.

ఈ వ్యాసాలన్నింటిలోనూ శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం వ్రాసిన 'తెలుగుకథః శిల్పం' అనే వ్యాసానికి ప్రథమస్థానం ఇవ్వడం న్యాయమని నా అభిప్రాయం. ఎందుకనంటే (1) శీర్షికకు న్యాయంచేసే విధంగా రాశారు. (2) ఏ రచయిత వ్రాసిన కథలలో శిల్పం ఎలా ఉన్నదో ఉదాహరణలతో నిరూపించారు.

"ప్రతీకని పెంచుకుంటూ పోవడంలో విశ్వనాథశాస్త్రి శిల్ప వైశిష్ట్యం వ్యక్తమవుతూంటుంది" అన్నారు శ్రీ సుదర్శనం.

"ఆధునిక శిల్పంలో వచ్చిన మార్పు కథకుడు తన సర్వజ్ఞత్వాన్నీ, ఇదే సత్యం, ఇంతకంటే సత్యంలేదు అనే ధీమాను వదులుకోవడం" అన్నారు. ఎంత బాగా చెప్పారూ"..." సహృదయులకూ, రసజ్ఞులకూ, సామాజిక స్పృహ కలవారికి మాత్రమే అర్థమయ్యే సంగతి ఇది.

"ఒకటే ఆలోచనలకూ, భావాలకూ ఒక ధోరణిలో అక్షరరూపాన్ని ఇవ్వడం 'శైలి'" అనే వాక్యంతో తెలుగుకథ శైలి అనే వ్యాసాన్ని ప్రారంభించారు శ్రీ శీలా వీర్రాజు. ఈ వ్యాసానికి కూడా ప్రథమ స్థానమే లభించుతుంది. ఏది శైలి అవుతుందో, ఏదికాదో వివరించారు "శిల్పానికి ప్రాణం పోసేది శైలి" అన్నారు. "మంచి శైలి అంటే మాటల గారడీకాదు" అన్నారు ఈ మాటల గారడీ యీ సంపుటిలోని కొన్ని వ్యాసాలలోనే ఉన్నదంటున్నందుకు క్షంతవ్యుడను.

"శైవము దాటి మనసు ముసలితనమ్ము నాశ్రయించుటకు దేశమర్యాద పోకు" అని తను ఏదో సందర్భంలో వ్రాసిన చరణాలతో తెలుగు కథ—వికాసం ఉరవ్ తెలుగు కథకు ఈడొచ్చిందా ? అనే వ్యాసాన్ని ప్రారం

భించారు శ్రీ పాలగుమ్మి పద్మరాజు "తెలుగుజాతి—మొత్తం భారతజాతి ఇంకా శైశవ దశలోనే ఉంచే తెలుగుకథ, ఖండకావ్యం పుట్టుకతోనే యౌవన దశనందుకున్నాయి' అన్నారు. నిజంగానా ?

క్లిష్టంగా, జటిలంగా, అయోమయంగా కనపడే వర్తమాన సమాజాన్ని అర్థవంతంగా చిత్రించగల—భారత కథవంటి కథలు—ఎన్నటికీ మరచిపోలేనివి ఏవైనా తెలుగులో వస్తే, అప్పుడు తెలుగు కథా సాహిత్యం నిజంగా సంపన్న మైందని సంతృప్తి పడొచ్చు. అప్పుడు తెలుగు కథకు ఈడొచ్చిందని చెప్ప వచ్చు" అంటూ ముగించారు వ్యాసాన్ని. కనీ భారత కథవంటి కథలు మళ్లీ ఎలా వస్తాయ్. దేశకాల పరిస్థితులలోనుంచే గదా సాహిత్యం వస్తోంది. భారతకాలం నాటి పరిస్థితులు మళ్లీ వస్తవా కాలగమనంలో మనిషి అనుభవాలూ వూహలూ, పెరగవా ? మారవా ? అదీగాక ఎన్నటికీ మరచిపోలేని కథలను వ్రాయాలనే దొక స్వార్థం కాదా ?

ఆధునిక కథ గురించి ఈ విమర్శనాత్మక వ్యాసం సంపుటిని ప్రచురించినం దుకు మెచ్చుకోవట్నం "ఆంధ్ర సారస్వత సమితి కృషిని ప్రశంసించుతున్నాను. ఇటువంటి పరిశీలనా వ్యాస సంపుటాలు తెలుగులో ఇంకా ఇంకా వస్తే బాగుం టుంది. అంత వోపిక ఎవరికున్నదండీ ఈ రోజులలో.

**- శ్రీ వి. ఎస్. అవధాని.**

## మంత్రాలయం (జానపద నవల)

రచన : సాహిత్య సార్వభౌమ శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు. (ప్రచురణ : బి. బి. యస్. పబ్లిషింగ్ హవుస్, కోడంబాకం. మదరాసు—24. మూల్యం రూ. 5 పేజీలు 388.)

కొవ్వలి పేరు తెలియని ఆంధ్రుడు లేడంటే ఆశ్చర్యపడనక్కరలేదు జీవితాన్ని నవలాసాహిత్యాంకితం చేసిన రచయిత. తెలుగు దేశంలో శతాధిక గ్రంథకర్తలే అరుదు. కాని సహస్ర గ్రంథకర్త కొవ్వలి లవ్వ నరె ప్పలా లేరేమో. సామాన్య జనులకందుబాటులో నుండె నాడుకి భాషలో రచనలు చేసిన మరుపురాని మనిషి. ఆంధ్రులపై వారి రచనలు చెరుగని ముద్రను వేసినవి. ఇంతకుపూర్వం 999 రచనలు వచ్చాయి. ఈ మంత్రా లయం వారి 1000వ రచన.

ఈ నవలకు నింత దృశ్యాలు, బ్రహ్మాండమయిన కన్ను, దాని నుండి ఉష్ణకిరణాలు ప్రసరించుట. తదుపరి కన్ను మాయమై ఆ స్థానంలో సాగరం కానవచ్చుట. అదీ అదృశ్యమై ఓంకారం కాన్పించుట. ఆ కాన్పించిన దృశ్యాలు రచయితకు ఆనందం కలిగించాయట. అందువల్లనే ఆ 'భావాలను పురస్క రించుకొని ఆధ్యాత్మిక విషయాలు కొన్నింటిని మామూలు నవలలో చొప్పించి ఒక రచన చేయాలని సంకల్పం కలిగింది. అదే ఈ రచనకు మూలం' అని రచయితే వివరించారు. అయితే ఆ భావాలను వారేవిధంగా రూపకల్పన చేసి ఎలా వ్రాసారని తెలిసికోవాలంటే మంత్రాలయం పూర్తిగా చదవండి.

అణుశక్తి యుగంలో కొట్టుమిట్టాడుచున్న ఈ తరుణంలో ఇలాంటి నవల రాయటం చిత్రమే. మంత్రాలకు చింతకాయలు రాలే కాలం పోయింది. సాంఘిక సమస్యలతో తల్లడిల్లే నేటి సమాజం ఈ నవలను ఎంతవరకు ఆదరించగలదనే నా సందేహం?

ఈ 'మంత్రాలయం' చదువుతున్నప్పుడు భేతాళ కథలు గుర్తుకు వస్తాయి. మహారాజు మహేంద్రవర్మ, మహారాణి అలివేణి, వీరికి కుమారుడు పుట్టాడు. లేక లేక కలిగిన రాజకుమారుడు దుష్ట జాతకుడని తెలిసి మంత్రి అయిన సుబుద్ధి ఆ బిడ్డను పర్వతంపై వదలి వచ్చాడు. ఆ బిడ్డను కోతి రక్షిస్తుంది. ఆ కోతి నుండి దుందుభి అనే రాక్షసుడు బిడ్డను పొందును. బిడ్డను పెద్దవానిగా చేసి రాజకుమారుని రూపం తాను పొంది, తన రూపం రాజకుమారున కప్పగించి దేశం మీద పడ్డాడు.

ఆ రాజకుమారుడు మంత్రాలయంలో సిద్ధేశ్వర్ భక్తునిగా ఉం టాడు. రాక్షసుడు యువరాజు రూపంలో మహేంద్రరాజ్య ప్రజలకు నానా విధములైన యిబ్బందులను కలుగజేయును. మంత్రి యదార్థం తెలిసికొను టకు రాక్షస రూపంలో నున్న యువరాజును వెంటాడి అసలు విషయాన్ని బయటపెట్టి మహేంద్రవర్మ కన్నులు తెరిపిస్తాడు. అసలు యువరాజు సిద్ధే శ్వర్ అనుమతితో రాక్షసుని పరిమార్చుటకు బయలుదేరిపోవటం సాగిస్తాడు. రాకసుని మాయల ముందు యువరాజు నిలబడగలిగినా అతన్ని తుదముట్టించ లేకపోయాడు. చివరకు మంత్రాలయంలో మహారాజు చిరంజీవిని చూచి కౌగలించుకున్నాడు. ఇది ప్రధాన కథ. దీనికి సంబంధం లేని అనేక ఉప కథలు రచయిత కల్పించారు. ఇందలి కొన్ని ఉప కథలు చూడండి. 12వ పేజీ నుండి దుందుభి పాత్ర ప్రవేశం, 17వ పేజి గోపీనాద్ గాథ, 25వ పేజి చంద్రి అనే రాధ కథ, 33వ పేజి కైలాసదేవ, 40వ పేజి మహా ఉమ వేట గాని చరిత్ర, 58వ పేజీ మార్తాండ మహరాజు రాయబారి తారాదేవి, 102— ఛాయా రూప ప్రవర్తన, 122 తార—సీతా ప్రేమకలాపం, 135 భట్టాచార్యులు—భార్య నాంచారు, 144 బైరాగి వేషంలో సుబుద్ధి. ఈ విధంగా రకరకాల కథలు ఉన్నాయి.

ఈ మంత్రాలయంలోని కథలను కలిపి ఒకే గ్రంథంగా ప్రకటించుట కంటే ఒక్కొక్క గాథను ఒక్కొక్క నవలగా చిత్రించవచ్చును. కొవ్వలి ఆ పని చేసి ఉంటే బాగా ఉండేది. ఇందలి గోపీనాద్—చంద్రి కథ ఉత్కంఠ భరితంగా ఉన్నది. వీరి జీవితం సాఫీగా సాగలేదు. ఒక్కో ఘటనలే. అయితే వారిరువురూ పరస్పరం కొరకు ప్రేమకులాడుతూ జంటగా కాన్పిస్తారు.

294వ పేజిలో గంగ ఒడ్డున మన్న వారణాసి సమీప గ్రామమునందలి మధ్య తరగతి కుటుంబ గాథ హృదయ విదారకంగా కానవస్తుంది. తండ్రుడు అనుమతమార్చిన బిడ్డ కెట్టి స్థితికలెనో అనునది ఆ కథ వలన తెలిసికొనవచ్చును.

ఈ విధంగా రసవత్కథలు రెండు మూడు ఉన్నాయి. మంత్రా లయం గనుక సన్నివేశాలు కూడ ఆ విధంగానే ఉన్నాయి. ఈ నవలలో కొన్ని లోపాలున్నాయి.

యువరాజు తన రాజ్యానికి వచ్చి ప్రజలను సుఖపెట్టి వరప్రదాతగా బుజువు చేయుట జరుగలేదు. అయితే రచయిత ఉదాత్తపాత్ర్యం చేత ఎలిన

భావి జీవితంలో జరిగే సన్నివేశం చెప్పించినప్పటికి యువరాజు పాత్ర చిత్రణలో పరిపూర్ణత రాలేదు.

దుందుభిని యువరాజు వెంటాడి అతని శక్తులను క్రుంగదీయుటకు ప్రయత్నించాడు కాని యువరాజు రాక్షసుని వధింపలేదు. ఛాయారూపుని సంహరించి, గోపీనాథ్‌ను రక్షించి తాను మూర్ఛితుడయ్యాడు. మంత్రాలయం చేరే వరకు అతన్ని స్మృతిలేనివానిగా చిత్రించుట సందర్భోచితంగా లేదు.

చంద్రికి రెండు జన్మలు వచ్చాయి. చంద్రిని యధాతథంగా ఉంచిన యెడల కథకు పటుత్వం ఉండేది. ఆ చంద్రి రాధగా మారి గోపీతో కలియుట బాగాలేదు.

మార్తాండేశ్వరుని రాయబారి తారాదేవి కైలాసపదవి పరిచారిక సితారా యిరువురూ 'హోమ సెక్సు'లో ఉన్నట్లు చూపించుట ఎబ్బెట్టుగా ఉన్నది. (122వ పేజి) గోపీనాథ్ చంద్రిని 'రేప్' చేసినప్పుడు రచయిత చెప్పిన తీరు హేయంగా ఉన్నది.

మాధవితో సర్పములుగా మారిన కాశ్యప పుత్రుడు తన భార్యను గూర్చి (నేనామెను కవుగిటిలోచేర్చి . . . . . మునిగి తేలాను" (297 పేజి) చెప్పిన మాటలు జుగుప్సను కలిగిస్తున్నాయి. పాము రూపంలో ఉన్న కాశ్యప పుత్రుడా స్త్రీతో మాట్లాడుట సంభావ్యంగా లేదు.

రచయిత ఉప కథతో నవలను అనవసరంగా పొడిగించారు. కొన్ని లేకపోయినను ఫరవాలేదు. చివరి పేజీలో రచయిత తన అధ్యాత్మిక ధోరణిని వ్యక్తం చేశారు. ఈ నవలను కొవ్వలి సిస్టర్ శ్రీమతి సూర్యకాంతంకు అంకితమిచ్చారు. ఈ నవలపై నిడదవోలు వెంకటరావుగారు, చలం, చక్రపాణి, పి. బి. శ్రీనివాస్, భానుమతి మొదలగువారు తమ అభిప్రాయాలను వివరించారు.

"తెలుగు జాతి ఉన్నంత మేర తెలుగు గాలి సోకినంత దూరం, తెలుగు అక్షరాలు నేర్చిన వారిలో శ్రీ కొవ్వలి రచనలు చదివి ఆనందించనివారు, అభినందించనివారు ఉండరనటం అతిశయోక్తి కాదు".

— శ్రీ రామమోహన్.

## కుసుమ మంజరి

(కవితా సంకలనము. డెమ్మీ సైజు పుటలు : 28. మూల్యము : ఒక్క రూపాయి. ప్రతులకు : శ్రీ ఆర్. అనంత పద్మనాభరావు, ఎమ్. ఏ., ప్రభుత్వ కళాశాల. కందుకూరు 523105)

ఇది ప్రకాశం జిల్లా కందుకూరు తాలూకా రచయితల సంఘంవారి ప్రచురణ. సంకలన కర్త శ్రీ ఆర్. అనంత పద్మనాభరావుగారు చెప్పినట్లు వివిధ రంగాలలోని వ్యక్తులు స్వీకరించిన వస్తువులో వైవిధ్యంచేతా, వారి వారి వయోభేదంచేతా రచనలలో హెచ్చుతగ్గులున్నమాట వాస్తవం. సంస్కృతాంధ్ర కవితలు కూడా ఇందులో మచ్చుకోసం చేర్చబడ్డాయి. నిద్రపోతోంది వీకర్తవ్యం, గాలికబురు, ఏం వ్రాయాలి ? ఎన్నికల ప్రహసనం, స్వరాజ్యం చెక్కిన సజీవ శిల్పం, జీవితం నాడు—నేడు, గౌతమి ఈ ఖండికలు బాగున్నాయి. శ్రీ సి. వి. ఆర్. కృష్ణస్వామిగారు రచించిన **The Mundane Heaven** ఆంగ్లపద్యం అంత్యానుప్రాసలతో అత్యంత మనోహరంగా సాగింది. ఎందరో వర్ధమాన రచయితలను ఒకదరికి చేర్చిన శ్రీ అనంత పద్మనాభరావుగారి కృషి ప్రశంసనీయం.

— శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు.

**Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.**

KLVA104M119

BC



# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 210/- | రు. 180/- |
| 2 లేక 3వ కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 180/- | రు. 150/- |

లోపలి పేజీలు

| | | | |
|---|---|---|---|
| పూర్తి పేజి | ... | రు. 150/- | రు. 120/- |
| అర పేజి | ... | రు. 78/- | రు. 66/- |
| పావు పేజి | ... | రు. 48/- | రు. 42/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం. నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| విడి ప్రతి | రు. 1-50 | 1-60 |
| 6 మాసముల చందా | రు. 9-00 | 9-60 |
| సంవత్సర చందా | రు. 18-00 | 19-20 |

మేనేజరు, భారతి

విజయవాడ-520003.

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M119 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, IV, BCI |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | Afsan |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |